# 15 బహుమతులను గెలవండి




## మెజెస్టిక్®

మీ కూపన్ నేడే పొందండి.
పండుగ బహుమతుల పథకంలో చేరండి.

లక్కీ డ్రా :
ప్రతినెలా 15వ తేదీన.
స్థలం:మహావీర్ కంబైన్స్
హైదరాబాదు. ఫోను. 231198

అన్ని మెజెస్టిక్ ప్రెషర్ కుక్కర్లకు పండుగ బహుమతి కూపన్ వుంది. బహుమతి పొందే కూపన్ మీదే కావచ్చు. మీకు చేరువలో వున్న డీలర్ నుండి వివరాలు పొందండి.

ప్రథమ బహుమతి





రెండు రెండవ బహుమతులు



మూడు మూడవ బహుమతులు

నాలుగు నాల్గవ బహుమతులు



అయిదు ఐదవ బహుమతులు



## మెజెస్టిక్®

ప్రెషర్ కుక్కర్

సొమ్ము విలువకు తగ్గ ప్రెషర్ కుక్కర్

ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్స్  మహావీర్ కంబైన్స్, కంచన్ జంగ కాంప్లెక్స్, కింగ్ కోఠి రోడ్, హైదరాబాద్-1 ఫోన్ 231198, 235856

అన్ని ప్రఖ్యాత దుకాణములలో లభించును.

## ముఖచిత్రం

23-29 జనవరి,'87 ఆంధ్రసచిత్ర వారపత్రికపై అందాలతార శ్రీదేవి ముఖచిత్రం అందంగా, ఆకర్షణీయంగా ఉంది

–డి శ్రీదేవికుమారి, ఇచ్ఛాపురం

## సీరియల్స్

యం యస్ ఆర్ చౌదరిగారి సీరియల్ 'ఆశయం' ప్రారంభంలోనే మమ్మల్ని ఆకట్టుకొంది కుటుంబంలో ప్రతి ఒక్కరు చదువుకోదగిన నవలఇది

–చెంగల కృష్ణమూర్తి, లింగన్నపాలెం

★ ★ ★

శ్రీదేవి ముఖపత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వార పత్రిక శోభాయ మానంగా ఉంది "ఆశయం" సీరియల్ ఈ వారం వేగాన్ని పుంజుకొంది

–సాయినిరాజు, నేలకొండపల్లి

★ ★ ★

"ఆశయం" సీరియల్ ఇంట్రెస్టింగ్‌గా ఉంది ముందు ముందు ఏమిజరుగుతుందో అన్న సస్పెన్స్‌తో చక్కగా ఉందీ సీరియల్

–కె సరస్వతి, నారు రాజుపాలెం

## కథలు

అందాలతార శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రికలో 'సంక్రాంతి అల్లుడు", "ఋణం తీరిపోయింది", గెలుపు ఓడింది" కథలు బాగున్నాయి 'సూరిగాడు" కథ ఇంకా బాగుంది

–నరసింహ కుమార్‌దాసు, ఇచ్ఛాపురం

★ ★ ★

శ్రీదేవి ముఖచిత్రం గల సంచిక నందలి కథల్లో "సంక్రాంతి అల్లుడు' 'బంగారునంది" చాలా బాగున్నాయి

–ఎం శివాజీ, మోదుకూరు

★ ★ ★

శ్రీమధురాంతకం రాజారాం గారు వ్రాసిన కథ "సంక్రాంతి అల్లుడు' సరళంగా, సహజంగా, సరదాగా వుంది కథకు ఆపాటి సుదీర్ఘమైన ఉపోద్ఘాతం రాయటం, అది ఎక్కడా బోరు కొట్టకుండా చకచకా చదివించేలా చూడటం శ్రీ




రాజారాంగారికే చెల్లును! కథా వస్తువు సామాన్యమైనదే అయినా ఆ కథను చెప్పిన తీరు ఎంతగానో బాగుంది 'రాజబాబు' ముఖం చూచిన వాళ్ళందరూ ఎందుకు నవ్వేరో నాకు తెలిసిపోయింది

–వక్కలంక రామారావు, మానేపల్లి

★ ★ ★

'ఋణం తీరిపోయింది' కథ బాగుంది సీతకు వీణపై గల అభిమానాన్ని చక్కగా విశ్లేషించారు రచయిత్రి 'వీణ' అమ్మగా వచ్చిన డబ్బుతో పనిమనిషిని, వంట మనిషిని పెట్టుకోవడం పళ్ళు, టానిక్కులకు దర్జాగా ఖర్చు పెట్టడం అతిశయోక్తిగా తోచినప్పటికీ కథలో చెప్పవలసిన ముఖ్యమైన భావాన్ని మాత్రం విస్మరించ లేదు

–ఐరేని శ్రీనివాస్‌గౌడ్ రామాయంపేట

★ ★ ★

నా అభిమాన నటి శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రికలో విన్నకోట సుశీలాదేవి రచించిన ఋణం తీరిపోయింది' కథానిక చాలాబాగుంది ఈ కథానికలో 'సీత' పాత్ర నాకు నచ్చింది సంక్రాంతి అల్లుడు, బంగారు నంది కథానికలు కూడా నాకు నచ్చినాయి

–ఎస్ రామచంద్రమూర్తి, రామగిరి, నల్లగొండ

## శీర్షికలు

శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రికలో 'గర్భస్థ శిశువు చెప్పిన కథలు" శీర్షిక మా ఇంటిల్లిపాదిని ఆకట్టుకున్నది

–బందిగి బాలరాజు, ఉమాదేవి, నారాయణపేట □


త్వరలో ప్రారంభం!

కొత్త సీరియల్ నవల

ప్రతిస్పందన

రచన

'అన్నపూర్ణ'



# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు · (1938-1972)

20-26, ఫిబ్రవరి '87

శ్రీ అక్షయ నామ సం మాఘ బ సప్తమి

సంపుటము 79 : సంచిక 25

ముఖ్య సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు :

మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు 2 75 |
| పోస్టులో 6నెలల చందా | రు 80.60 |
| పోస్టులో 12నెలల చందా | రు. 161 20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**

నటి : జయప్రద

(ఫొటో . ఎం. కె. రామమూర్తి)

**కథలు :**



**సీరియల్ నవలలు:**



**వ్యాసాలు, శీర్షికలు :**

# How you look tomorrow, depends on what you use today.

**Skin Care Products:**
- Almond Lanolin (Under Eye Cream)
- Hider & Healer
- DeepAction Pimple Treatment Cream
- Touch & Glow (Face Mask)
- Tender Feel (Vanishing Cream)
- Lemon Aloe (Cleansing Cream)
- Petal Soft (Rose Skin Tonic)
- Skin Food (Night Cream)

**Hair Care Products:**
- Amla Massage Hair Oil
- Shikakai Shampoo
- Nature's Magic Herbal Hair Dye

Banjara's HERBAL

**M/s. Banjara's Herbal Products Pvt. Ltd.,**
Bantia Estate,
207, Sikh Road,
Secunderabad – 500 003.
(A.P.)

*Distributors for Andhra Pradesh :*
EVE AIDS PRIVATE LIMITED, Suryaraopet, Vijayawada-2. Meridian Marketing Services, Secunderabad.




# ఊహలని వాస్తవాలుగా చిత్రిస్తున్న పాలకులు!

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

ప్రజలు తమ గురించి ఏమనుకుంటున్నారో రాజీవ్ గాంధీకి తెలిస్తే బాగుండును ఆ ప్రజలే ఆయనకు మూకుమ్మడిగా వోట్లు వేసి మరీ ఎక్కువ కాలమేమీ కాలేదు నేనీ మధ్య ఒక స్నేహితునితో మాట్లాడుతూ కూచున్నాను ఆయనకు రాజకీయాలతో సంబంధం లేదు హిమాచల్ ప్రదేశ్‌లో పుట్టగొడుగుల్ని పెంచుతుంటాడు ఢిల్లీకి ఎప్పుడో ఒక సారి వస్తుంటాడు. అప్పుడే, ఉదయం పూట పత్రికా సమావేశంలో పాల్గొన్న మరో మిత్రుడు నాకు ఫోన్ చేసి విదేశాంగ శాఖ కార్యదర్శి రాజీనామా వార్త చెప్పాడు సహజంగానే ఎందుకని మేము అడిగాము. నాకు తెలియదు బహుశా ప్రధాని ఆయనతో ప్రవర్తించిన పద్ధతికీ దీనికీ సంబంధం ఉందేమో' అన్నాడు

నా పుట్టగొడుగుల స్నేహితుడు వెంటనే "రాజీవ్‌గాంధీ తమ నిస్పృహనంతటినీ పక్కన ఉన్న వ్యక్తుల మీద తీర్చుకుంటున్నట్టున్నారు" అని వ్యాఖ్యానించాడు

దీనికి ఒకటో రెండో రోజుల ముందు నేను మాకు పత్రికలు తెచ్చి వేసే మనిషితో నెలనెలా బిల్లు పెరిగి పోవడం గురించి మాట్లాడుతున్నాను 'ఔను ప్రధాన మంత్రిగారు సెలవులు తగ్గించి పని చూసుకోవడానికి ఇంకాస్త సమయం పెంచుకుంటే బావుండును' అన్నాడు-

చాలా కాలంగా నాకు ఒక అభిప్రాయం ఉండేది రాజీవ్‌గాంధీ చుట్టూ ఉన్న మనుషులు సరైన సలహాలు ఇవ్వటం లేదని, వాళ్ళలో చాలా మంది విషయాలను లోతుగా అర్థం చేసుకోడానికి తగిన వయసు లేని వాళ్ళో, నిర్లక్ష్యం గల వాళ్ళోనని నాకనిపించేది కాని, వీళ్ళందరినీ ఆయనే నియమించుకున్నారని, వాళ్ళను ఆయన మీద గానీ ఆయన ప్రభుత్వం మీద గానీ ఎవరూ రుద్దలేదని తర్వాత నాకు స్ఫురించింది అట్లాగే, వాళ్ళు అందరికందరూ కుర్రాళ్ళు కూడా కాదు ఉదాహరణకు ఎల్ కె ఝా ఇలాంటి పదవుల్లో దాదాపు అర్ధ శతాబ్దంగా ఉన్నారు, తాముచేసే పని ఆయనకు బాగానే తెలుసు కాని పత్రికా సమావేశంలో విలేఖరులకు రాజీవ్ గాంధీ ఆర్థిక వ్యవస్థ గురించి చెప్పిన దాన్ని బట్టి చూస్తే ఝా అయినా ఆయనకు తప్పుడు సమాచారం అందించి ఉండాలి, లేదా రాజీవ్ గాంధీ అయినా తనకు అందిన సమాచారాన్ని అర్థం చేసుకో లేక పోయి ఉండాలి

ఆర్థిక వ్యవస్థ మంచి స్థితిలో ఉన్నదని ప్రధాన మంత్రి ఎప్పుడూ ముఖం మీద కనబడే చిరునవ్వుతో – అదిప్పుడు దాదాపు ఆయన ట్రేడ్ మార్క్ అయిపోయింది- చెప్పారు ఆయన నిజంగా ఆ విషయం నమ్ముతున్నట్టయితే, ఆయన ఇక దేన్నయినా నమ్మ గలరు తమతో తెచ్చుకున్న చిన్న కాగితం ముక్క చూసి ఆయన చాల రకాలయిన అంకెలు- పెరుగుదల రేట్లు, ధరలు, ఎగుమతులు, దిగుమతులు వగైరా అన్నీ – చదివారు హైస్కూలు విద్యార్థులు తమ అధ్యాపకులను సంతృప్తి పరిచేందుకు సేకరించే అంకెల లాంటివవి. చాలా ఆశ్చర్య కరమైన విషయమేమిటంటే, ఆర్థిక వ్యవస్థ మంచి స్థితిలో ఉన్నదని బుజావు చెయ్యడానికి తగినదేదీ ఆ అంకెల్లో లేదు మొత్తం మీద పరిగణిస్తే నిజానికి ఆర్థిక వ్యవస్థ మందకొడిగా ఉన్నది వివరంగా పరిశీలిస్తే, తిరోగమిస్తున్నది గత నాలుగు సంవత్సరాలలో వ్యవసాయ ఉత్పత్తిలో పెరుగుదలగా చెప్పుకో గలిగిందేమీ లేదు ప్రతి విషయమూ నిశ్చలంగా ఉండగా, ఏదో జరుగు తున్నదనే అభిప్రాయం కలిగింప జేసేందుకు వ్యవసాయ మంత్రిత్వ శాఖ వారు తమ అంకెలను అప్పుడప్పుడు పైకీ, కిందికీ మారుస్తూ ఉంటారు పారిశ్రామిక అభివృద్ధి రేటు కూడా నిశ్చలంగానే ఉన్నది ఉక్కు ఉత్పత్తిని చూసి మీరు ఈ విషయాన్ని గ్రహించ వచ్చు ఆధునికీకరణ పేరిట మనం వేలాది కోట్ల రూపాయలు ఖర్చు పెడుతున్నప్పటికీ, వ్యవసాయ రంగంలో లాగే , ఉక్కు ఉత్పత్తి కూడా అభివృద్ధి చెందడానికి సిద్ధంగా లేదు

ఎగుమతులు పెరుగుతున్నాయని రాజీవ్ గాంధీ అంటున్నారు తమ మాట బుజావు చేసుకునేందుకు ఆయన కొన్ని అంకెలు కూడా ఉటంకించారు మళ్ళీ ఒకసారి, ఆయన సహాయకులు ఆయనను మోసగిస్తున్నారు. రూపాయి విలువ పడిపోతూ ఉన్నది గనుక ఎగుమతులు పెరిగిపోతున్నట్టు కనబడుతున్నాయి ఒక సంవత్సరం క్రితం ఒక డాలరు 11 రూపాయలకు సమానంగా ఉండేది ఇప్పుడది 13 రూపాయలకు సమానమయింది. ఒక్క సంవత్సరం లోనే, పశ్చిమ జర్మన్ మార్కుతో గానీ, జపాన్ యెన్‌తో గానీ పోలిస్తే రూపాయి విలువ 25 శాతం పడిపోయింది కనుక, డాలర్లలో చెప్పేటప్పుడు ఎగుమతులు నిజంగా గతం కన్నా తక్కువే ఉన్నా – నిజంగానే తక్కువ ఉన్నాయని నా అభిప్రాయం – అవే రూపాయలలో చెప్పేటప్పుడు చాలా సంతృప్తి కరంగా ఉన్నట్టు కనిపిస్తాయి రూపాయి ప్రపంచంలో కెల్లా హీనమైన కరెన్సీల్లో ఒకటి అయిపోయింది రూపాయి ఎంత హీనమై పోయిందంటే మన వ్యాపార వేత్తలు- వారి సహచరులు, రాజకీయ వేత్తలు – తమ రూపాయలను డాలర్ల లోకి మార్చుకోవడం ఎంత కష్టమైనా అందుకేసిద్ధ పడుతున్నారు.

కాని విషయం అదికాదు. ఆర్థిక వ్యవస్థ స్థితిగతుల గురించి రాజీవ్‌గాంధీ తనను తాను మోసం చేసుకుంటున్నారు, ఇతరుల్ని మోసం



చేస్తున్నారు. అదే విధంగా, దేశంలోని ఇంకా అనేక ఇతర విషయాల గురించి, పంజాబ్ సమస్యతో సహా, ఆయన ఇలాగే ప్రవర్తిస్తున్నారు. సమావేశంలో పంజాబ్ గురించి ఆయన చాలా మామూలుగా ప్రస్తావించారు ఆయనకు ఈ తప్పుడు సమాచారం, తప్పుడు అంకెలు అందజేస్తున్న వాళ్ళెవరు? సిక్కులకు చండీఘర్ ఇచ్చేస్తే అంతా సవ్యమై పోతుందని ఆయనకు చెప్పిన వాళ్ళెవరు? తమ పార్టీలో అధికార దళారీలు లేరనీ, సంస్థాగత ఎన్నికలు జరగక పోవడానికి కారణం తప్పుడు సభ్యత్వమేననీ ఆయనకు చెప్పిన వాళ్ళెవరు? చాలా ఇతర దేశాలలో ధరలు వాస్తవంగా తగ్గుతూ ఉంటే భారతదేశంలో మాత్రం ధరలు పెరిగి పోతున్నాయి ధరలు అదుపులో ఉన్నాయని ఆయనకు ఎవరు చెప్పారు? మన ఖజానా ఖాళీ అయి, పూడ్చేందుకు మరో అప్పుకోసం తమ స్వంత మనిషి ఎల్. కె ఝా అంతర్జాతీయ ద్రవ్యనిధి చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నారని వార్తలు వస్తుండగా, విదేశీ మారకద్రవ్యం పరిస్థితి సంతృప్తి కరంగా ఉందని ఆయనకు చెప్పిన వాళ్ళెవరు?

ఆయనకు ఈ విషయాలన్నీ చెపుతున్న వాళ్ళెవరు? నేను మొదటే చెప్పినట్టు, రాజీవ్ గాంధీకి ఈ విషయాలు పెద్దగా తెలియవు గనుక, ఆయన సహచరులు తప్పుడు సమాచారం అందజేస్తున్నారేమో నని ఇదివరకు అనుకునే వాణ్ని ఇప్పుడు నా అభిప్రాయ మేమంటే, ఆయనకు సమాచారం అందజేసే వాళ్ళెవరూ లేరు. ఆయన తమంతట తామే దాన్ని తయారు చేసుకుంటారు. ఎందుకంటే చీకట్లో ఈలవేస్తూ వెళ్ళే మనిషి లాగే రాజీవ్ గాంధీకి స్వయంగా తమ పెరట్లో ఏం జరుగుతున్నదో తెలియదు అందువల్ల భూమి మీద ఉనికే లేని వాస్తవాన్ని ఒక దాన్ని సృష్టించాలి ఆయన వాస్తవ ప్రపంచంతో సంబంధం లేకుండా ఉన్నారు ఆయన కేంద్ర కార్యాలయంగా ఉన్న సువిశాల నిర్బంధ శిబిరాన్ని ఒక్కసారి చూడండి, నేనే మంటున్నానో మీకు అర్థమవుతుంది కనుక ఆయన ఒక అద్భుతాలు నిండిన ప్రపంచాన్ని సృష్టించుకుంటారు ఆ తమాషా ప్రపంచాన్ని వాస్తవం అనిపించేలా చిత్రం చాలి కనుక ఆయన కొన్ని అంకెలు తయారుచేసుకుంటారు. అదే విధంగా వాటిని సమర్థించ డానికి దానికి సరిపోయే విచిత్రమైన వాదనలు తయారు చేసుకుంటారు ఆర్థిక వ్యవస్థ మంచి స్థితిలో ఉన్నదని, పంజాబ్‌లో ఏ అస్తవ్యస్తతా లేదని, ఆ మాటకొస్తే డార్జిలింగ్‌లో గాని, మరెక్కడా గాని ఏ గొడవా లేదని ఆయన అనుకుంటారు ఎందుకంటే ఆయన నమ్మదలచుకున్నదదే ఎవరైనా కాదన్నట్టయితే, ఉదాహరణకు వెంకటేశ్వరన్ లాంటి వారు, వాళ్ళు తక్షణమే బైటికి పంపించ బడతారు ఝా వంటి మనుషులు ఆయన చెప్పిందానికల్లా తలూపి, అదే వలలో పడిపోతారు

చివరికి ఏమవుతుందోనన్న ఊహే భయంగా ఉన్నది □


# ఆంధ్రపత్రిక పాఠకులకు చక్కటి అవకాశం!



## కళ్యాణవేదిక
## ఉచిత సమాచారం



జీవితానికి వివాహం ఒక మలుపు. 'ఒకరి కొకరు రాసిపెట్టడం' విధి చేతిలోనిదనే నానుడి అందరెరిగినదే. అయితే రాసిపెట్టినవారు చేరువయ్యే క్షణం అంత సులభం కాదు. మానవప్రయత్నం కూడా కావాలి. ఇందుకు ఎంతో శ్రమ, త్రిప్పట, వ్యయం అవుతోంది.

సమాజంలో నెలకొనియున్న ఈ సమస్యకు పరిష్కార మార్గంగా ఆంధ్రపత్రికలో కొంతకాలంగా "కళ్యాణ వేదిక" శీర్షికన తగ్గింపు రేట్లపై ప్రకటనలు వేయడం జరుగుతోంది.

ఈ శీర్షికను మరింతగా ప్రజలకు వుపయోగపడేందుకు వీలుగా విస్తృతపర్చి ప్రతి బుధవారం "కళ్యాణ వేదిక ఉచిత సమాచారం" శీర్షికగా ఆంధ్రపత్రిక దినపత్రికలో ప్రకటించాలనుకుంటున్నాము.

వధూవరులవివరాల వుచిత సమాచారము కోరువారు/యిచ్చేవారు పూర్తివివరములను అంటే వరుడు/వధువుకు సంబంధించిన వయసు, చదువు, ఇతర అర్హతలు సుమారు 150 అక్షరాలకు మించనట్లు తెలుగులోనే స్పష్టంగా వ్రాసి, ఈ దిగువ కూపనును జతపర్చి మీ వూరిలోని ఆంధ్రపత్రిక ఏజెంటు ద్వారా పంపాలి. చిరునామా పిన్‌కోడ్‌తోబాటు సమగ్రంగా ఉండాలని మనవి.

ఆ విధంగా మాకు అందిన వధూవరుల సమాచారమును వుచితంగా వారమునకు ఒకసారి ప్రతి బుధవారం వీలువెంబడి ప్రకటిస్తాము.

### ఉచిత వధూవరుల సమాచారము యివ్వ దలచినవారు ఈ దిగువ నిబంధనలు పాటించాలి.

- ★ వధువు/వరునికి సంబంధించిన వివరాలు సమగ్రంగా, అచ్చులో 150 అక్షరాలకు మించనట్లుగా తెలుగులోనే స్పష్టంగా వ్రాసి పంపాలి.
- ★ వధువు/వరుల తల్లిదండ్రులు, సంరక్షకులు తాము యిచ్చే సమాచారము వాస్తవమని, ఎవరినీ కించపర్చే విషయము అందులో లేదని హామీ ఇవ్వాలి.
- ★ సమాచారం పంపేవారి పేర్లు వగైరా రహస్యంగానే వుంచబడతాయి. ప్రతి ప్రకటనకు ఒక బాక్సు నెంబరు కేటాయించి, వచ్చిన జవాబులు ఉచితంగానే వాటికి సంబంధించినవారికి నెల రోజులలోపు పంపడం జరుగుతుంది.
- ★ ఈ శీర్షికను కుల మత వర్గ భేదాలు లేకుండా అందరూ వుపయోగించుకోవచ్చును.
- ★ అందిన సమాచారము ప్రతి బుధవారం మాత్రమే, అవి అందిన వరుస క్రమంలో ప్రకటించ బడతాయి. వీటిని త్రిప్పి పంపే ప్రసక్తి లేదు. కావున స్వంత అడ్రసుగల కవర్లు, లేదా స్టాంపులు జతపర్చకూడదు.
- ★ ప్రకటనకు ఏదైన అనర్హమైనదిగా తోచినపుడు వాటిని వెయ్యకుండా ఆపుచేసే హక్కు పత్రికకు వుంటుంది.
- ★ ఇతర విధములైన వుత్తరప్రత్యుత్తరములకు అవకాశం లేదు. ఫోటోలు పంపకూడదు.

### కళ్యాణ వేదిక ఉచిత సమాచార కూపను

పేరు ______________________________

చిరునామా ______________________________

______________________________ పిన్ కోడ్ ______________

స్థానిక ఆంధ్రపత్రిక ఏజెంటు సంతకం ______________________________

సీరియల్

ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

క్యాజువల్ గా ఫోన్‌లో చెపుతున్నది వింటున్న ప్రణీత్ ఒక్కసారిగా ఎలర్టయ్యాడు

కొద్దిగా ముందుకు వంగి "సరిగ్గా వినపడ్డం లేదు స్పష్టంగా చెప్పండి ఏమిటి? ఎక్కడ నుంచి మాట్లాడుతున్నారు? ఎవరు మీరు?" ఆదుర్దాగా అడిగాడు ప్రణీత్

"ఎస్ ఐ గారూ! నేను 'సూర్యకళ' నండీ! మా ఇల్లు తెలుసుగదా? ఇంట్లోనుంచే మాట్లాడుతున్నాను మీరు త్వరగారండీ! పాపారావు నలుగురు మనుషులతో వచ్చి నన్ను చెరచాలని చూస్తున్నాడు మంచి మాటలతో వాళ్ళను హాల్లో కూర్చో బెట్టి వచ్చి నేను మీకు అంటూనే కెవ్వుమంది సూర్యకళ ఆమె నెవరో గొంతు నులుముతున్నట్లు మూలిగింది

హలో హలో!' అన్నాడు ప్రణీత్

రిసీవర్ క్రెడిల్ చేసిన చప్పుడు వినిపించింది

ఒక్క దూకున బయట కొచ్చి మోటార్ సైకిలును సూర్యకళ ఇంటి వేపు పరుగెత్తించాడు ప్రణీత్

అది డాబాఇల్లు గేటు తీసుకుని లోపలి కెళ్ళి వీధి తలుపు తోశాడు తొయ్యగానే తెరుచుకున్నాయవి ఇల్లంతా నిశ్శబ్దంగాఉంది

ఏమయిందామె? ఎత్తుకు పోయారా?

గది తలుపులు ఓరవాకిలిగా వేసి ఉంటే అటు వెళ్ళి తలుపు తోసి లోపల ప్రవేశించాడు ప్రణీత్

బెడ్ మీదున్న తెల్లటి దుప్పటి మీద పగిలిన గాజు పెంకులు .. తడి ఆరని రక్తం మరకలు పెనుగులాట జరిగిన చిహ్నంగా స్థాన భ్రంశం చెందిన సామాన్లు

మంచందగ్గర కెళ్ళి పరీక్షగా చూస్తున్న ప్రణీత్ మెడ చుట్టూ పూల చెండు లాంటి మెత్తని చేతులు పడ్డాయి

చివ్వున వెను తిరిగాడు ప్రణీత్

నవ్వుతున్న మొహంతో సూర్యకళ!

ఏరివాళ్ళు? అనుమానంగా అడిగాడతను

'ఎవరు వాళ్ళు?' అమాయకంగా అన్నది సూర్యకళ

ఇందాక నాకు ఫోన్ చేసింది మీరు కాదా?'

నేను చేశానా? ఇంకా నయం! మీ అంతట మీరే వచ్చారనుకుని పొంగి పోతున్నానునేను'

ఆమె అబద్ధ మాడు తోందని తెలిసి పోతూనే ఉంది

పరిచయం లేని తన మీద ఎంతో చనువున్న దానిలా ఇలాంటి ప్రాక్టికల్ జోక్ వేసిన సూర్యకళను నిరసనగా చూశాడు ప్రణీత్

తను పోలీస్ డిపార్ట్ మెంటుకు చెందిన వ్యక్తి అనుకుంటోందా లేక రోడ్లంట ఉల్లాసంగా తిరిగే వాడనుకుంటోందా?

తనతో నా ఈ వేళాకోళాలు?

పొంగి వస్తున్న కోపాన్ని అతికష్టం మీద కంట్రోల్ చేసుకుంటూ-

'మీకు తోడేలూ – గొల్ల పిల్ల వాడి కథ తెలుసనుకుంటాను మీరీసారి నిజంగానే ఆపదలో ఉండి ఫోన్ చేసినా నేను నమ్మను పోలీసులతో ఇలా చెలగాటమాడటం మీకేమంచిది కాదు మైండిట్' అన్నాడు ప్రణీత్

సారీ, అండీ ఇంకెప్పుడూ ఇలా చెయ్యను ఒక కప్పు కాఫీ తీసుకుని వెళ్ళండి 'నమ్రతగా. పశ్చాత్తాపంగా అన్నది సూర్యకళ.

'థాంక్స్. ఒద్దు'

'సెక్సీగా ఉన్న సూర్యకళ అలంకరణ ప్రణీత్ దృష్టి నాకర్షించలేదు అలాంటి వాటికి రెచ్చిపోయే బలహీనుడు కాదతను ..

'ఇంటి కొచ్చిన అతిథికి కాఫీ అయినా ఇవ్వకుండా పంపే అలవాటు నాకులేదు " అతనిదారికి అడ్డొస్తూ అన్నదామె

'నేను మీ అతిథినికాదు "

'ఇంటి కొచ్చినవాళ్ళు ... కాదన్నా అతిథులే "

అసహనంగా చెయ్యి చాపి ఆమెను పక్కకి నెట్టాడు ప్రణీత్.

పడబోయి. మంచం పట్టుకుని ఆపుకుని కిటికీవేపు చూసి "అయ్యయ్యో!

**జరిగిన కథ –15:** బాబూరావును ఎదిరించి వివాహం చేసుకున్న మంజీర, ప్రణీత్‌ల పట్ల ఆయన ద్వేషం పెంచుకుంటాడు. ఆ ద్వేషాగ్నిని ఎగసన దోస్తుంటాడు పాపారావు. తాగినమైకంలో పాపారావు భార్య హరిణిని చంపేస్తాడు. పాపారావు తప్పించుకోవడానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫలమై కింది కోర్టులో యావజ్జీవ శిక్ష పడుతుంది. కేసు దర్యాప్తు చేసిన ప్రణీత్ మీద పాపారావుకు, బాబూరావుకు కసి పెరుగుతుంది పైకోర్టులో శిక్ష కొట్టేయించుకుని పాపారావు తిరిగి వస్తాడు బాబూరావు తరఫున గోపాలం మంజీర దగ్గరికి వస్తూ వారి దాంపత్యంలో చిచ్చు పెట్టడానికి ప్రయత్నాలు మొదలెడతాడు

అటు చూడండి. ఆదుర్దాగా అన్నదామె.

వెళ్ళబోతూ తల తిప్పి చూశారు ప్రణీత్

మెరుపులా ఆమె చెయ్యి ప్రణీత్ మొహం దగ్గర కొచ్చింది.

విసురుగా మొహం తిప్పుకోబోయాడు ప్రణీత్. అప్పటికే ఆలస్యమయింది

తనను కంట్రోల్ చేసుకోటానికి ప్రయత్నించి ఓడిపోయాతతడను

తూలిపడబోతున్న అతన్ని, చేతులుచాపి కౌగిలిలోకి తీసుకుని అలాగే బెడ్ మీదకు జారింది సూర్యకళ ఆమె పెదవుల మీద విజయగర్వంతో కూడిన చిరునవ్వు మెరిసింది

ఇప్పుడామె అడుగునా అతనామె పైనా ఉన్నారు. తన కాళ్ళను అతని కాళ్ళకు మెలికవేసి, చెయ్యిచాపి కిటికీ తలుపులు సరిగ్గా తెరిచిందామె

*　　　*　　　*　　　*　　　*

"అంతా అబద్ధం ప్రణీత్ ఎప్పటికీ అలా చెయ్యడు అంటోంది మంజీర ఫోన్‌లో

కావాలంటే వెళ్ళి చూడరాదూ? రెచ్చగొడుతున్నట్టుగా అన్నది అవతలికంఠం

ఎవరో ఉలిపిరి కాయితం నోటి కడ్డం పెట్టుకుని మాట్లాడుతున్నారు

"నేరాలకు సంబంధించి ఎందరిళ్ళకో వెడుతుంటారు అంతమాత్రానికే ఆయన్ననుమానించేంత బలహీనత నాకు లేదు" బింకంగా అమాయకంగా అన్నది మంజీర

ఆహా! అలాగా! ఏనేరం విచారించటానికతను సూర్యకళ ఇంటి కెళ్ళాడు? కానిస్టేబుల్సెవరూ వెంట లేకుండ ఒక్కడే ఎందుకెళ్ళాలిసొచ్చింది? ఏమిటా స్పెషాలిటీ? నీ మొగుడు ప్రతిరోజూ ఏదో టైంలో అక్కడి కెడుతూనే ఉన్నాడు ఇప్పుడు ఈ క్షణంలో అతను సూర్యకళతో ఆమె పడకగదిలో ఉన్నాడు కావాలంటే వెళ్ళి చూసుకో". హేళనగా అన్నదాకంఠం.

"సూర్యకళ ఇంట్లోనా!" ఈర్ష్యతో భగ్గుమంది మంజీర మనసు ఇంకెవరింటి కయినా అయితే ఆమె పట్టించుకునేది కాదు .

సూర్యకళ పైడిపల్లె మొత్తానికే వివాదాస్పదమైన మనిషి ఆమె విపరీతమయిన అందగత్తె ఆ ఊర్లో ఎంతటి కొమ్ములు తిరిగిన మగాళ్ళకయినా ఉన్న ఒకే ఒక వీక్ పాయింట్ సూర్యకళ ఆమె పొందుకోసం ప్రతిమగాడూ తహతహలాడుతుంటాడు

అయితే ఆమె ఎవర్నీ లెక్క చెయ్యదు మామూలు వాళ్ళను దగ్గరకు రానివ్వదు ఊర్లో పెద్దపెద్ద వాళ్ళు మాత్రమే ఆమె కాతాదార్లు .

సూర్యకళ మొగుడు అమాయకుడు కొంతమంది. అతను పనికిరాడు అంటారు అది ఊర్లో. నిజమో సూర్యకళకే తెలియాలి అతను ఉదయం లేచి చద్దికూడు తిని పొలమెడితే మళ్ళీ రాత్రి దాకారాడు మధ్యాహ్నం అన్నం కూడా పొలంలో నే తింటాడు

నీ బార్య తప్పుడుది అని ఎవరయినా అన్నా పట్టించుకోడు సూర్యకళ జాణ గయ్యాళిది ఆమెనోటి కందరూ జడుస్తారు

ఆమెది సారాయి కొట్టు

వ్యవసాయం గొడవలు మొగుడి కొదిలేసి తను సారాయి కాతాలు చూసుకుంటూ ఉంటుందామె

సూర్యకళ దుకాణం వెలిశాక తాగుబోతులంతా వేరే చోటికి వెళ్ళటం మానుకున్నారు ఆమె కొట్టెప్పుడూ కస్టమర్స్‌తో కిటకిటలాడుతూ ఉంటుంది

ఎవరయినా ఆమె ఒంటి మీద చెయ్యి వేస్తే బండబూతులు తిట్టి, వాళ్ళని తన్నినంత పని చేస్తుంది

ఆమె అనుగ్రహం కోసం అంతా తహతహలాడుతుంటారు. గ్రామ దేవతల అందదండలామెకు పుష్కలంగా ఉన్నాయి క్లుప్తంగా ఆమె చరిత్ర ఇదీ!

సూర్యకళకు ప్రణీత్ మీద మోజుంది అతన్నెలా గయినా వలలో వేసుకోవాలనే కోరికుంది.

పాపారావు లాంటి ముసలి కాతాలతో విసుగెత్తి ఆ విసుగును మనసులో నే అణుచుకుంటున్న సూర్యకళను ప్రణీత్ అందం ... చురుకుతనం .. సాహసం విశేషంగా ఆకర్షించాయి కానీ. అతనంటే ఆమెకు భయం.



# ఒడిలో చెలి మోహన రాగం

ఆ భయం మూడు రకాలు

ఒకటి తను ప్రణీత్ కోసం ప్రయత్నాలు ప్రారంభిస్తే పాపారావు వాళ్ళు తను రాజకుమార్ వర్గం వేపు మొగ్గినట్టుగా భావించి తన మీద కక్ష సాధిస్తారేమోనని .

రెండు కాకీ బట్టలన్నా . ఏ బలహీనతలూ లేని ప్రణీత్ అన్నా ఆమెకు భయం

మూడవది ఖచ్చితంగా అతను తనను తిరస్కరించి అవమానిస్తాడనే నమ్మకం

పాపారావొచ్చి తమ ప్లాన్ వివరించి చెప్పగానే ముందు తెల్లబోయింది సూర్యకళ తరవాత ఆమె మనసు ఆనందంతో పరవళ్ళు తొక్కింది

'ఆయన ఊరుకుంటాడా? నాకొట్టు మీద దాడి జరిపి పగతీర్చుకోడూ?" అన్నది అనుమానంగా

వాడి మొహం వాడు నన్నే ఏం చెయ్యలేక చేతులు ముడుచుకు కూర్చున్నాడు బాబూరావు అండ మనకున్నంత వరకూ ఇలాంటి ప్రణీత్‌లు లక్షల మంది కలిసినా మననేం చెయ్యలేరు ఈ పని స్వయంగా బాబూరావే నా ద్వారా నీ కప్పగిస్తున్నాడు ఆయన్ను మెప్పించావంటే నీ పనిహ నిత్యకళ్యాణం పచ్చతోరణమే ఎదిరిస్తే మాత్రం మసైపోతావు అన్నాడు పాపారావు

ఆయనో సారి రాకూడదూ? గోముగా అన్నది సూర్యకళ

'ఎవరూ?'

'బాబూరావుగారు

"ఓసి నీ తల్లి ముండమొయ్యా! ఎక్కడికోశావే నిచ్చెన!"

'అబ్బో! ఆయన మహా శీలవంతుడైనట్టు! హైదరాబాదులో ఆయనకు రెండు మూడు కాతాలున్నాయటగా?

అయితే మాత్రం? ఉన్న ఊళ్ళో ఇలాంటి వెధవ పని చేస్తే పరువు పోదూ? పదవిలో ఉన్నాడు గనక ఆయన కంతా ఒంగొంగి దణ్ణాలిడుతున్నారు గానీ . అవకాశమొస్తే ఒంగి నట్టే ఒంగి అమాంతం ఆయన కాళ్ళట్టుకు లాగాలనే ప్రతివాడి ఆలోచనాను '

మీరూ అంతేగా?

'ఓసి నీసగవరగ! పెద్ద మాటలాడేస్తున్నవేంటేవ్?

ఊరికే సరదాగా అన్నాను లెద్దూ! ఆమె గొంతులో ఒలికే గారాబాని కయిసయిపోతూ నేనూ ఊరికేనే అన్నాన్లే అన్నాడు పాపారావు

ఈ గొడవంతా దేనికి? సఫా చేయించి పారేసి కొన్నాళ్ళు హైదరాబాదులో కాపరం పెట్టేస్తే పోలా? అన్నది సూర్యకళ

ఔననుకో! ఎంత చెడ్డా కూతురి మొగుడు గదా! అందుకని ఆయన





తెగించలేక పోతున్నాడు అన్నాడు పాపారావు

పోనీ మీరు తెగించరాదూ?'

'నీ కెందుకీ గొడవలన్నీ? చెప్పినట్టు చెయ్యి . విసుగ్గా అన్నాడు పాపారావు

తన మనసులో రేగే దురాలోచనల కలా ఆమె మాటలతో రూపకల్పన చెయ్యటం నచ్చటం లేదతనికి

ఇంతకూ నేను గెలుస్తానా? మాట మారుస్తూ అన్నదామె.

'గెలవాలి మరి అన్నాడ తను

నేను మీరు చెప్పినట్టు చేస్తే ప్రణీత్ వస్తాడా? చెడిపోయిన దానింటికి పోయేదేమిటని మానేస్తాడా?"

'భస్తే మానెయ్యడు ఎవరయినా ఆపదలో ఉంటే . వాళ్ళకొచ్చిన ఆపదేమిటనే ఆలోచిస్తాడు అందుకనుగుణంగా చర్యతీసుకుంటాడే గానీ ఆపదలో ఉన్న వ్యక్తి యొక్క ప్రాముఖ్యాన్ని బట్టి అతను పద్ధతులు మార్చడు"

ఈ రకంగా నయినా ప్రణీత్‌ని దగ్గరగా చూడొచ్చు అతన్ని తాకొచ్చు అనే భావన పులకరింపును కలిగిస్తోందామెకు

సరే' అన్నదామె

ఆమె ఎలా ప్రవర్తించాలో ఏం చెయ్యాలో మరోసారి నూరి పోసి వెళ్ళిపోయాడు పాపారావు

సూర్యకళకు భయంగా . థ్రిల్లింగ్‌గా ఉంది వాళ్ళూ వాళ్ళూ ఎలాగన్నా పావనీ చాకు లాంటి ప్రణీత్ కొంత సేపు తన చేతులమధ్య గుండెల మీద ఆదమరచి నిద్రపోతాడు ఈ ఊహ అద్భుతంగా ఉందామెకు

ఆమె యాక్షన్ మొదలు పెట్టింది

* * * * * * * * * *

ఔను సూర్యకళ ఇంట్లోనే హాయిగా ఆమె గుండెల మీద పవ్వళించి ఉన్నాడు వెళ్ళి కళ్ళారా చూసుకో ' ఎద్దేవాగా అన్నదా కంఠం

"నువ్వెవరూ?' అసహనంగా అన్నది మంజీర

'నేనెవరయితే నీకెందుకు? ప్రేమ ప్రేమంటూ అందర్నీ కాలచన్నుకుని వచ్చావు నీ ప్రియుడి నిజాయితీ ఎలాంటిదో కళ్ళనిండా చూసుకో '

"ముందు నువ్వెవరో చెప్పు

చెపితే ఏం చేస్తావ్?'

"ప్రణీత్ సూర్యకళ ఇంట్లో నువ్వు చెప్పిన పరిస్థితుల్లో లేక పోతే అలా కల్పించి చెప్పినందుకు నిన్ను చంపి పాతేస్తాను

ఓ కే ఎగ్రీడ్ '

అందుకే నువ్వెవరో చెప్పు

అవసరం లేదు నువ్వంటికి రాగానే నేనే మళ్ళీ ఫోన్ చేస్తాను నేను చెప్పింది అబద్ధం అని నువ్వంటే నేనే స్వయంగా నీదగ్గర కొస్తాను అప్పుడు నీ మొగుడుతో కలిసి శిక్ష అమలు జరుపుదుగాని '

'నువ్వు రాకపోతే?

వస్తాను నువ్వు నమ్మాలి అంతే

* * * * *

పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చేసి అడిగితే ప్రణీత్ లేడన్నారు

మంజీర గుండెలు దడదడా కొట్టుకున్నాయి

నో అలా జరగ్గూడదు జరిగితే తను భరించలేదు తన ప్రణీత్ ఒంటి మీద మరో ఆడదాని చెయ్యి పడటానికి వీల్లేదు తను ఎక్కువ ఆరాధించేది అతనిలో ఉండే నిజాయితీని తన నమ్మకాన్నతను దారుణంగా దెబ్బతీస్తే . తను ఊరుకోదు

కామేశ్వరికి కూడా చెప్పకుండా మనసులోని అలజడిని అణుచుకుంటూ చెప్పులేసుకుని బయల్దేరింది మంజీర.

చకచకానడుస్తూ సూర్యకళ ఇంటి దగ్గర కొచ్చింది

గేటు తెరిచి లోపలకు చూస్తే కాంపౌండులో ప్రణీత్ మోటార్ బైక్ కనపడింది

వాకిటి తలుపు తోస్తే తెరుచుకోలేదు చుట్టూతిరిగి కుడివేపు సందులో కొచ్చింది పడకగది కిటికీ ఆ సందులోకి ఉంది మునివేళ్ళ మీద నిలబడి లోపలికి చూసింది మంజీర

కరకరలాడే రుచికి
పాల సత్తువను పెంచే
న్యూట్రిన్ మిల్క్ బిస్కెట్స్







భారతదేశంలో అత్యధికంగా
అమ్మకమౌతున్న మిఠాయిలను
తయారుచేయువారు.

ACIL/009/86-Tel

# ఒడిలో వెలి మోహన రాగం

"ప్రణీత్... నిజంగా నువ్వు గట్స్ ఉన్న మగాడివి! ఓహ్! నీ దగ్గర ఎంతసుఖం! అందుకే నీ భార్య అందర్నీ వదులు కుని నీ వెంట వచ్చింది నీలాంటి మగాడీ భూప్రపంచంలో ఉండడు. ప్రణూ. ప్రణూ ఐలవ్‌యూ!" కలవరిస్తున్నట్టుగా ఉంది సూర్యకళ గొంతు

ఊఁ!" అంటున్నాడు ప్రణీత్ మత్తుగా కళ్ళు తెరవటానికి ప్రయత్నిస్తూ

సూర్యకళ గుండెల మీద తలానించి. ఆమెను పెనవేసుకుని పడుకున్న ప్రణీత్‌ని చూసి భూకంపం వచ్చినట్టు ఉలికి పోయింది మంజీర.

ఒక్క అంగలో ఇవతలి కొచ్చి పడిందామె

భరించ లేనంత దుఃఖమొస్తోందామెకు

బాధ రోషం వేదన ఆమె మనసును లాగి ముడేస్తున్నాయి ఆమె మనసు మండి పోతోంది

పిచ్చిదానిలా ఉంది మంజీర పెయింటయి పడిపోయేలాఉంది

కళ్ళవెంట నీళ్ళు కారిపోతున్నాయి తుడుచుకోవాలనే స్పృహ లేదామెకు ..

ప్రణీత్ ఇంత ద్రోహి అని కలలో కూడా ఊహించలేదు తను అతని ప్రేమంతా నటనేనా? ఇంత బలహీనుడా అతను? ఇలాంటి వ్యక్తి కోసమా తను . పాలుతాగిన తల్లి గుండెలనే తన్ని పెంచి పెద్ద చేసిన తండ్రి మాటనూ, గౌరవాన్ని మంటగలిపి తాతగారి అప్యాయతాభిమానాల్ని కాదనుకుని వెంటపడి వచ్చింది

ప్రణీత్ మొహం ఎలా చూడాలి? అతని స్పర్శ నెలాభరించాలింక? నటించటం తనకు నచ్చదు

అతన్నుంచి దూరంగా పారిపోవాలి? అతనికి కనపడకుండా పోవాలి ..

ఎక్కడికి? ఎక్కడికెళ్ళాలి?

కళ్ళు తుడుచుకుందామె

కన్నీటిని అణిచి పెడుతున్న ఆమె కళ్ళు ఎర్రమందారాల్లా ఉన్నాయి చిగురాకులా కంపించిపోతున్న ఆమె ఏక్షణంలోనయినా స్పృహతప్పి పోయేలా ఉంది

అమ్మా మంజూ! ఇలా ఎక్కడి నుంచమ్మా!"

ఉలిక్కి పడి కళ్ళెత్తిందామె

కరుణ కురిపిస్తున్న నేత్రాలతో తన తండ్రి!

ఎక్కడ నుంచి తల్లీ! ఇంత ఎండలో నడిచొస్తున్నావు?" అప్యాయంగా మంజీర భుజాలు పట్టుకుని అడిగాడు బాబూరావు

సాహిత్య వేదిక వనపర్తి 1986 సం లో నిర్వహించిన కవితా సంపుటాల పోటీలో ఉత్తమంగా ఎంపికైన గుండెలోంచి అరుణోదయం" కవితా సంపుటి రచయిత్రి శ్రీమతి అంగులూరి అంజనీదేవిని దుశ్శాలువతో సత్కరిస్తున్న శ్రీమతి పోల్కంపల్లి శాంతాదేవి



"నాన్నా!" అంటూ అయన్ను చుట్టుకు పోయింది మంజీర.

ఏ చిన్న ఆధారం దొరికినా దాన్ని వదలకుండా పట్టుకునేంత బేలగా ఉందామె.

మెల్లిగా ఆమెను [illegible] కూర్చోపెట్టుకున్నాడు బాబూరావు.

తండ్రి ఒడిలో తల పెట్టుకుని హోరున ఏడుస్తోంది మంజీర చలించ బోతున్న మనసునదుపులో పెట్టుకుంటూ ఊరుకోమ్మా. ఏ అమ్మ చూస్తే తల్లడిల్లి పోతుంది ' అంటూ ఆమె కళ్ళు తుడిచాడు బాబూరావు .

తండ్రితో కలిసి కారుదిగుతున్న మంజీరను చూడగానే తాత గారి మొహం వెలిగి పోయింది

"అమ్మా శార్వాణీ! ఇలా వచ్చి చూడు ఎవరొచ్చారో!" అని కేకపెట్టారాయన

'అమ్మా మంజూ!" అపనమ్మకంగా చూస్తూ ఆత్రంగా ఎదురొచ్చిన తల్లి చేతుల్లో పసిపాపలా ఒదిగి పోయింది మంజీర. ..

జరిగిన విషయాలేవీ వాళ్ళకు తెలీదు మమకారం చంపుకోలేక చివరకు రాజీపడి బాబూరావే ఆ అమ్మాయిని తీసుకొచ్చాడను కుంటున్నారు వాళ్ళు

ఇన్నాళ్ళుగా పుట్టింటికి దూరంగా ఉందనే బాధ ఆ అమ్మాయి కళ్ళలో అశ్రురూపం దాలుస్తోందను కుంటున్నారు .

వాళ్ళందరి అప్యాయత మధ్య . తమ్ముడ కేరింతల మధ్య తాత్కాలికంగా సేద తీరింది మంజీర

ఒంటరిగా ఉన్నప్పుడామెను పిలిచి 'ఏం జరిగిందమ్మా! ఆరోజెందుకలా ఏడ్చావు?' ఎరగనట్టుగా అడిగాడు బాబూరావు ఆ సంఘటన తలుచుకోగానే మళ్ళీ ఆమె కళ్ళు ఏరులయ్యాయి

జరిగిందంతా చెప్పుకొచ్చింది

అమాయకంగా చిన్న పిల్లలా రోషంగా, దుఃఖంగా అన్నీ తనకు చెప్పేసుకుంటున్న కూతుర్ని చూస్తుంటే ఒకే ఒక్క క్షణం బాబూరావు మనసు మెత్తబడింది అంతలోనే ప్రణీత్ మీదున్న ద్వేషం ఆ మెత్తదనాన్ని కబళించి వేసింది

అడగకపోతే ఆ పిల్ల అనుమానిస్తుందని అలా అడిగాడే గానీ కూతురి మనసును సమాధాన పరచాలనే ఆలోచన బాబూరావుకి లేదు ఓదారుస్తూ ఓదారుస్తూనే ప్రణీత్‌కి వ్యతిరేకంగా అనేక విషయాలు చెప్పి ఆమె మనసును కలుషితం చేశాడు ఆ తరువాత కూడా వీలైనంత సహజంగా తన పాత్ర నిర్వహిస్తూ మంజీర మనసులో ఆ వ్యతిరేకత ఇంకా పెరిగేలా కృషి చెయ్యసాగాడు బాబూరావు

'ఈ విషయాన్ని ఇంట్లో ఎవరికీ తెలియనివ్వకు. వాళ్ళు బాధపడతారు." అంటూ ఆమె నోరు నొక్కేశాడు.

అందుకే ఇలా జరిగిందనే విషయం శార్వాణికి గానీ తాతగారికి గానీ తెలీదు

పాలేర్ని, పాపారావునీ పంపి, మంజీర బట్టలన్నీ సర్ది పంపమని కబురంపాడు బాబూరావు

'అబ్బాయి వచ్చాక పంపిస్తాను అయినా అదేమిటలా చెప్పా చెయ్యకుండా తీసికెళ్ళాడాయన? ఈ పిల్లయినా చెప్పి వెళ్ళొచ్చుగా? అలా లెక్క లేకుండా వెళ్ళి పోవటమేమిటి?' నిష్ఠూరంగా అన్నది కామేశ్వరి

ఈరోజు మీ కోడలు చెప్పకుండా వెళ్ళటం మీకింత కష్టాన్ని కలిగిస్తోందే! మరి ఆనాడు ఆమె బాబురావుకు చెప్పకుండా ఇక్కడికొచ్చేస్తే అయనెంత బాధ పడిఉంటాడు? ఇప్పటికైనా అర్థమయిందా?' వెటకారంగా అన్నాడు పాపారావు

'ఓహో ఇదంతా ఏదో కుట్రలా ఉంది అసలు ఈ దరిద్రుడెందుకు కల్పించుకుంటున్నాడీ విషయంలో?

మంజీరతో ప్రతిదీ అఘాయిత్యమేలా ఉంది ఒకటే తొందరా అమ్మాయికి

బట్టలు సర్ది ఇచ్చేస్తే ప్రణీత్ ఏమంటాడో! ఇవ్వకుంటే వీళ్ళేం అఘాయిత్యం చేస్తారో! ఇప్పుడిక్కడో సీన్ క్రియేటవుతుంది కాబోలు.'

చికాగ్గా ఉంది కామేశ్వరి కిదంతా చూస్తుంటే. మౌనంగా లోపలికెళ్ళి మంజీర బట్టలు కొన్ని సూట్‌కేసులో పెట్టి వాళ్ళకిచ్చింది.

"ఇహ ఆ పిల్ల ఈ ఇంటికి రాదా? అసలే ఈ మధ్యన అదోలా ఉంటోంది.....

లాంటి కార్యక్రమాల్ని ఆపేసి పాపారావు వర్గంలో చేరితే మీకూ మీ నాన్నకీ రాజీ కుదరొచ్చు అంత వరకూ ఇంతే అన్నది హైమ

తన వాళ్ళను చూడాలనే పిచ్చి మమకారం మంజీర కొదలటంలేదు

ఒక్కసారి వెళ్ళి నవ్వుతూ తుళ్ళుతూ ఆ ఇంట్లోనూ, ఆపరిసరాల్లోనూ తిరగాలని తల్లిదగ్గర గారాలు పోతూ తాత గారి ప్రేమాభిమానాల నాస్వాదిస్తూ తండ్రి పక్కన కూర్చుని చిన్న చిన్న తగాదాలేసుకుంటూ నేస్తాలను పలకరిస్తూ అక్కడ నడయాడాలనీ అనిపిస్తోందామెకు ఈ కోరిక రానురానూ ఉధృత రూపాన్ని దాల్చ సాగింది

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

మంజూ, ఎందుకలా ఉన్నావ్? అన్నాడు ప్రణీత్ ప్రేమగా

ఎలాఉన్నాను? ముబావంగా అన్నది మంజీర

అదోలా దిగులుగా ఉన్నావు

'అమ్మను చూడాలనుంది

"మీరంటే ఇప్పుడు మానాన్నకి అట్టే కోపం లేదు మీరు చేసే పనులు నచ్చక అలా ఎగిరెగిరి పడుతున్నాడు మీరు కాస్త మానాన్నకి అనుకూలంగా మారకూడదూ? ఆయన పరాయి వాడుకాదు మీకు అయిన వాళ్ళకు అయినవాళ్ళే సహకరించుకోకపోతే. పరాయి వాళ్ళు సహకరిస్తారా?

"నువ్వేమంటున్నావో నీ కర్థ మవుతుందా? మీ నాన్నకి సహకరించాలా? అంటే? మీ నాన్న, ఆ పాపారావు గాడు కలిసి చేసే తప్పుడు పనుల్ని అన్యాయాలనీ నేను సమర్థించాలా! వాళ్ళ వర్గంలో చేరాలా! ఒక పోలీసాఫీసర్ భార్యగా నువ్విలాగేనా మాట్లాడేది?

నాకు డ్యూటీ ఫస్ట్ మిగతావి నెక్స్ట్

"అంటే? నేను కూడానా?

నువ్వు నాప్రాణానివి కానీ డ్యూటీ విషయంలో నేను నాప్రాణాన్ని సైతం లెక్క చెయ్యను ప్లీజ్ మంజూ! నన్నర్థం చేసుకో నాతో సహకరించక పోతే పోనీ నాకిలా అడ్డం మాత్రం రాకు

అయితే మీరా రాజకుమార్‌తో స్నేహం మానరా?

'మధ్యన అతని ప్రసక్తి దేనికి?

వాడే ఇవన్నీ చేసేది వాడి మూలానే మీరు

'మంజూ' వివేకాన్ని కోల్పోయి మాట్లాడకు ఒకప్పుడు అతనే మనకి 'అండగా నిలిచాడు ఏరుదాటాక తెప్ప తగలెయ్యటం అనే లక్షణం మనకుండ కూడదు

అతను మంచివాడు నిజాయితీ గలవ్యక్తి మనవాళ్ళు అనే బంధంతో చెడును సమర్థించే మనస్తత్వం కాదు నాది అతనూ మీ నాన్న లాంటి వాడే అయితే నేనే అతనికి దూరంగా వచ్చేసే వాడిని

నీకు మీ వాళ్ళ మీద ఉన్న అబిమానాన్ని నేను కాదనను ,

కానీ ఆ అభిమానం ఉధృతమై ఆలోచనలు గాడి తప్పి ఆ ప్రభావం మన అనురాగం మీద పడి కలుషితం చేసేలా ప్రవర్తించకు

నన్ను నీ నుంచి వేరు చేసి మాట్లాడకు మంజూ! ప్లీజ్

"సారీ! ఇంకెప్పుడూ ఇలా అనను "

'థాంక్స్!' అన్నాడ తను తేలికైన మనసుతో

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

కామేశ్వరీ, మంజీర కలిసి పేరంటాని కెళ్ళారు. అక్కడి వాళ్ళ సంభాషణ అటు తిరిగి ఇటు తిరిగి మంజీర పుట్టింటి మీదకు మళ్ళింది .

'ఈ అమ్మాయి నింకా వాళ్ళ వాళ్ళు రానివ్వటం లేదా? అయినా... బాబూరావు కిదేం మొండి పట్టుదలమ్మా! అల్లుడు కులం లేనివాడా.. గుణం లేనివాడా?" అని ఒకామె అంటే

"మళ్ళీ కొడుకో కూతురో పుట్టబోతున్నారు గదా ఆ సమయంలో మంజూ కూడా నట్టింట్లో ఉంటే బావుండేది చిన్నపిల్ల ఈమెకు మాత్రం వాళ్ళని చూడాలనుండదూ? ఆ జ్ఞానం వాళ్ళ కుండాలి అంది ఇంకో ఆవిడ.

ఇలాంటివి కామేశ్వరి కలవాటే అయినా ఆమె చెక్కు చెదరదు

కామేశ్వరి తన వియ్యాల వారి గురించి ఉక్రోషంగా మాట్లాడుతుంటేమో



# ఒడిలో చలి మోహన రాగం

వాటిని ఆ ఇంటికి చేర వేసి. మళ్ళీ అక్కడివి తెచ్చి ఈమె కంటించి తమాషా చూద్దామనుకునే వాళ్ళందరికీ కామేశ్వరి ప్రవర్తన భరించ లేనంత నిరాశగా అనిపిస్తుంది. .

పేరంటాళ్ళంతా వెళ్ళి పోయాక ... ఆ ఇంటామె బలవంతం మీద కామేశ్వరీ, మంజీర, షైమ ఇంకా అక్కడే ఉన్నారు .

వాకిటి గుమ్మంలో నుంచి భారంగా కదిలివస్తున్న వ్యక్తిని చూడగానే సంభ్రమంగా లేచి ఒక్క ఉదుటున ముందుకెళ్ళి "అమ్మా"! అంటూ ఆమెను ఆర్తిగా చుట్టేసింది మంజీర

శర్వాణి కళ్ళలో నుంచి తెగిన ముత్యాల సరంలోని ముత్యాల్లా కన్నీళ్ళు జలజలా రాలి మంజీర తల మీద పడ్డాయి కూతుర్ని విడిపించుకుని, కళ్ళకు చేతులడ్డం పెట్టుకుని ఏడుపు నాపుకోటానికి విశ్వ ప్రయత్నం చేస్తోంది శర్వాణి .

ఆ సన్నివేశం అక్కడున్న వాళ్ళను విచలితుల్ని చేసింది ముందుగా తేరుకుంది కామేశ్వరే

శర్వాణి బుజం మీద చెయ్యేసి 'ఒంట్లో కులాసాగా ఉంటోందా ఒదినా? అన్నది ఆదరంగా కామేశ్వరి

"ఊఁ!" అన్నది శర్వాణి

అమ్మా! నాతో మాట్లాడవా?" అంటూ గద్గదస్వరంతో మళ్ళీ శర్వాణి చెయ్యి పట్టుకుంది మంజీర

ఉద్వేగంతో శర్వాణి ఒణికి పోతోంది కూతుర్ని గుండెలకదుముకుని యోగక్షేమాలడగాలనే ఆమె కోరికను బాబూరావు 'ఒట్టు' తన కబంధ హస్తాలతో నలిపేసి నొక్కి పడుతోంది

ఈ పరిస్థితి నరకంగా ఉందామెకు ఫెయింటయి పడిపోబోతున్న దానిలా ఉన్న శర్వాణిని జాలిగా చూస్తోంది కామేశ్వరి. దీన్నెలా ఛేదించాలో ఆమెకు అర్థం కావటంలేదు

పోనీ నాతో మాట్లాడొద్దు లేమ్మా! ఊరికే . కాసేపు నిన్ను చూడనీ. శర్వాణి చేతిగాజులు సవరిస్తూ ఆర్ద్రంగా అన్నది మంజీర.

పోనీ! ఓ పని చేద్దామత్తయ్యా! మామయ్య నిన్ను మంజూతో గదా మాట్లాడొద్దన్నాడు?

ప్రతి సమస్యకూ ఏదో ఒక రిలాక్సేష నుంటుంది అలాగే దీనికీను. నువ్వూ మంజూ ఎదురెదురుగా కూర్చోండి కానీ .. మీ ఇద్దరూ ఒకరితో ఒకరు డైరెక్టుగా మాట్లాడొద్దు నాద్వారా మాట్లాడు కోండి.

మంజూ ఎలా ఉందిట? అను నువ్వు.

ఎలాఉన్నావు మంజూ?" అంటాను నేను




"బాగానే ఉన్నాను అమ్మెలాఉంది? ఒంట్లో బావుంటోందా?" అంటుంది మంజూ

"అత్తయ్యా? నీ ఒంట్లో బావుందా? ఎలా ఉన్నావని అడుగుతోంది మంజూ!" అంటాను నేను

ఇలా నామీదుగా మాటలతో గేమ్ ఆడొచ్చు మీరు ' అంటూ మంజీరా, శర్వాణిల చేత కొద్దిసేపలా మాట్లాడించి ఆ విషాదం మీద నవ్వులు చల్లింది షైమ

తేలికైన మనసుతో షైమను దగ్గరకు తీసుకుని నుదుటిని చుంబించింది శర్వాణి.

"థాంక్స్ షైమా!" అన్నదీ మంజీర కృతజ్ఞతగా

'ఏడిశావులే! నువ్వు నాకు థాంక్స్ చెప్పటం ఎప్పుడు నేర్చుకున్నావు?" అన్నది షైమ

'నీతో అంతా గొడవే! చెప్పకపోతే . థాంక్సయినా చెప్పాలని తెలీదా? అంటూ పోట్లాడతావు చెపితే ఇలా."

"అంటే . ఈ థాంక్స్ నువ్వు మనస్ఫూర్తిగా చెప్పింది కాదన్న మాట! కేవలం నేను పోట్లాడతాననే భయంతో మాత్రమే. ."

"నీకు చెప్పలేం తల్లీ! నిజంగా... రాక్షసివి"! మధ్యలో నే అన్నది మంజీర.

"దీని మొగుడు కూడా ఇంతే అత్తా. ఆఖరుకు మా బావ కూడా... ఈక్షణంలో నన్ను "దేవతవి" అంటారు. మరునిముషంలో నే "రాక్షసివి" అనేస్తారు. వీళ్ళకిదేం జాడ్యమో నాకర్థం కాదు "

అంటున్న షైమ అభినయానికంతా నవ్వేశారు..

మంజీర, శర్వాణి మనసులు కాస్త తేలిక పడ్డాయి

* * * * * * * * *

పెద్దపెట్టున శోకాలు పెడుతూ ఓ యువతి గూడెంనుంచి పరుగెత్తు కొచ్చింది ప్రణీత్ ఇంటికి

'ఎస్ ఐ. బాబునోసారి పిలవండమ్మా!" అన్నది ఖంగారుగా అన్నం తింటున్నారు కూర్చో," అన్నది మంజీర

"అయ్యా బాబో! మా చెల్లిని దాని మొగుడూ వాళ్ళంతా కలిసి చెట్టుక్కట్టేశారు తల్లీ. దాన్ని నిలువునా తగలెడతారంట నేనీడ కూర్చుంటే అక్కడ దాన్ని చంపేస్తరమ్మా చెయ్యికడిగేసుకుని లేచివచ్చిన ప్రణీత్‌ని అసహనంగా చూసింది మంజీర

"అన్నీ నెత్తినేసుకుంటారీయన. ఎప్పుడూఏదో గొడవే, తిండి కూడా తిన నివ్వరాయన్ని ' అనుకుంది విసుగ్గా

స్టేషన్‌కు ఫోన్‌చేసి ఇద్దరు కానిస్టేబుల్స్‌ని బండేసుకుని గూడెంవేపు రమ్మని చెప్పి తన మోటర్‌బైక్ స్టార్ట్ చేశాడు ప్రణీత్

"ఎక్కు." అన్నాడా యువతిని చూస్తూ.

"నేనా! భయంతో గుండెలమీద చెయ్యేసుకుందామె

'నువ్వే ఎక్కు త్వరగా." అన్నాడు ప్రణీత్

'ఒద్దయ్యా! నేను లగెత్తుకొస్తాను.'

"ఎంత లగెత్తుకొచ్చినా నాకన్నా ముందు రాలేవు. ఎక్కు."

"ఒద్దయ్యా!"

'ఎక్కమంటుంటే!" గర్జించినట్టుగా అన్నాడు ప్రణీత్. అదిరిపోయి వెనకాల ఎక్కి కూర్చుందామె

"గట్టిగా పట్టుకో

'ఈ దొర వెనక ఇలా కూర్చునివెళ్ళటం ఎవరయినా చూస్తే.. "నీకేం పోయేకాలమే? నువ్వెంత.. నీ బీవమెంత? అయన వెనక కూర్చునే మొనగత్తెవయ్యావా? అని చెరిగిపెడతారు." అని భయపడుతోందా యువతి .

ఇదేం పట్టించుకోకుండా రివ్వున గూడెంవేపు సాగిపోయాడు ప్రణీత్ ..

ప్రణీత్ వెనకాల కూర్చుని వెడుతున్న ఆ యువతివేపు కంపరంగా చూసింది మంజీర రానురానూ తన మొగుడికి మతిపోతోంది, ఎంత అవసరమయితే మాత్రం... ఆ అలగామూకని వెనకాల ఎక్కించేసుకుని వెళ్ళటమేనా?" అని చీదరించుకుంది .

ఆ రోజంతా అలా రుస రుస లాడుతూనే ఉందామె...



# రచయిత్రి జవాబులు

**షేక్ కరీమున్నీసా, బిట్రగుంట**

ప్ర · స్వప్రయోజనాల కోసం అమాయకుల్ని బలి తీసుకునే బాబూరావు లాంటి వ్యక్తులకు ఏ శిక్ష విధించాలి మేడమ్?

జ మరో సారి పదవిలోకి రాకుండా చూడాలి

**శ్రీనుబాబు, పూనా**

ప్ర : నేటి సమాజంలో రాజకీయ నాయకులు సృష్టిస్తున్న అరాజకాన్ని దృష్టిలో పెట్టుకుని మీరు 'ఒడిలో చెలి మోహనరాగం' సీరియల్ రాస్తున్నారు గదా! సీరియల్ రాసేటప్పుడు మీకేమన్నా ఇబ్బంది తిదురయ్యాయా? ఎదురైతే ఎలా ఎదుర్కున్నారు?

జ · నాకు ఎలాంటి ఇబ్బందులూ ఎదురవలేదు.

**చోడవరపు నాగేశ్వర్రావు, రమాదేవి, హైదరాబాదు**

ప్ర రచయిత్రి తను స్త్రీ అయివుండి మరో స్త్రీ పాత్ర గురించి వర్ణించే టప్పుడు ఎలా ఫీలవుతుంది?

జ : రైటర్ స్త్రీ అయినా పురుషుడయినా. పాత్రలో లీనమై రాసేటప్పుడు ఒకేలాంటి భావాల్ని పొందుతారు స్పందించే తీరులో తేడా ఉండొచ్చు గానీ స్పందనలో కాదు.

ప్ర : మీ బహుమతి పొందిన నవలల పేర్లు తెలియ జేస్తారా?

జ : అనురాగ సంగమం జీవన సంగీతం మొగలి రేకులు– మిన్నాగులు.

**అబద్ధాల రాజశేఖర్, కావలి**

ప్ర : మీరు అన్నీ ఆడ వాళ్ల ప్రశ్నలకే ఎక్కువగా జవాబు లిస్తున్నారు' అన్యాయం కదూ? మీరేమంటారు?

జ : మీ ఇంటి పేరు తాలూకు ప్రబావం మీ ప్రశ్న మీద కూడా స్పష్టంగా కనిపిస్తోందంటాను

## ఉత్తమ ప్రశ్న

**మాడభూషి నరసింహాచారి, నర్సాపురం**

ప్ర : మీరు వివిధ పత్రికల సాహిత్య స్థాయిని బట్టి కథ, శైలి ఎన్నుకుంటారా? లేక ఏ పత్రికయినా సరే పాఠకులకు మంచిరచన అందించాలన్న దృక్పథంతో రచనలు చేస్తారా? దయచేసి వివరిస్తారు గదూ?

జ : పాఠకులకు మంచి రచన అందించాలనే దృక్పథంతో నే రచనలు చేస్తాను.

**ఉపద్రష్ట జగన్నాథరావు, అయినాపురం**

ప్ర అక్కయ్యా' ఆనాటి సినీ నటి సావిత్రి తన నటనా కౌశలంతో అభిమానులను ఆకట్టుకుంది ఈనాటి రచయిత్రి సావిత్రి సంఘంలోని లోటు పాట్లను తన రచనల ద్వారా తెలియ జేస్తూ పాఠకుల అభిమాన రచయిత్రి అయింది మీ "ఒడిలో చెలి మోహనరాగం సుపర్బ్‌గా ఉంది

జ · మీ అభిమానానికి ధన్యవాదాలు

**ఆలూరి పద్మలత, కలికిరి**

ప్ర . యువతరానికి ధైర్య సాహసాలు 'ప్రణీత్' పాత్ర ద్వారా కలగ జెయ్యగలరని ఆశించవచ్చా?

జ తప్పకుండా!

ప్ర · బాబూరావు లాంటి ప్రబుద్ధుల్ని శిక్షించే వారే లేరా?

జ ఎందుకు లేరూ? నవల పూర్తిగా చదవండి

**యల్లాపు భాస్కరరావు, గవరపాలెం**

ప్ర · సుమారు తొంభై శాతం మంది రచయితలు 'ప్రేమ' అనే పదం లేకుండా నవలలూ కథలూ రాయలేక పోతున్నారు. ఎందువల్ల?

జ · సుమారు 'తొంభయ్యయి దు' శాతం మంది పాఠకులు 'ప్రేమ' అనే పదం కోరుకోటం వల్ల

**జె. ఆనందమ్మ, కడప**

ప్ర 'ఒడిలో చెలి మోహనరాగం" చాలా ఉత్కంఠను కలిగిస్తోంది ఇందులో పాత్రలన్నీ వాస్తవానికి దగ్గరగా ఉండేలా రాశారు మాకు నచ్చింది

జ థాంక్స్'

ప్ర : ఈ సీరియల్ రాయటంలో ఎవరి ప్రేరణ ఉందో చెప్పగలరా?

జ 'ప్రణీత్' ప్రేరణ 

"మా వోళ్లంతా పనికి పోయారు దొరా' ఈ అదును చూసుకుని వాళ్లీ గోరానికి తలపడ్డారు నేను జొర మొచ్చిందని మధ్యలో వచ్చేయ్య బట్టి సరిపోయింది లేకుంటే నిలువునా సచ్చేదది' అని చెప్పిందా యువతి ప్రణీత్‌తో అక్కడ చిన్నగుంపు ఏర్పడి ఉంది అంతా వినోదం చూస్తున్నారు కొందరు వారించబోయినా పోలిగాడు వినటంలేదు అంతా తెగతాగి ఉన్నారు

లాఠీ ఝుళిపిస్తూ ప్రణీత్ వాళ్ల మధ్యకు దూకేసరికి సగంమంది పారిపోయారు మిగతా వాళ్ళు మత్తుబాగా తలకెక్కి అక్కడే ఉండిపోయారు ఆసరికి కానిస్టేబుల్స్ అక్కడికి చేరుకున్నారు పోలిగాడు మాత్రం నిర్లక్ష్యంగానే ఉన్నాడు పాపారావు మనుషు లెక్కించిన విషం వాళ్లమధ్యతు తాగిన మత్తు అతన్ని జంతువులా మార్చాయి

పోలిగాడి భార్య రాజకుమార్ వర్గానికి చెందిన వాళ్ల ఇంటి ఆడపిల్ల గూడెం చీలిపోయాక, తన భార్యకు, ఆమె పుట్టింటి వాళ్లకూ మధ్య సంబందాలు తెంపేశాడు పోలిగాడు

పాపారావు తన అనుచరుల ద్వారా ప్లానేసి పోలిగాడికి తన భార్యమీద అనుమానం కలిగేలా చేశాడు బాగా ఎక్కేసి తాగించి, 'మీరు పోలీసుల గురించి భయపడక్కర్లేదు అంతా బాబూరావు చూసుకుంటాడని' ధైర్యం చెప్పి పోలిగాడినీ పరిస్థితికి తెచ్చి వదిలాడు పాపారావు

'ఇహ ఈ దెబ్బతో ప్రణీత్‌గాడి ఆటకట్టు వెయ్యిమంది ప్రణీత్ లేకమయినా ఇహ గూడాన్ని కలపలేరు అనుకున్నాడు పాపారావు. బాబూరావు అధికారం భద్రంగా ఉంటేనే ఆ ఊళ్లో తన ఆటలు బాగా సాగుతాయని అతనికి తెలుసు అందుకే ఆ బద్రతకోసం అతనెన్ని దారుణాలైనా చెయ్యటానికి వెనకాడడు

జ్వరంగా ఉందని పోలిగాడి ఒదిన మధ్యలో ఇంటికి రావటంతో పాపారావు ప్లాను బగ్నమయింది వచ్చీ రాగానే పోలిగాణ్ని నాలుగు బాదాడు ప్రణీత్ చుట్టూ ఉన్న వాళ్లని కూడా లాఠీతో వాయించి బుద్ధిలేదూ మీకు? ఆ పిల్లను వాడలా నిలబట్టి కాల్చేస్తుంటే సోద్యం చూస్తూ నుంచున్నారా .' అని అరిచి పోలిగాడివేపు తిరిగాడు ప్రణీత్

నా పెళ్లాం తప్పుచేసింది ఆ రంగిగాడికాడ పడుకుంది" ఉక్రోషంగా అన్నాడు పోలిగాడు

నేనే పాపం ఎరగన్దొరా' అమ్మతోడు, నూకాలమ్మ తల్లిమీద ఆన, ఎవురో గిట్టనోళ్లు ఆడి మనసు ఇరిచేసినారు లేకుంటే ఆడుమంచోడే, నన్నెంతో ప్రేమగా చూసుకునేవాడు ఏముద నష్టపోళ్లు ఎక్కించారో! ఆడమ్మ కడుపులుకాల అంటూ ఏడుస్తోంది చెట్టుకు కట్టియ్యబడ్డ గౌరి

అదే నిరూపించుకోమంటున్నాను." మొండిగా అన్నాడు పోలిగాడు

ఏం నిరూపించుకోమంటావ్?" అన్నాడు ప్రణీత్

అగ్గిలో దూకి నిరూపించుకోమనండి. తప్పు చెయ్యనప్పుడు దానికింత బయందేనికి? అగ్గిలో కాలిపోతే.. అది తప్పుచేసినట్టు. కాలకుంటే . నేను దాని కాల్లు పట్టుకుని చెమాపన చెప్పుకుంటాను'"

'నిన్నగ్గిలోకి తోస్తే కాలకుండా బయటకొస్తావేమో చూద్దాం పట్టు నువ్వు కూడా ఎవత్తితోటో తిరుగుతున్నావని ఆ పిల్ల కనుమానంగా ఉందిట. మొదట నువ్వు నిరూపించుకో, ఆ తరవాత ఆమె నిరూపించుకుంటుంది."

# ఉచితం!

అనుకూలమైన
బ్యాటరీ ఎమర్జెన్సీ ల్యాంపు

ప్రకాష్
పవర్ హౌస్

ప్రతీ

JOHNSON®

వేరిమిక్స్ / వేరిమిక్స్ మార్క్ II తో




భారత దేశపు దృఢమైన, అత్యంత శక్తివంత మైన
మరియు సురక్షితమైన మిక్సర్ గ్రైండర్లు




ఈ ఆఫర్ ఆంధ్ర ప్రదేశ్ లో మాత్రమే.
స్టాకులు ఉన్నంత వరకూ పరిమితం




Blumac Electricals India

Parade/BE/86 11

Mahavir Combines

5-9-1115, కాంచనజంగా కాంప్లెక్స్, కింగ్‌కోఠిరోడ్
హైదరాబాద్ 500 001 ఫోన్: 231198/235856

పేరొందిన అన్ని ఎలక్ట్రికల్ దుకాణాలలో లభిస్తాయి.


## ఒడిలో వెలి మోహన రాగం

"నా కెవరితోటీ అలాంటి పరిచయం సంబంధం లేదు."

ఆమె కూడా లేదనే అంటోంది

ఏంది మీరు దాని తరుపున మాట్లాడతరు" రాములోరంతటోడే అనుమానంమీద పెళ్లాన్ని అగ్గిలో పార నూకిండు. అయినా కూడా మీరంతా ఆయన్ని నెత్తి నెట్టుకు పూజించటల్లా? అదే పని నేను చేస్తే మక్కెలిరగ బొడిచి బొక్కలో ఏస్తరా? సవాల్ చేస్తున్నట్టుగా అన్నాడు పోలిగాడు

నాలుగు తన్ని వాడి నోరు మూయించొచ్చు కానీ వాడి మనసు మారదు అది తప్పని వాడు అనుకునేవరకూ మళ్ళీ మళ్ళీ ఇలాంటి ప్రయత్నాలు చేస్తూనే ఉంటాడు

నిజమే భార్యని సజీవ దహనం చెయ్యబోయాడని అప్పుడాయన్ని పోలీసు లెందు కరెస్ట్ చెయ్యలేదు?

అప్పుడు రాజే సర్వాధికారి అతను చేసిన ఏపనినయినా అంతా సమర్థించాల్సిందే ప్రశ్నించే అధికారం ఎవరికీ లేదు

రాముడు ఏకపత్నీవ్రతుడు, పితృవాక్పరి పాలకుడు నీతైన క్యారెక్టర్ కలవాడు ప్రజల్ని చక్కగా పాలించగల సమర్థుడు తనవాళ్ళకే పదవు లిప్పించుకోటం ఏ వెధవపని చేసినా తన వాళ్ళను సమర్థించుకోటం పదవికోసం ఎలాంటి అకృత్యాలకయినా పాల్పడటంలాంటి రాజకీయపు కుళ్ళు నెరగనివాడు శాంతిభద్రతలు కాపాడటంలో సమర్థుడు

రామరాజ్యంలో రేపులు జూదాలు దొంగతనాలు హత్యలూ ఉండేవికావు అంతటి పరిపాలనా దక్షుడాయన కానీ ఇవన్నీ వీళ్ళ తలకెక్కవు

రోడ్లమీద పురాణాలు చెప్పేవారు సీతమ్మ అగ్నిప్రవేశం, సీతను అడవిలో వదలడం గురించి వర్ణించినంత గొప్పగా రామరాజ్యాన్ని గురించి, రాముడి సమర్థత గురించీ చెప్పరు చెపితే ఇలాంటి వాళ్ళకు ఇంట్రెస్ట్ ఉండదనేమో! సీతమ్మవారి కష్టాలు ఆకర్షించినంతగా ఇవి ప్రజల్ని ఆకర్షించవనే సత్యాన్ని గమనించి వాళ్ళు వాటినే చెపుతుంటారు కాబోలు

తన ఆలోచనల్ని ఒక్కతృటిలో అణచి చేసుకుని పోలిగాడిని, అతనికి సహకరించిన వాళ్ళనీ స్టేషన్‌కి తీసికెళ్ళి లాకప్‌లో పడేసి ఇంటికొచ్చాడు ప్రణీత్. పోలిగాడి నెలా మార్చాలా అనే ఆలోచన అతన్నొదల లేదింకా.

ఏమయింది? ఆ పిల్లని కాపాడావా?' ఆతృతగా అడిగింది కామేశ్వరి

ఆఁ అన్నాడు ప్రణీత్

ఆ గూడెం దాన్ని వెనకా లెక్కించుకుని మరీ వెళ్లాలా? అది నడిచి రాలేదా?" అన్నది మంజీర

ఆశ్చర్యంగా చూశాడు ప్రణీత్ అతనా కోణంలో నుంచి ఆలోచించటంలేదు, మంజీర మొహం చూస్తుంటే కొద్దిగా నవ్వుకూడా వచ్చిందతనికి

జెలసీయా? అన్నాడు

ఛీ! దానిమీద నాకేం జెలసీ? ఇలాంటి దాన్ని చూసికూడా జెలసీగా ఫీలయ్యేంత దౌర్భాగ్యస్థితిలో లేను నేను "

"ఈజిట్!"

చాల్లెండి. మీకు అసహ్యం వెయ్యలేదూ?'

"ఎందుకు?"

"అంత మురికిగా... దరిద్రంగా ఉండే ఆ అలగాజాతి దానితో.. "

"మురికి అశుభ్రం... అంతవరకూ నిజమే అవి చాతకాక పోబట్టి వాళ్ళలా ఉన్నారు. అంతేగానీ, అలగాజాతని ప్రత్యేకంగా ఏంలేదు. వాళ్ళే ఏ రాజకీయ నాయకులో అయితే... ఒంగి ఒంగి సలాం కొడతారు .

' ఇలాంటి భావాలు మనసుల్లోంచి తుడిచేస్తేనేగానీ మనం ఎదగలేం." ప్రణీత్ వాదన మంజీరకు నచ్చలేదు, ఆ యువతి అలా కూర్చోవటం గుర్తొచ్చినప్పుడల్లా చిరాకు వడుతూనే ఉండేది.

(ఇంకా వుంది)

# గెలవండి! రూ. 20,000/-ల విలువైన బహుమతులు!




## కలువబాల చందాదారులకు లక్కీడిప్:

**ఈ అవకాశం జనవరి 31 వరకు**



మొదటి బహుమతి
★ ఒక కలర్ టి.వి.

రెండవ బహుమతులు
★★ రెండు బ్లాక్ అండ్ వైట్ టి.వి.లు

మూడవ బహుమతులు
★★★ మూడు "కిచెన్ మెషిన్"లు (మిక్సర్‌లు)

నాలుగవ బహుమతులు
★★★★ నాలుగు "లేడీస్ రిస్ట్ వాచీ"లు

రు. 60లు సంవత్సర చందా కట్టగానే అందమైన 'కలువబాల' పత్రిక నెలకి రెండుసార్లు మీ యింటికి అందుతుంది. అదిగాక మీరీ క్రింది బహుమతులు గెలుచుకోవచ్చు.

"చిరుకానుక" తప్పకుండా అందరికీ వుంటుంది.

మీరేం చెయ్యాలి? చేయవలసిందల్లా 'కలువబాల'కు ఏడాది 'చందాదారులుగా' చేరడమే! కాకపోతే మీ 'చందా' పైకంతో పాటు యిక్కడ యిచ్చిన కూపన్ పూర్తి చేసి పంపాలి!

అంతేకాదు ఈ బహుమతి పథకంలో పాల్గొన్న చందాదారులందరికి 'కలువబాల' నుంచి ఒక 'చిరుకానుక' కాలక్రమంలో అందుతుంది.

**"లక్కీడిప్" 31-1-1987 లేదా ఆ లోపల కట్టే చందాలకి మాత్రమే వర్తిస్తుంది.**

కూపన్‌లు, చందాలు పంపవలసిన చిరునామా:

**కలువబాల,**
**కేరాఫ్: ఆంధ్రపత్రిక,**
**గాంధీనగరం, విజయవాడ-3.**

---------- కత్తిరించాలి ----------



నిజమయితే ✓
కాకపోతే ×
అని గుర్తు పెట్టాలి

ఆంధ్రపత్రిక బొంబాయి నుంచి వెలువడుతూ వుండేది. ( )

దినపత్రిక కన్నా వారపత్రిక ముందే పుట్టింది. ( )

"భారతి" సాహితీప్రియుల పక్ష పత్రిక ( )

బాలరంజని పిల్లల పత్రిక ఆంధ్రపత్రిక ప్రచురణ ( )

కలువబాల చందాదారుల 'లక్కీడిప్' చందా కట్టిన వారి పూర్తి పేరు :........................................

........................................

చిరునామా ........................................

........................................

........................................

ఎమ్. ఓ. పంపిన తేదీ ........................................
లేదా
డి డి జత చేయడమైనది

# రక్తదాత గోపీకృష్ణ — కొన్ని జ్ఞాపకాలు

తెలుగునాట సుప్రసిద్ధ రక్తదాత గోపీకృష్ణ కన్నుమూసి – ఈ జనవరి 25 కి 2 సంవత్సరాలు తనలోని చైతన్యాన్ని రక్తస్రవంతిగా తీర్చిదిద్ది కాలగర్భంలో కలిసిపోయిన ఆ మానవతామూర్తిని – ఈ సందర్భంలో ఒక్కసారి స్మరిద్దాం

* * * * * * *

1978 మే నెల ఆఖర్లో అనుకుంటాను – నెల్లూరులోని క్షయాసుపత్రిలో గోపీకృష్ణగారిని మొట్టమొదటి సారి నేను కలిశాను సాదరంగా మాట్లాడి కౌగిలింతతో వీడ్కోలిచ్చారు వారానాడు వారిని నేను ఆఖరు సారి కలిసింది కూడా ఆసుపత్రిలోనే – 1985 జనవరి 2న – మద్రాసులోని శంకర నేత్రాలయలో – జీవితం పట్ల ఆశాభావంతో వున్న వారిని చూశాను మా ఈ రెండు కలయికలూ సంఘటనాత్మకమైనవే అయినా – రక్తదాతగా గోపీకృష్ణ గారికీ రక్తదాతగా, రక్తదాన నిర్వాహకునిగా నాకూ – వైద్యశాలలు కార్యక్షేత్రాలు కావడంతో పాటు – మా ఇద్దరి ఆ మొదటి ఆఖరి కలయికలు సంభవించిన ప్రదేశాలు కూడా వైద్యశాలలు కావడంతో – మా మొదటి ఆఖరి కలయికలు – చాలా సమంజసమైన చోట జరగడంతో పాటు చాలా సింబాలిక్‌గా కూడా జరిగాయని నాకు అనిపిస్తూ వుంటుంది

* * * *

నేను బుద్ధుణ్ని గాదు అశోకుణ్ని గాదు ఐతే నా చిన్న జీవితంలో నేనూ ఒక సంఘటనతో ప్రభావితుడైనాను అంటుండే వారు గోపీకృష్ణ ఇప్పటికి 28 సంవత్సరాల క్రిందట – 1958 లో మద్రాసులోని జనరల్ హాస్పిటల్‌లో ఒక స్త్రీ – రక్తం దొరక్క మరణించింది ఆ విషాద దృశ్యాన్ని చూసిన గోపీకృష్ణ – దుఃఖంతో వేదనకు గురయ్యారు

"వేదనయేలేని బ్రతుకు
యాది కన్న తేలికేను
వేదనలోనె పుట్టెను

వేదమ్ములు నాదమ్ములు" (డా సి నారాయణ రెడ్డి) – అన్నట్టు వారి ఆ వేదనలో నుంచి – రోగుల పాలిట జీవనాదం పుట్టింది – శాశ్వత రక్తదాతగా గోపీకృష్ణ ఆవిర్భవించారు ఆ నాటి నుంచి మరణించే వరకు – స్వచ్ఛంద రక్తదానోద్యమ కేతనాన్ని మోశారు ఈ మధ్యకాలంలో – రోగార్తుల కోసం 50 సార్లు తమ కవోష్ణరుధిరాన్ని తర్పణ చేశారు స్వచ్ఛంద రక్తదానంతో – ఎంతో మందికి స్ఫూర్తినిచ్చి, ఆదర్శంగా నిలిచారు తెలుగు గడ్డకి, ప్రత్యేకించి – నెల్లూరు జిల్లాకి కీర్తిని సంతరించారు

వారి 50 వ – ఆఖరు రక్తదానం – 1981 ఫిబ్రవరి 27న మద్రాసులో జరిగింది సరిగ్గా అదే రోజు మద్రాసులో ప్రారంభమైన – "ఇండియన్ సొసైటీ ఆఫ్ బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూజన్ అండ్ ఇమ్యూనో హెమటాలజి సంస్థ అష్టమ అఖిల భారత మహాసభల్లో – వారిని సొసైటీ సన్మానించింది ఇది – గోపీకృష్ణ తపస్సుకు – ఒక సముచితము అర్థము అయిన భరతవాక్యం

* * * *

రక్తదాత గోపీకృష్ణతో వ్యాస రచయిత



స్వచ్ఛంద రక్తదాతలు ఈ నాడు కూడా అరుదు కాగా, ఇప్పటికి 28 సంవత్సరాల క్రిందట – ఆ పాత రోజుల్లో వైద్యశాస్త్ర పట్టభద్రులెంతో మంది వుండగా న్యాయశాస్త్ర పట్టభద్రుడైన గోపీకృష్ణ – స్వచ్ఛంద రక్తదానం ద్వారా మానవత్వానికి న్యాయం కలిగించ బూనుకొని, విజయాన్ని సాధించి మార్గదర్శకుడవడం – అసామాన్యం అది – మానవతను ప్రేమించే వాళ్ళ హృదయాలను పులకింప చేసే విషయం అందుకే – తన హృదయం పులకించగా – ఒక వ్యక్తి వారి కొక జాబు వ్రాశారు – "ఒక పవిత్ర హృదయము గల మనిషికి ఒక సేవామూర్తికి ఒక నిష్కళంక దేశభక్తునికి ఒక సామాన్య మానవుడు ఏమని శుభాకాంక్షలు తెలుపగలడు? కన్నతల్లికే అన్నం పెట్టని కొడుకులు, లక్షలు సంపాదించినా తండ్రికి, చెల్లికి సోదరునికి మందులకు గూడ డబ్బులు ఇవ్వని మనుషుల మధ్య మీరు నేడు గంజాయి వనంలో తులసి' మొక్క వంటి వారు మీరు 50 వ సారి రక్తదానం చేసిన వార్త చదివిన తరువాత నా మనసు ఆంధ్రజాతి తరఫున నా శిరస్సును మీ పాదాలకు తాకమంటున్నది " అని – ఆ జాబులో తన హృదయస్పందనని తెలియజేశారు

* * * *

రక్తసంబంధం ప్రగాఢమైంది మామూలుగా అందరికీ వ్యక్తులతో రక్తసంబంధం వుంటుంది ఐతే, రక్తదాతకి సమాజంతో రక్తసంబంధం వుంటుంది ఎన్నో సార్లు తమ రక్తాన్ని స్వచ్ఛందంగా దానం చేసిన గోపీకృష్ణ గారికి – సమాజంతోటి రక్తసంబంధం ఎంతో ప్రగాఢమైంది తమ ఈ ప్రగాఢ రక్తసంబంధంతో వారు – తమ తల్లి (మాతృదేశం) ఋణం తీర్చుకున్నారు కాగా రక్తదానం ద్వారా ఎంతో మందికి ప్రాణం పోసిన వారి అమూల్య దేహం – 85 జనవరి 26న అనివార్యంగా – వల్లకాట్లో వల్లకాడై పోడం హృదయ విదారకం

* * * *

గోపీకృష్ణ తమ జీవిత కాలంలో 50 సార్లు రక్తదానం చేసి – తెలుగు గడ్డ మీద స్వచ్ఛంద రక్తదాన కార్యక్రమాన్ని ఎంతో ముందుకు తీసుకుపోయారు ఐతే వారు తమ ప్రమేయం లేకనే – తమ అనారోగ్య కారణంగా – స్వచ్ఛంద రక్తదానోద్యమాన్ని వెనక్కూ తీసుకుపొయ్యారు రక్తదానం – దాతని శారీరకంగా నీరస పరుస్తుందని అనారోగ్యానికి గురి చేస్తుందని తద్వారా ప్రాణ హాని కలిగిస్తుందని – ప్రజల్లో ఒక అభిప్రాయం వుంది చాలా సార్లు రక్తదానం చేసిన గోపీకృష్ణ గారు – తీవ్ర అనారోగ్యానికి గురి కాబడి ఆఖరికి మరణించడం – ప్రజల అభిప్రాయానికి

# సంసారం ఒక రణరంగం

వ్యంగ్య చిత్రావళి: బాలి












# ఋణం తీరిపోయింది

## విన్నకోట సుశీలాదేవి

కళ్ళు మూసుకుని పడుకున్న సీత చటుక్కున కళ్ళు తెరిచింది!

ఎక్కడినుండో చక్కటి వీణానాదం వినబడుతోంది! ఎవరో అత్యంత సమ్మోహనకరంగా వాయిస్తున్నారు!

ఇవ్వాళేకాదు తనీ నర్సింగ్‌హోమ్‌లో చేరిన పది రోజుల నుండీ. మూడు పూటలా క్రమం తప్పకుండా వింటోంది ఎవరో చాలా శ్రద్ధగా నేర్చుకుంటున్నారు! అని కూడా అనుకుంది!

అప్పుడప్పుడణ వీణతో పాటు ఒక తాత గొంతు కలిపి పాడుతుంటుంది!

ఆ అమ్మాయి వీణ కూడా వాయిస్తోందా? లేక ఇంకెవరైనా పాడుతున్నారా!

అని సీత ఆలోచిస్తూ వుంటుంది!

ఇవ్వాళ వీణానాదం ఒక్కటే వినిపిస్తోంది వీణపై రాగాలాపన చేశాక- పాట మొదలైంది!

సీతకు ఆ పాట తనకు నచ్చినదిగానే తోచింది

హఠాత్తుగా సీత కూడా చిన్నగా గొంతు కలపడం ప్రారంభించింది! అది స్పెషల్ రూమ్ అవడం వలన సీత పాట వినే భాగ్యం ఇంకెవ్వరికీ కలగలేదు

కొంతవరకూ వీణతో పాటు సీత గొంతు కూడా వంపులు తిరిగింది! కానీ పై స్థాయి అందుకోలేకపోయింది! సీత గొంతు కీచుగా పలికి ఆగిపోయింది!

సీత వీణానాదంతో పాటు మళ్ళీ పాడాలని ప్రయత్నించింది! కానీ గొంతు బొంగురు పోయింది!

సీతకు కళ్ళలో నీళ్ళు తిరిగాయి!

ఒకప్పుడు తనెంతో బాగా పాడేది

తను వీణ వాయిస్తూ పాడుతూంటే రెండూ ఒక్కలా వుండేవి!

ఆ రోజుల్లో తనకు సంగీతమే ప్రాణం

వీణావాదనే సర్వస్వమూ

సీతకు ఆ రోజులు కళ్ళముందు తిరిగాయి!

* * * * * * *

మధ్య తరగతి కుటుంబంలో పెద్దమ్మాయిగా పుట్టిన సీత చదువు హైస్కూలుతో నే ఆగిపోయింది!

ఎదిగిన ఆడపిల్లని త్వరగా పెళ్ళి చేయాలనే ఆరాటంతో సీత తల్లిదండ్రులు.. సంబంధాలు చూడసాగారు

పెళ్ళి చూపులకు వచ్చిన వాళ్ళందరూ అన్ని ప్రశ్నలతో పాటు అమ్మాయికి సంగీతం వచ్చా? అనే ప్రశ్న కూడా తగిలిస్తూ వుండేవారు!

ఆ ప్రశ్న విని సీత తండ్రి కూతురికి పెళ్ళి కావాలంటే సంగీతం కూడా వచ్చుండాలేమోననుకుని ఒక మాష్టరుని పెట్టి సీతకు సంగీ.. నేర్పించడం మొదలెట్టాడు!

ఇంట్లో వాళ్ళకి అది 'పెళ్ళి సంగీతమే' అయినా సీత మాత్రం ప్రాణాలన్నీ దానిమీదే పెట్టుకుని కష్టపడి సాధన చేస్తూ దీక్షగా నేర్చుకోసాగింది

చల్లని సాయం సంధ్యా సమయాల్లోనో నిశ్శబ్దంగా వుండే ఉషోదయ కాలంలోనో వీణ పుచ్చుకుని వాయిస్తూ బాహ్య ప్రపంచాన్నే మరిచేది సీత

వీణ వాయిస్తోంటే తిండీ, నిద్రా కూడా అవసరమయ్యేవి కావు!

ఎప్పుడూ ఇలా వాయిస్తూ వుండిపోతే ఎంత బాగుణ్ను! అనుకునేది!

సీత శ్రద్ధ చూసి మాష్టారు చాలా ముచ్చట పడేవాడు!

'సీతా! నిన్ను చూస్తే నాకు చాలా గర్వంగా వుందమ్మా! నా పేరు నిలబెట్టే శిష్యురాలివి దొరికావు! నీ గొంతులో పలకని రాగమే లేదు నువ్వు సంగీత సరస్వతివి" అంటూ మేష్టారు మెచ్చుకుంటోంటే సీత ఆనందంతో పొంగిపోయేది!

తను గొప్ప సంగీత విద్వాంసురాలవ్వాలని కలలు కనేది!

మరింత శ్రద్ధగా సాధన చేయడం మొదలెట్టింది సీత!

ఆ సమయంలోనే తండ్రి రాజారావు సంబంధం తీసుకొచ్చాడు

రాజారావుతో పాటు అతని తల్లి దండ్రులు అక్క చెల్లెళ్ళు కూడా వచ్చారు పెళ్ళి చూపులకు

అన్ని ప్రశ్నలతో పాటు "అమ్మాయికి సంగీతం వచ్చా? అనడిగింది రాజారావు తల్లి!

"ఆ వచ్చుంది! చాలా బాగా పాడుతుంది .

సీత తండ్రి గర్వంగా చెప్పాడు!

"ఒకపాట పాడమ్మా!" సీతని అడిగారు!

అంత మందిలో నూ పాడాలంటే సిగ్గేసింది సీతకు

తండ్రి హెచ్చరించడంతో త్యాగరాజ కృతి అందుకుంది!

కానీ ఎత్తుగడలోనే తాళం తప్పింది దాంతో కంగారెక్కువై.... అప్రశ్రుతులతో తప్పుడు తాళంతో పాట ఎలాగో అయిందనిపించింది సీత!

చాలా బాగుందని మెచ్చుకున్నారందరూ.

సీతకు వాళ్ళ సంగీత పరిజ్ఞానానికి ఆశ్చర్యం, ఆనందం కలిగాయి!

తనింత అపశ్రుతులతో పాడితేనే ఎంతో బాగుందన్నారు! సరిగా పాడితే ఎంతో సంతో ...రో! ...కుంది!

తర్వాత ఆ సంబంధం స్థిరపడిందని తెలిసిన రోజున ఎక్కువగా సంతోషించింది సీత ఒక్కతే ఆ ఇంట్లో!

ప్రైవేటు కంపెనీ వుద్యోగమని తల్లీ కట్నం మరీ ఎక్కువగా వుందని తండ్రీ. కొంచెం అసంతృప్తిగా వున్నారు!

కానీ సీత ఆనందం చెప్పనలవికాదు!

తను సంగీత విద్వాంసురాలు కావాలనుకుంటోంది! అటువంటి సంగీతాభిమానుల దగ్గర.. తన కోరికలు తప్పక తీరుతాయి అనుకుంటూ సంబర పడింది సీత!

పెళ్ళయ్యాక వీణతో సహా అత్తింట్లో అడుగు పెట్టింది సీత! అది చూసి అత్తగారు

మా కోడలు ఎంతగొప్ప సారె తెచ్చిందో?"వెటకారంగా ఇంటికి వచ్చిన వాళ్ళందరికీ చెప్పింది!

"వదినా! నీకు వీణ ఎందుకు! నువ్వు ఇక్కడకు వచ్చింది కాపరం చేయడానికా? లేక కచేరీలు చేయడానికా? "అంటూ ఆడబడుచులు నవ్వారు

సీత ముఖం చిన్నబోయింది!

ఆనాడు వాళ్ళు చూపిన అభిమానమంతా పైపై నటనేనా? ఇక తను సంగీతం నేర్చుకునే అవకాశమే లేదా? తన ఆశలన్నీ నిరాశలు కావలసిందేనా? అంటూ దుఃఖపడింది సీత!

ఉమ్మడి కుటుంబం సీతకు వూపిరాడని పని ఎప్పుడైనా తీరిక దొరికినప్పుడు వీణ తీసేది

అంతే అందరూ మీద విరుచుకు పడేవారు!

వదినా! అబ్బా . తలనొప్పి వస్తోంది! మమ్మల్ని ఇంట్లో వుండమంటావా? లేక పొమ్మంటావా! అంటూ మరుదులు తల పట్టుకునేవారు!

వాళ్ళు ఇల్లెగిరిపోయేట్టు పెద్ద సౌండు పెట్టి హిందీ పాటలు విన్నప్పుడు తలనొప్పి రాదా! ...' అనుకుంటూ సీత మనసులో బాధ పడేది!

ఇక అత్తగారు

"మా కోడలు మహారాణి! హాయిగా వీణ వాయించుకుంటూ కూర్చుంటుంది! ఇంట్లో నేనొకదాన్ని వున్నాగా వంట మనిషిని . అంటూ సాధించేది!

భోజనానికితప్ప వంటింట్లోకి రాని అత్తగారు అలా సాధించడం విని సీత భరించలేకపోయింది!

వాళ్ళందరికీ.... ఎందు కింత కోపం అసలీ కోపమంతా . తనమీదనా?లేక వీణ మీదనా?

ఇది కోపమా? లేక తను బాగా వాయిస్తుందనే అసూయా?. సీత ఆలోచించేది!

ఏదయితే ఏం వాళ్ళ బాధ భరించలేక వీణ వేపు కన్నెత్తి కూడా చూసేది కాదు! సంవత్సరాని కొకసారి దుమ్ము ధూళితో నిండిన వీణని బాగా దులిపి.... చక్కగా పెట్టెలో దాచి పెట్టేది! అంతే!

సీత భర్త రాజారావుకి సంగీతమంటే ఇష్టం లేకపోయినా అయిష్టం మాత్రం లేదు...

అయితే.... ఆ కుటుంబంలో ... అతని మాట ఎక్కువ చెల్లుబాటయ్యేది కాదు

ఆ తర్వాతి సంవత్సరమే సీతకు కొడుకు పుట్టాడు దానితో సంగీతం విషయమే మర్చిపోయింది!

వరసగా నల్గురు పిల్లలు కలగడంతో సీత పూర్తిగా సంసార సాగరంలో మునిగి పోయింది!

ఇప్పుడు అత్త మామలు లేరు .. మరుదులు వుద్యోగరీత్యా పై వూళ్లకు వెళ్లిపోయారు! ఆడబడుచులకు పెళ్లిళ్లు అయిపోయాయి!

సీతను సాధించేవాళ్లు. వెక్కిరించేవాళ్లు ఎవ్వరూ లేరు!

కానీ సీతకు తన సంసారమే ఒక పెద్ద సంగీత కచ్చేరీలా తయారయింది! భర్తకు వచ్చే డబ్బు చాలకపోవడం.. ఎదిగే పిల్లల ఖర్చు.. అధిక ధరలు, అప్పులు, సమస్యలు. .. కష్టాలు వీటితో సీత వుక్కిరి బిక్కిరై పోతుంటుంది

ఇప్పుడు సీతకి వీణ అనే వస్తువు తనింట్లో వుందని కూడా గుర్తు లేదు.

ఇదుగో మళ్లీ ఇప్పుడు ఈ నర్సింగ్‌హోమ్‌లో చేరాక ప్రక్క ఇంట్లో నుండి వీణా నాదర వినిపిస్తుంటే ఒంటరితనం, తీరుబాటు ఆమెకు గతాన్ని గుర్తు చేస్తున్నాయి! జ్ఞాపకాల పుట్టలో వున్న ఆశల్ని కెలుకుతూ వాటిని లేపుతోంది సీత మనస్సు!

* * * * * * *

"ఏమిటి సీతా! దీర్ఘాలోచనలో వున్నావ్! అంటూ వచ్చాడు రాజారావు!

సీత ఆలోచనలనుంచి బయటపడి భర్త వేపు చూసింది!

అతని రెండు చేతులనిండా పళ్లు - బిస్కెట్లు బ్రెడ్లు వున్నాయి! వాటిని చూసి ఆశ్చర్యపోయింది!

తను ఈ హాస్పిటల్లో చేరాక ఆపరేషన్ అయిన మూడో నాటి నుండీ రాజారావు గదంతా పళ్లతోనూ.... హార్లిక్స్ టానిక్కులతో నింపేస్తున్నాడు! ఇంట్లో పిల్లల్ని చూసేందుకు పని పిల్లనూ . వంటకు మనిషినీ కుదిర్చాడు

ఇవన్నీ విని సీత నోరు తెరిచింది.

తమ ఇంటి పరిస్థితి తెలుసు

పాలవాడికీ . ఇంటి అద్దె ఒక నెలన్నా సరిగ్గా ఇవ్వలేకపోయేవాళ్లు. పిల్లల ఫీజు లెప్పుడూ వాళ్ల పేరు కొట్టేశాకే కట్టేవాళ్లు .. తనొక క్రొత్త చీర కొనుక్కోవాలంటే సంవత్సరం ఆలోచించేది. నెలాఖరులో అప్పు చేయకపోతే ఆ వారమంతా ఇంట్లో వాళ్లు పస్తే ..

అటువంటిది ఈ పళ్లకీ - టానిక్కులకూ పనివాళ్లకూ డబ్బెలా వచ్చింది?

నెలాఖరులో పది - ఇరవై ఇచ్చేవాళ్లే కానీ - వందలిచ్చే గొప్ప స్నేహితులెవరూ రాజారావుకు లేరు

మరి ఈ డబ్బు ఎక్కడిది?

రాజారావు బత్తాయి తొనలు వలుస్తున్నాడు!

ఏవండీ! మిమ్మల్నో మాట అడగనా?' అందిసీత!

రాజారావు తలెత్తకుండానే-

అడుగు - అన్నాడు!

ఈ పళ్లకు - పని మనుషులకూ డబ్బెక్కడిది!

ఎందుకు! అవన్నీ నీకెందుకు! నేనేదో తంటాలుపడి తెసుకొస్తున్నాగా! నువ్వు డబ్బు గురించి ఆలోచించడం మానెయ్. అవన్నీ తిని- ఆరోగ్యవంతురాలవై ఇంటికిరా ఆ తర్వాత వివరాలు కావలిస్తే చెప్తాను అన్నాడు!

సీత మాట్లాడలేదు



రాజారావు తొనలు వలచి సీత కందిస్తున్నాడు!

"సీతా! ఈ పదిరోజులూ హాస్పిటల్లో వుంటే వున్నావుగానీ ఎంత మార్పువచ్చిందో నీలో తెలుసా!

ఇప్పుడు అచ్చం పెళ్ళినాటి సీతలా వున్నావ్ అన్నాడు.

ఆమెవేపు ప్రేమగా చూస్తూ!

తనలో వచ్చిన మార్పు సీతకు కూడా తెలుస్తోంది! ఇదివరకున్న నీరసం అనారోగ్యం పోయి- కొత్త ఉత్సాహం శక్తి వచ్చినట్టుగా వుంది!పనీపాటూ లేదు! కూర్చుని బలమైన ఆహారం తినడంతో శరీరం నునుపెక్కింది బుగ్గల్లోకి ఎర్రదనం కళ్ళల్లోకి కాంతీ వచ్చాయి!

"సీతా! మేం అక్కడ చాలా హాయిగా వున్నాం! ఇల్లు గురించి నువ్వేం దిగులుపడకు వంటమనిషి చక్కగా వండుతోంది! మరో మూడు నెలల వరకూ నువ్వు విశ్రాంతి తీసుకోవాలికదా. ఇంటికొచ్చినా హాయిగా పడుకోడమే నీ పని తెలిసిందా"అన్నాడు రాజారావు

సీత మాట్లాడలేదు

పక్కింట్లో నుండి వీణావాదన ఇంకా వినబడుతూనే వుంది! సీత ఆలోచనలు- ఎక్కడెక్కడికో పోయాయి

తనకి మూడు నెలలవరకూ పూర్తి విశ్రాంతి! ఊరికే కూర్చునేబదులు వీణ సాధన చేస్తే.. మూడు నెలలంటే - తొంభైరోజులు రోజుకు ఆరుగంటల చొప్పున చేసినా చాలు.నేర్చుకున్నదాన్ని తిరిగి జ్ఞాపకం చేసుకోడమే కదా...

మూడు నెలలు గడిచాక తను తప్పకుండా సంగీత కచ్చేరీ చేయగలదు.

ఒక్క కచ్చేరీ చేసిందంటే తన ప్రతిభ అందరికీ తెలుస్తుంది! మొదటి మెట్టు ఎక్కడమే కష్టం' ఆ తర్వాత నిచ్చెన పైకి వెళ్ళడం. ఎంతో తేలిక

కీర్తి ప్రతిష్ఠలతోపాటు ఎంతో ధనాన్ని కూడా ఆర్జించవచ్చు' అప్పుడే డబ్బు సమస్య వుండదు

# ఋణం తీరిపోయింది

తనని ఎగతాళి చేసిన వాళ్ళు తనని చూసి అసూయపడతారు

తన కంఠమాధుర్యాన్ని చూసి ఏ సినిమాల్లోనో ప్లేబాక్ గాయనిగా చాన్సు వస్తే ఇక తనకు ఎదురేలేదు మేడల్లో వుండొచ్చు కార్లల్లో తిరగొచ్చు అనుకుంటూ సీత ఆనందంతో పులకరించిపోయింది!

అబ్బ వూహ ఇంత బాగుంది కదా!

వూహలు నిజాలైతే ఇంకెంత బాగుంటుందో! ఏదైనా తన సంగీత సాధనకు ఇదే తగిన సమయం

మళ్ళీ జన్మలో ఇటువంటి అవకాశం రాదు అయినా ఆ దేవుడు కూడా తనని సంగీత విద్వాంసురాలిని చేయాలనే ఈ ఆపరేషన్ కల్పించాడేమో! తనిక ఒక్క క్షణం వృధా చెయ్యకూడదు ఇంటికి వెళ్ళగానే మొదలెట్టాలి అనుకుంటూ ఎప్పుడెప్పుడు ఇంటి కెళుదామా అని తహతహలాడిపోయింది సీత!

* * * * * *

ఆ రోజు వచ్చింది!

సీతని హాస్పటల్ నుండి డిశ్చార్జ్ చేశారు!

రాజారావు సీత వద్దంటూన్నా వినకుండా టాక్సీలో ఇంటికి తీసుకెళ్ళాడు! సీత వెళ్ళేటప్పటికి పిల్లలెవ్వరు! స్కూలుకెళ్ళారు!

వంట మనిషి ఎదురొచ్చి లోపలకు తీసుకెళ్ళింది!

సీత ఇల్లంతా కలయ చూసింది!

ఎక్కడి వస్తువులక్కడ అమర్చబడి ఇల్లంతా ఎంతో అందంగా సర్దేవుంది!

'స్నానం చేసిరా సీతా! బడలిక తగ్గుతుంది రాజారావు అన్నాడు!

సీత లోపలకు వెళ్ళి- పనిపిల్ల సాయంతో స్నానం ముగించి వచ్చింది!

అమ్మా! టిఫిను తీసుకోండి వంటమనిషి ఇచ్చింది ఉప్మా తిని- కాఫీ త్రాగి- సీత తన గదిలోకి వచ్చింది!

తన వీణ కోసం చూసింది!

గదిలో కనబడలేదు

ఇల్లు సర్దడంలో ఇంకెక్కడైనా పెట్టారేమో అని పనిపిల్లని పిలిచి అడిగింది!

'వీణ ఏదీ?"

అంటే ఏంటమ్మా!" అమాయకంగా అడిగింది!

విసుగ్గా చూసింది సీత!

'నువ్వేళ్ళు.... అయ్యగారి ఎక్కడున్నారు? అనడిగింది!

"అయ్యగారిన్ని పిలుచుకొస్తానంటూ- పనిపిల్ల వెళ్ళింది!

"పిలిచావా సీతా" అంటూ వచ్చాడు రాజారావు- ఆదుర్దాగా!

నా వీణ ఏదండి' అనడిగింది!

ఓ అదా! ఏమైనా వుందో బాగా లేదేమోనని కంగారుపడ్డాను అని తాపీగా చెయ్యున్నాడు!

సీత అసహనంగా చూసింది!

వీణ దుమ్ము దులిపి ఎప్పుడెప్పుడు స్వరాలు పలికిద్దామా అని ఆరాటపడుతోంది సీత!

ఆ క్షణంలో వీణ తప్ప ఆమె కళ్ళకు ఇంకే ప్రపంచమూ కనబడటంలేదు

'ముందు వీణ సంగతి చెప్పండి! ఏ గదిలో పెట్టారు లేక ఏ మూలకన్నా విసిరేశారా" అంటూ నిలేసింది

"నువ్వలా కూర్చో ముందు " సీతని చేయిపట్టి కుర్చీలో కూర్చోబెట్టాడు.

సీతా! ఆవేశం తగ్గించుకో! స్థిమితపడు నేను చెప్పబోయే విషయం నీకు బాధకలిగించవచ్చు

ఏమిటండీ అది!

నువ్వొకసారి హాస్పిటల్లో అడిగావు గుర్తుందా ఈ డబ్బంతా ఎక్కడిదని

'అవును అడిగాను

ఆ డబ్బంతా ఎలా వచ్చిందంటే గుటకలు

## గడుసులోకం

—బాబు






"తెలుసుకోవటమే నా వృత్తి!" అన్నాడు ఆనంద్.

ఇంకేమీ ప్రశ్నించలేదు విజయ్.

*　　*　　*　　*　　*　　*

చెక్‌పోస్ట్ దగ్గర కాపలాకాసి ఉన్నాడు విజయ్.

లారీ నంబర్‌తో సహా ఇన్ఫర్‌మేషన్ అందిచ్చాడు ఆనంద్.

అందుకని చెక్‌పోస్ట్ దగ్గర కాపలా ఉన్నాడు

దూరంగా లారీ వస్తూ కనిపించింది.

కొంచెం దగ్గరికి వస్తూనే బైనాక్యులర్స్ ద్వారా లారీ నెంబరు చూశాడు.

ఎ పి ఎన్. 6012

అదే తనక్కావల్సిన లారీ

అందర్నీ జాగ్రత్తగా, ఎలర్ట్‌గా ఉండమని ఆర్డరిచ్చాడు మిగతా కానిస్టేబుల్స్‌కి విజయ్

జీప్‌లన్నీ ఇంజన్ ఆన్ చేసి ఉన్నాయి.

లారీ వస్తుంటే చెయ్యెత్తి ఆపమని సైగ చేశాడు విజయ్.

కాని లారీ స్లో అయినట్లే అయి వెంటనే ముందుకు దూకింది

"కమాన్ హరియప్" అంటూ ఒక జీప్ డ్రైవింగ్ సీట్లో కూర్చొని లారీని వెంబడించాడు విజయ్.

ఇంకొక జీప్‌లో కానిస్టేబుల్స్ అనుసరించారు

ముందు లారీ. వెనక జీప్‌లు ఆఘమేఘాల మీద దూసుకుపోతున్నాయి.

డ్రైవింగ్ ప్రక్కనున్న కానిస్టేబుల్ కందించాడు విజయ్.

రివాల్వర్ చేతికి తీసుకొన్నాడు

లారీ వెనుక టైరుకు గురి చూసి కాల్చాడు రివాల్వర్‌ను. టైరు ప్రక్కగా మసుకు పోయింది బుల్లెట్

మరొక్కసారి పేల్చాడు.

ఈ సారి బుల్లెట్ లారీ వెనుక వైపు కుడివైపు టైరుకు తగిలి టైరు బరస్ట్ అయింది

వెంటనే మరొక బులెట్ ఎడమవైపు టైరుకు తగిలింది.

వెంటనే కీచుమంటూ శబ్దంతో లారీ అష్ట వంకరలు తిరుగుతూ ఆగిపోయింది అడ్డంగా

లారీ డ్రైవర్ లారీ దిగి పారిపోయాడు కాని వెంటనే పోలీస్ జీప్‌వచ్చి ఆగింది. జీప్‌లో నుంచి దిగిన కానిస్టేబుల్స్ డ్రైవర్‌ను అరెస్ట్ చేశారు

లారీ చెక్ చేశాడు విజయ్.

లారీలో గంజాయి, నల్లమందు పాక్ చేయబడి ఉంది. పైన కట్టెలు పేర్చబడి ఉన్నాయి

"ఎవరిదీ లారీ? అడిగాడు విజయ్ డ్రైవర్‌ను.

నాదే?" అన్నాడు డ్రైవర్.

"అలాగా, నీ పేరేంటి'

'నాగులు' సమాధాన మిచ్చాడు డ్రైవర్

'లైసెన్సుందా" అడిగాడు విజయ్

నీ బుక్ చూపించాడు డ్రైవర్.

"కానిస్టేబుల్ ఇతన్ని అరెస్టు చేయండి?"

నాగుల్ను అరెస్ట్ చేసి స్టేషన్‌కు తీసుకెళ్లారు

లారీని సీలువేసి ఇద్దరు కానిస్టేబుల్స్‌ను కాపలా ఉంచారు

నాగులును టార్చర్ రూంలో బంధించారు ఎస్. పి. నందనరావు, కమీషనర్, ఐ జి , ఇన్‌స్పెక్టర్ విజయ్‌లు అందరూ ఉన్నారు అక్కడ.

గంజాయి, నల్లమందు స్మగ్లింగ్ కొరకరాని కొయ్యలా, అంతు చిక్కని సమస్యలా తయారయింది పోలీస్ డిపార్ట్‌మెంట్‌కు ఇప్పుడు నాగులును పట్టుకొనటం వలన కొంచెం క్లూ దొరికినట్టయింది.

సామాన్యమైన డ్రైవర్ ఇంత భారీగా స్మగ్లింగ్ చేస్తున్నాడంటే నమ్మ బుద్ధికావటంలేదు అధికారులకు

'నాగులూ మర్యాదగా చెప్పు ఎవరు మీ బాస్?" అడిగాడు కమీషనర్.

"నా కెవ్వరూ బాస్‌లేరు. నాకు నేనే బాస్‌ను" సమాధాన మిచ్చాడు నాగులు.

నాగులు డ్రైవ్ చేస్తున్న లారీ, మరియు అందులోని వంట చెరకు అంతా


శ్రీమహాలక్ష్మి వారి సరికొత్త నవలలు
ఫిబ్రవరి 7 విడుదల!

సగటు మనుషులు (కథలు) ........ రూ 18/-
దూరం, దగ్గరైన హృదయాలు ........ రూ 20/-
మల్లాది వెంకట కృష్ణమూర్తి
గోకులంలో రాధ ...... వంశీ ........ రూ 18/-
(స్వాతివీక్లీ సీరియల్, త్వరలో సినిమా)
మహావేధ ...... చివుకుల పురుషోత్తం ...... రూ 25/-
సావని ...... సి. విమలా నాగేష్ ........ రూ 18/-
జీవనవీణ ...... మద్దుగడ సూర్యప్రకాశరావు ...... రూ 16/-
కొత్త సంగీత విద్యాదర్పణము ...... రూ 60/-
(సంగీత విద్యార్థులకుపయుక్తము) ఏకాసుబ్బారావు

నేడే అడ్వాన్సుతోపాటు ఆర్డరు పంపండి!

శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్‌ప్రైజెస్
మచ్చావారియం రోడ్, విజయవాడ-2, ఫోన్: 63322






తాజావార్తలకు, ప్రత్యేక శీర్షికలకు, వైవిధ్యంగల వ్యాసాలకు
ఆంధ్రపత్రిక దినపత్రిక చదవండి.

## ఆశయం

నాగులు పేరు మీదనే ఉన్నాయి

"సరే నీకు గంజాయి, నల్లమందు ఎవరిచ్చారో చెప్పు? ఎవరికి చేరవేస్తున్నావు నువ్వు వాటిని?"

"నేను చెప్పను "

"చెప్పకుంటే ఊరికే వదలం, చెప్పేదాకా చిత్రహింసల పాలు చేస్తాం" బెదిరించాడు కమీషనర్.

వెంటనే నాగులు తన షర్ట్‌పైనుండే బటన్‌ను నోటితో దగ్గరకు లాక్కొని పళ్ళతో గట్టిగా పట్టుకొని కొరికాడు.

**అంతే!**

ఆ బటన్‌లో ఇముడ్చుకున్న పవర్‌ఫుల్ పాయిజన్ నోటిలోనికి ప్రవహించి వెంటనే క్షణాల్లో మరణించాడు నాగులు.

అతని మొఖం రంగులు మారింది నోట్లోంచి నురగలు క్రక్కాడు నాగులు

"ఓ! మై గాడ్ ఇదేదో పెద్ద ఆరితేరిన గాంగ్ లాగుంది' అన్నాడు ఐ జి ఆశ్చర్యంగా.

"సర్ నాకు ఆ గాంగ్‌ను పట్టుకోవటానికి పర్మిషనివ్వండి" అన్నాడు విజయ్

"ఓ కే ఎవరైనా సహాయం కావాలా?"

"నో అవసరంలేదు నేనొక్కడినే ఈ ఆపరేషన్ నియంత్రించాలను కొంటున్నాను" అన్నాడు విజయ్

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

భయంకరమైన కారడవి

సూర్య కిరణాలు సైతం నేల బడకుండా ఉండేటంత దట్టంగా అల్లుకొన్న పొదలతో, పగలే దారి కనపడనంత భయంకరమైన చీకట్లు క్రమ్ముకొని ఉంది అడవి అంతా

అలాంటి అడవిలో ప్రవేశించాడు విజయ్

విజయ్ జంగిల్ బూట్లు ధరించి, లెదర్ జర్కిన్ వేసుకొని తలకు టోపీ ధరించి ఉన్నాడు ఒకచేత హంటింగ్ గన్ పట్టుకొని వున్నాడు ఇంకా రివాల్వర్, హంటింగ్ నైఫ్, బుల్లెట్ పటకాలు తీసుకొచ్చాడు

ఆ అడవిలో గల గంజాయి, నల్లమందు స్థావరాల అన్వేషణకై బయలుదేరాడు విజయ్.

దారంతా రాలిన ఆకులతో, ముండ్లతో చిందర వందరగా ఉంది దారిలో ఎదురైన లేళ్ళు, చెవుల పిల్లులు లాంటి చిన్న చిన్న జంతువులు ప్రక్కకు పారిపోతున్నాయి భయంతో

అలా మధ్యాహ్నం దాకా అన్వేషిస్తూనే ఉన్నాడు అడవంతా విజయ్

కాని ఫలితం లేకపోయింది

ఎంత వెతికినా ఇంకా అడవి మూడు భాగాలు ఉండి పోయింది

అక్కడక్కడ విషపు పాములు, తేళ్ళు ఎదురయ్యాయి విజయ్‌కి

ఏమాత్రం ఏమరుపాటుగా ఉన్నా కాటేస్తాయి అవి

వాటి కాటుకు తిరుగులేదు

దాహం వేయడంతో ఒక చెట్టుక్రింద నిలబడి వెంట తెచ్చుకొన్న వాటర్ బాటిల్‌లోని నీళ్ళు తాగసాగాడు విజయ్

ఆ చెట్టు కొమ్మ మీదనే ఉంది భయంకరమైన కొండచిలువ

క్రింద నిలబడిన విజయ్‌ను చూసి విజయ్ వైపుగా రాసాగింది అది.

దాదాపు 12 అడుగుల పొడుగుతో, ఒక అడుగు వెడల్పుతో భయంకరంగా ఉంది కొండచిలువ

ఎన్ని రోజులుగా ఆకలితో ఉందో మరి నాలుకలు చాపుకుంటూ సరిగ్గా విజయ్ నెత్తిమీదకు వచ్చి సరిగ్గా విజయ్‌పైదూకింది

ఆ అదురుకు, ఒక్కసారిగా ఆ కొండచిలువ పైన పడేసరికి త్రాగుతున్న వాటర్ బాటిల్ ఎగిరి దూరంగా పడింది

కొండ చిలువ మీద పడుతూనే తన శరీరాన్ని విజయ్ శరీరం చుట్టూ మెలికలుగా త్రిప్పి చుట్టేసింది.

ఉక్కిరి బిక్కిరయ్యాడు విజయ్. విడిపించుకోవాలని గింజాకో సాగాడు

గింజుకున్న కొలదీ ఇంకా బిగుసుకో సాగింది కొండచిలువ పట్టు

ఎముకలన్ని విరిగి'పోతున్నట్లనిపించింది విజయ్‌కి

కొండచిలువ తన గుహలాంటి నోరు తెరచి, నాలుకలు చాపుతూ విజయ్ తలవైపు చాపసాగింది నోటిని

ఇక ఉపేక్షిస్తే ప్రాణాలకే ముప్పు వాటిల్లుతుందను కొన్నాడు

నెమ్మదిగా చేతిని బొడ్డువైపుకు పోనిచ్చుకొని, బొడ్డులో దోపుకొని ఉన్న హంటింగ్ నైఫ్ అందుకొన్నాడు

కసుక్కున్న దిగేశాడు కొండచిలువ శరీరం లోనికి నైఫ్‌ను

వెంటనే మళ్ళీ ఒకటి . రెండు . మూడు వరుసగా పొడిచాడు విజయ్

దాంతో పట్టు కొద్దిగా సడలించింది కొండచిలువ.

ఇంకా రెచ్చిపోయి కొండచిలువ పొట్టలో పొడిచాడు విజయ్

కొండచిలువ రక్తమంతా బయటకు తన్నుకొంటూ వచ్చింది పట్టు పూర్తిగా సడలి పోయింది

విదిలించుకొన్నాడు శరీరాన్ని ఒక్కసారి విజయ్ కొండచిలువను దూరంగా విసిరేశాడు

కొన ఊపిరితో కొద్ది సేపు గిలగిలా కొట్టుకొని తల వాల్చేసింది అది

విజయ్‌కి శరీరంలోని ఎముకలన్నీ విరిగి పోయినట్లనిపించింది నిలబడే శక్తిలేనట్లు అలాగే చెట్టుక్రింద కూలబడి పోయాడు

దాదాపు ఒక గంటసేపు రెస్ట్ తీసుకొని, మరలా బయలు దేరాడు

అలా కొంత దూరం నడచి ఎదురుగా కనిపించిన దృశ్యాన్ని చూసి భయంతో అలాగే గుడ్లప్పగించి చూస్తూ నిలబడి పోయాడు విజయ్

ఎదురుగా ..

ఒక గిరిజన యువతి నిలబడి ఉంది. ఆమె శరీరమంతా చెమటలు పట్టి ఉన్నాయి ఆమెకు సరిగ్గా రెండడుగులు ఎదురుగ్గా ..

ఒక భయంకరమైన నల్లత్రాచు పడగవిప్పి బుసకొడుతూ ఉంది.

దాదాపు ఆరు అడుగుల పొడుపు ఉంది భయంకరంగా ఉంది ఆ పాము

ఆ యువతి శిల మాదిరిగా నిలబడి ఉంది. ఏ మాత్రం కదలిక కన్పించినా కాటు వేస్తుంది ఆ నల్లత్రాచు.

**(ఇంకాఉంది)**



# ఉక్కుతో దీటైన శక్తినిచ్చే...

# విష్ణు సిమెంట్

**ప్రత్యేకమైన హైగ్రేడ్ లైమ్‌స్టోన్‌తో తయారై**
**మరేయితర సిమెంటుకన్నా**
**అత్యధిక ధృడమైనది**




శ్రీ విష్ణు సిమెంట్ లిమిటెడ్

గుల్‌మొహర్ ఎవెన్యూ, రాజ్‌భవన్ రోడ్ హైదరాబాద్ - 500 482






**కె. ఎ. ఆర్. కాకినాడ**

★ అందరికీ చదువు ఒంట బట్టదు. మరి బలవంతంగా చదివించడం దేనికి?

● రూపం, వయసు, పుట్టుక ఎంత ఉన్నతంగా వున్నా విద్యాగంధం లేక పోతే రాణింపు వుండదు. మోదుగ పువ్వు అందమేగాని నిష్ప్రయోజనం కద!

**ఎ. ఎస్. ఎస్. ఇరుసుమండ**

★ కవిగొప్పవాడా? రచయిత గొప్పవాడా? ఈరోజుల్లో ఎవరు ఎక్కువగా వున్నారు?

● కవే గొప్ప. చిన్న కవితలో ప్రపంచ దర్శనం చెయ్యకల్గుతున్నారు. రచయిత– విస్తరణ ధీతిలో – అగుతున్నారేగాని లేకపోతే– అనంతంగా రచన సాగించ కలడనిపిస్తుందినాడు. రచయితలే ఎక్కువగా వున్నారీనాడు.

**శాంతిబాల మండపేట**

★ జీవితంలో రాజీపడడం, ఓడిపోవడం మనిషికి తప్పదంటారా?

● మనిషి కాస్త శాంతి యుతంగా, కుదురుగా బ్రతకడానికి కాస్త రాజీతత్వం, కాస్త ఓడిపోవడం తప్పదు–ముఖ్యంగా సంసార జీవితంలో. అందుకే ఆదర్శాలు బలంగానూ చేతలు వాస్తవికతకు దగ్గరగానూ వుండాలని నేను అనుకుంటాను. భార్య భర్తలు– మల్లెపూల కోసం, తెల్ల చీర కోసం దెబ్బలాడు కోడంలో సుఖం వుంది. కాని డబ్బు కోసం, అధిపత్యం కోసం కొట్లాడు కోడంలో కష్టం వుంది! రాజీపడడం అంటే – తంజావూరు బొమ్మ లాగా తలూపడం కాదు. ఓడి పోవడం అంటే కుతూహలం చంపు కోడం కాదు. జీవితాన్ని జీవితంగా అర్థం చేసుకుని– ఎక్కడి క్కడ అవసరమైతే సర్దుబాట్లు చేసుకుంటూ సాగడం – గెలుపే.

**ఎం. ఎస్. ఎన్. అన్నవరం**

★ ఈరోజుల్లో ప్రతి మనిషి ఎదుటివాడిని ఏదో విధంగా దోచేద్దామనే చూస్తున్నాడు. ఎందుకంటారు?

● బ్రతకడం కోసం!

★ వందమంది బంధువులకన్నా ఒక్క మంచి స్నేహితుడు వుంటే చాలంటాను. మీరేమంటారు.

● నిజం. కాని ఆ ఒక్క స్నేహితుడు దొరకడం ఎంత కష్టమో తెలుసా?!

**టి. ఎన్. ఆర్. మండ్యం**

★ ప్రస్తుత చిత్ర పరిశ్రమపై మీ అభిప్రాయం?

● మనకి తగినట్టే వుంది?!

**ఎమ్. ఎమ్. పాల్వంచ**

★ ఆడవారు మగవారికి బానిసలు కావడానికి మొదటి కారణం.

● మన మనుధర్మ శాస్త్రం, మన సంప్రదాయం. మన పూర్వీకులు– ఒకటేమిటి? కర్నుడి చావుకిలా కారణాలనేకం!

**కె. కె. లక్ష్మీదేవి పల్లి**

★ పత్రిక ద్వారా ఏదైనా పత్రిక శీర్షిక గురించి మిమ్ము ప్రశ్నించవచ్చా?

● ఇతర పత్రికల శీర్షికల గురించి – నేను రాయను!

★ ఇతర పత్రికలలాగా కాలాన్నిపట్టి పత్రిక స్వరూప స్వభావాలను మార్చకూడదా?

● పత్రికలు మరీ గాలికోడిగా వుండకూడదు. జర్నలిజానికి – నైతిక బాధ్యత వుంటుంది మరీ మూక బధిరాంధ ప్రేక్షకులు కారు – పత్రికలు చదివే వాళ్ళు డబ్బే ప్రధానమనుకుంటే అది పత్రికలు పెట్టి సంపాదించాలని రూలులేదు? ఏ వ్యాపారం చేసినా సంపాదించవచ్చు కొన్ని లక్ష్యాలతో పనిచేసేవాళ్ళు ఒక నైతిక పరిధి ఏర్పరచుకొని – పత్రికలు నడపాలనుకోవడం – మీకెందుకు – ఎంతగా వుండాలో నాకర్థంకాదు 'స్వంత బాజా' జర్నలిస్టిక్ ఎథిక్స్‌కాదు హిందూ ఎడిటరు బొమ్మ వారి పేపర్లో చూశారా? అమృత బజార్ పత్రికలో వారి స్వంత బాజా విన్నారా? ఎక్స్‌ప్రెస్, ఆంధ్రపత్రిక, ఆంధ్రజ్యోతివంటి కొన్ని పత్రికలు – తెలుగులో జర్నలిజానికి వరవడి దిద్దినవి వాటిని అనుసరిస్తే తప్పుగాదుగాని అవీ నేటి అధునాతన పోకడలు ఎందుకుపోవని అడగడం – దారుణం అనుకుంటాను నేను.

**బి. కె. ఆర్. సోంపేట**

★ మీ దృష్టిలో కులం అన్న పదానికి నిర్వచనం?

● 'లేనిది' అని నేను అర్థం చెప్పుకుంటాను. ఇప్పటిదాక నెనెవరినీ మీ కులమేమిటి? అని అడిగిన జ్ఞాపకం లేదు – నాకు

★ నేడు విలపించే సంస్కృతి అనే పదానికి అర్థం?

● నేటి జీవన పోకడకు నిర్వచనంగా చెప్తున్నపదం అంతేగాని – మనకుండవలసిన సంస్కృతికి – కొలబద్ద కానే కాదు.

★ మేధావి అంటే ఎవరికి వర్తిస్తుంది?

● ఒక్క బుర్రతో నే పనిచేసేవారికి! హృదయంతో కూడ ఆలోచించడం బలహీనత అనుకునే వారే మేధావులు!

**బి. వి. డి. డి. అరసవల్లి**

★ తెలుగుభాష ఉచ్చారణ కూడా సరిగా తెలియని కొందరు సినీ నటీమణులు సీరియల్స్ రాస్తున్నామంటూ పబ్లిసిటీ ఇచ్చుకొంటున్నారు పాఠకులు విచక్షణ లేని వారనా వారి భావన?

● అంతే కదా మరి! లేకపోతే – ఉత్ప్రేక్షలతో ఉత్తరాలు కురిపిస్తారా? పబ్లిసిటీ యిచ్చుకుంటున్నారేగాని – మేమే రాస్తున్నాం అనడం లేదుకదా! ఎవరో రాసింది – చదివించుకునే వ్యవధికూడా లేనివారు – వాళ్ళు నమ్మితే నమ్మండి లేకపోతే లేదు

**ఎ. సిహెచ్. ఎమ్., రామకృష్ణాపురం**

★ ఆడది పసుపుతాడు కోల్పోతే?

● ఆమెని సాంఘికంగా దూరం చేయనక్కరలేదు

★ మీరు ఏమైనా కథలు రాశారా?

● ఆ!

**ఎ. వి. ఎస్. ఆర్. తొంతూరు**

★ కలం పట్టడంలో ఉన్న గౌరవం హలం పట్టడంలో కూడా వుండంటాను.

● ఎవరు లేదంటారు? హలం పట్టిన కోట్లాది జనమే కలం పట్టే పది పరకా ఉనికికి ఆధారం

★ ప్రశ్నావళిలో ఎన్నేళ్ళ నుంచి సమాధానాలు యిస్తున్నారు?

● జ్ఞాపకం లేదు. నాకు వెనక్కి చూడడం అలవాటు లేదు! □






# మామయ్యా! నన్ను మన్నించు.



పులిచెర్ల సాంబశివరావు

ఉన్న బాధలకు తోడు ఇప్పుడో కొత్త బాధ సిద్ధమైంది వెంకటాచార్యులకు.

పంటి నొప్పి.

మూడు రోజులనుంచి వెంకటాచార్యులకు కంటిమీద కునుకు లేదు దవడంతా జివజివ లాడుతూంది. పోయిన పళ్ళు పోగా ఉన్న పళ్ళు ప్రాణాలు తీసేస్తున్నాయి. అసలే రిటయిర్లై తానేడుస్తుంటే ఇప్పుడు అదనంగా ఇది మరో ఏడుపు.

వేమన్న కంటి బాధ. కాలి బాధలను గూర్చి చెప్పాడేగాని. పంటి బాధనుగూర్చి పట్టించుకోలేదు. నిజానికి పంటి నొప్పిని మించిన నొప్పి ప్రపంచంలో లేదని వెంకటాచార్యులకు ఆ క్షణంలో అనిపించింది.

"అమ్మా!" పెద్దగా మూలిగాడు.

దూరంగా తాలూకా జైల్లో రాత్రి రెండు గంటలసమయాన్ని సూచిస్తూ తంగు తంగు అని కొట్టారు.

"ఏమండి! ఇంకా నిద్రపోలేదా?" భార్య సగం నిద్రలో ప్రశ్నించింది.

వెంకటాచార్యులు భార్యకు బదులు చెప్పకుండా "అయ్యా!" అని మూలిగాడు. ఆయనకి కక్షగావుంది. ఎవరిమీదో, ఎందుకో ఆయనకే తెలియని కక్ష అది. పళ్ళు నూరదామంటే వీల్లేకుండా ఉంది.

పన్ను పీకిద్దామా? పాతిక రూపాయలు కావాలి! మిగతావాటిలాగే ఇదీ రెండు మూడు రోజుల్లో ఊడిపోక తప్పదు అప్పటిదాకా బాధ అనుభవించక తప్పదు.

గురక వినపడింది. వెంకటాచార్యులు భార్య వైపు చూచాడు.

పాపం! ఈ నిద్రే తన యిల్లాలికి మిగిలిన సుఖం!

"అమ్మా!"

తెలియకుండానే వెంకటాచార్యుల నోటినుండి బాధతో గూడిన మూలుగు వెలువడింది.

అమ్మ గుర్తుకు వచ్చింది.

అమ్మ తనకోసం ఎన్ని తిప్పలు పడింది. తండ్రి శ్రీరంగ యాత్రకు పోయి అక్కడనుండి అటే సన్యాసుల్తో కలిసి వెళ్ళిపోయాడు తాను చదువు సంధ్యలు లేక అల్లరిచిల్లరి కుర్రాళ్ళతో కలిసి బాధ్యతలేకుండా తిరుగుతూవుంటే, తల్లి నాలుగిళ్ళలో వంటపని చేసి తనను పోషించింది.

"అమ్మా!"

వెంకటాచార్యులు వేలుతో పంటి చిగురు ఒత్తుకున్నాడు. రక్తం వచ్చింది.

కళ్ళల్లో తల్లి మెదిలింది కన్నీళ్ళు బొటబొట రాలాయి

"అన్నయ్యా! వీణ్ణి నీ చేతుల్లో పెడుతున్నాను. తల్లయినా, తండ్రయినా యిక నీవే!" అని అమ్మ తనను మేనమామకు అప్పగించి కళ్ళు మూసింది

మేనమామ రూపం వెంకటాచార్యుల ఎదుట ప్రత్యక్షమైంది వెంకటాచార్యులు రెండు చేతులూఎత్తి నమస్కరించాడు.

నిజంగా ఆ క్షణంలో మామయ్యే ఆదుకొనక పోతే తనగతి ఏమయ్యేది? చెల్లెలికిచ్చిన మాటకోసం తన

విద్యలను పస్తు పడుకోబెట్టి తన కడుపు నింపేవాడు. విద్యాబుద్ధులు చెప్పించి, వాళ్ళకాళ్ళూ, వీళ్ళకాళ్ళు పట్టుకొని జిల్లాపరిషత్తు హైస్కూల్లో తెలుగు మాష్టరు ఉద్యోగం వేయించాడు కూతురిని ఇచ్చి పెండ్లి చేసి తన నొకయింటివాణ్ణి చేశాడు!

మామయ్యా! నీ ఋణం జన్మజన్మలకూ తీర్చుకో లేను! అప్రయత్నంగా వెంకటాచార్యుల నోటి వెంట ఈ మాటలు వెలువడ్డాయి

అరే! వెంకటూ! మనకు మిగిలిన ఆస్తి ఆ పుస్తకాలేరా! బాగా చదువుకొని గొప్ప పండితుడవై మన వంశానికి పేరు ప్రతిష్ఠలు తేరా! చూడూ! నువ్వు నేర్చిన విద్యను నమ్ముకో! అమ్ముకోవద్దు!

అని మేనమామ పలికిన తుది పలుకులు తన హృదయంలో గాఢంగా నాటుకున్నాయి

నాటినుండి దీక్ష వహించాడు మామయ్య సేకరించి యిచ్చిన పుస్తకాల నన్నిటినీ ఆమూలాగ్రంగా పఠించాడు ఉద్యోగం కోసం తాను చదివిన చదువు అసలు చదువే కాదని గ్రహించాడు సమకాలీన పండితుల్లో గట్టివాడనే పేరు సంపాదించాడు

వెంకటాచార్యుల మొఖంలో గర్వరేఖ తొంగిచూచింది

తాను మేనమామకు ఇచ్చిన మాట నిలుపుకున్నాడు విద్యను నమ్ముకున్నాడే గాని, అమ్ముకోలేదు అమ్ముకుంటే ఎంతో సంపాదించి ఉండేవాడు

# మామయ్యా! నన్ను మన్నించు!

నలభయేళ్ళు తెలుగు పంతులుగా పని చేసి తాను సంపాదించిన దేముంది? ఈ చిన్న పెంకుటిల్లు తప్ప! రిటైరయిం తరవాతగాని తనకు లోక రీతి బోధపడలేదు చాలీ చాలని పెన్షన్ డబ్బులతో ఇల్లు గడవడం కష్టంగా ఉంది పెద్దమ్మాయి బి ఏ బి ఇడి నూతన రిజర్వేషన్స్ విదానం వలన ఉద్యోగం దొరక లేదు చిన్నమ్మాయి మెడికల్ ఎంట్రన్స్ వ్రాసింది తనకంటే మూడు రెట్లు తక్కువ మార్కులు వచ్చిన అమ్మాయికి మెడికల్ కాలేజీలో సీటు వచ్చింది తనకు రాలేదు రిజర్వేషన్స్ ఇందుకు కారమణమని తెలిసి ఆ పిల్ల కుమిలిపోతోంది

ఆడపిల్లలకు పెళ్ళి చేద్దామంటే చేతిలో నిల్వ పైసా లేదు వయసులో ఉన్నప్పుడు కూడబెట్టలేక పోవడమే తాను చేసిన పెద్ద తప్పు

వర్షా కాలమైన నాలుగు మాసాలకు కావలసిన సామగ్రిని మిగతా ఎనిమిది మాసాల్లోనూ, రాత్రికి పగటియందును, ముసలితనంలో ఇబ్బందులు కలక్కుండా వయస్సులో ఉన్నప్పుడూ సంపా దించుకోవాలని పెద్దలు ఊరికే చెప్పలేదు

'వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్నిశార్థ మర్థం దివసే యతేత, వార్ధక్య హేతోర్వయసానవేన పరత్ర హేతో రిహ జన్మ నాచ

వెంకటాచార్యులు నోటి వెంట అప్రయత్నంగా ఈ శ్లోకం వెలువడింది చిన్న కూతురు అప్పుడే నిద్రలేచి, గదులు శుభ్రం చేసి, అంటు పాత్రలు జాలారిబండ దగ్గరకు చేరుస్తూ ఈ శ్లోకం విన్నది

"నాన్నా! వినియు, నెలల్పతుర్వయిని వృష్టిదినాళికి అనే పద్యం ఆముక్తమాల్యదలో ఉంది గదా! ఈ శ్లోకభావమేనా అది?'

వెంకటాచార్యులు కుమార్తె జ్ఞాపక శక్తికి ఆశ్చర్య పోయాడు. తానెప్పుడో ఏదో సభలో ఈ పద్యం చదువుతుండగా ఈ అమ్మాయి విన్నట్లున్నది ఈ పిల్ల అంతా నాయనమ్మ పోలిక ఆమెకూ ఇంతే! భాగవతంలో ఘట్టాలు ఘట్టాలే నోటికి వచ్చు తనకూ అంతే! బహుశా వంశాను గతంగా వచ్చిన శక్తి కావచ్చు

" రాత్రికై దివంబున జరకై వయస్సున ." అని రాగం తీస్తూ ఆ అమ్మాయి పాత్రలు తోముతోంది

వేలకొలది పద్యాలు తనకు వచ్చును!

ఏమిటి లాభం?

నిన్న పెద్దమ్మాయి వచ్చి తనకు చెప్పుల కంపెనీలో ఉద్యోగం వచ్చిందనీ, మూడు వేలు డిపాజిట్టు కడితేగాని ఆ ఉద్యోగం ఇవ్వరనీ చెప్పినప్పుడు ఈ పాండిత్యమూ, ధారణాశక్తీ ఎందుకైనా ఉపయోగ పడ్డాయా ?

రాత్రంతా జాగరణ చేయడం వలన తెల్లవారు జామున వెంకటాచార్యులను మగతతో కూడిన నిద్ర ఆవహించింది


## సాంకేతిక విజ్ఞాన గ్రంథములు

| | |
|---|---|
| ట్రాన్సిస్టర్ రేడియో | వెల రూ. 5.75 |
| ట్రాన్సిస్టర్ రిపేరింగ్ | వెల రూ. 5.75 |
| హౌస్ వైరింగ్ | వెల రూ. 8 50 |
| మోటార్ రీవైండింగ్ Part I | వెల రూ. 11.50 |
| మోటార్ రీవైండింగ్ Part II | వెల రూ. 12.75 |
| T.V మెకానిజం | వెల రూ. 15.00 |
| టేప్ రికార్డర్ | వెల రూ. 8.75 |
| మోటార్ మెకానిజం | వెల రూ. 8 75 |
| రెఫ్రిజిరేటర్ & ఏర్‌కండిషన్ | వెల రూ. 8 75 |

| | |
|---|---|
| మోడరన్ ఫోటోగ్రఫి | వెల రూ. 18 50 |
| లేత్‌వర్క్స్ | వెల రూ 6.75 |
| గ్యాస్ & ఆర్క్ వెల్డింగ్ | వెల రూ. 7 50 |
| మెటల్ & షీట్‌మెటల్ | వెల రూ. 6.25 |
| మోడరన్ టైలరింగ్-పురుషులు | వెల రూ. 10.50 |
| మోడరన్ టైలరింగ్-స్త్రీలు | వెల రూ. 9.50 |
| మోడరన్ టైలరింగ్-పిల్లలు | వెల రూ. 9 50 |
| కరాటే | వెల రూ. 14.75 |
| వీరకళ కుంగ్‌ఫూ | వెల రూ. 12 00 |
| వశీకరణము | వెల రూ. 9.50 |

ఆధునిక గొప్ప పరిశ్రమలను గూర్చి స్వచ్ఛ తెలుగులో చదివి ఆయా పరికరాలను గూర్చి, అవి చెడిపోవుటకు తగు కారణాలు, వాటిని నివారించు మార్గాలు, చిరకాలము ఉపకరణాలుగా పనిచేయుటకు తగిన ఉపాయాలు, చెడిన భాగాలను తీసివేసి రిపేరు చేయుట, క్రొత్తది బిగించుట ఎట్లు అన్న వివరాలన్నింటిని తగు పటాలతో వివరించు పారిశ్రామిక గ్రంథాలు. ఇవి టెకినికల్ కోర్సు చదివే వారికి ఉపయోగపడు గొప్ప గ్రంథములు. పుస్తకమును కోరువారు పుస్తకము వెలతో రూ. 3.50 చేర్చి M O పంపండి. వివరములకు : బాలాజీ పబ్లికేషన్స్,103 పైక్రాఫ్ట్స్ రోడ్డు, మద్రాసు-14




BALAJI PUBLICATIONS
103, PYCROFTS ROAD MADRAS-600 014

'వెంకటాచార్యులు గారూ!' బయట నుండి ఎవరో గట్టిగా కేక వేశారు ఆచార్యులు ఉలిక్కి పడి నిద్ర లేచాడు టైం తొమ్మిదయింది ఆలస్యంగా నిద్ర లేచినందుకు సిగ్గు పడుతూ వాకిట్లోకి వచ్చాడు ఎదురుగా బాల్యమిత్రుడు సత్యనారాయణశాస్త్రి కుశల ప్రశ్నలయ్యాయి చివరకు, వచ్చిన విషయం చెప్పాడు శాస్త్రి

మన పట్టణంలో యాభై యేళ్ల తరవాత శతావధానం జరగబోతోంది ఎప్పుడో ఈ వూళ్లో శివరామశాస్త్రి గారు శతావధానం చేశారట అది చూచిన వాళ్లెవరూ ఇప్పుడు లేరు మన సాహితీ సమితి వారు రామదాసు అనే యువకుని చేత శతావధానం చేయించబోతున్నారు అప్పుడే యాభైవేల రూపాయలు పోగు చేశారు కూడా! లక్ష రూపాయలవుతుందని అంచనా! వంద మంది. పృచ్ఛకులు కావాలి ప్రతి పృచ్ఛకుడికీ నూట పదహార్లిస్తారు మీరూ పృచ్ఛకుడుగా రావాలి!

అవధానంలో ప్రశ్న లడిగే వారిని పృచ్ఛకు లంటారు నూరు మంది నూరు సమస్య లిస్తారు వాళ్లడిగిన సమస్యలను వరసగా పూర్తి చేసి, చివరలో ఎవరి పద్యం వారికి అప్పజెప్పాలి ప్రపంచంలో ఒక్క తెలుగులో నే ఈ ప్రక్రియ ఉంది

'.. ఈ పంటి నొప్పితో తానెందుకు వెళ్లటం? అనవసరం ' అబ్బే! వెళ్ళకపోతే ఎలా? నూట పదహార్లో! ఎలాగో సమస్య నడిగి కళ్ళు మూసుక్కూర్చుంటే సరి నూటపదహార్లు వస్తాయి పన్ను పీకించడానికి పనికి వస్తాయి' ఆచార్యులు నిర్ణయానికి వచ్చాడు

పెద్దమ్మాయి కాఫీ తెచ్చింది శాస్త్రి కాఫీ అందుకుంటూ అమ్మాయికి ఉద్యోగమేదైనా ? అన్నాడు

"ఆ! మొన్ననేదో చెప్పుల కంపెనీలో ఓ చిన్న ఉద్యోగం సంపాదించింది అయితే మూడు వేలు డిపాజిట్ కడితే గాని ఆ ఉద్యోగం ఇవ్వరట!'

తన నెక్కడ ఆచార్యులు అప్పు అడుగుతాడో అనుకున్నాడేమో శాస్త్రి సెలవు తీసుకొని వెళ్లిపోయాడు

శతావధానం చూడటానికి జనం తండోప తండాలుగా వచ్చారు తామొక చారిత్రాత్మక ఘట్టాన్ని చూడబోతున్న సంతోషం వాళ్ల ముఖాల్లో కనబడుతోంది

సాహితీ సమితి అధ్యక్షుడు డాక్టర్ ఆంజనేయ ప్రసాద్ ముఖాన మాత్రం నెత్తురు చుక్కలేదు

తాను అనారోగ్య సమంచితుదవటం వలన రాలేనని అవధాని నుంచి అప్పుడే ఆయనకు టెలిగ్రాం అందింది డాక్టర్ గారికి గుండె ఆగినంత పనైంది పృచ్ఛకులంతా నూటపదహార్లు పోతాయేమోనని దిగులు పడి కూర్చున్నారు ఆరు దాటినా అవధానం ప్రారంభం కానందుకు కారణం తెలియక ప్రేక్షకులు గొడవ చేస్తున్నారు.

ఈ యేర్పాట్లకి ఇప్పటికే పది వేలు ఖర్చయింది ఇప్పుడు శతావధానం ఆగితే అంతా దండగో ఇదిగాక ఊళ్లో మిగిలిన సాంస్కృతిక సంస్థలు తనను చులకనగా చూస్తాయి ఎంత అవమానం! డాక్టర్‌కి ఏదు పాలుపోటే తక్కువ

ఈ దశలో వెంకటాచార్యులు ఒక సాహసోపేతమైన నిర్ణయం తీసుకున్నాడు తన నిశ్చయాన్ని ఆచార్యులుశాస్త్రి చెవిలో ఊదాడు శాస్త్రి డాక్టర్‌తో ఆ విషయాన్ని చెప్పాడు డాక్టర్ ఆశ్చర్య పడ్డాడు ఆనంద పడ్డాడు

"పాపం! ఆయన చాలా ఇబ్బందుల్లో ఉన్నాడు మూడు వేలిస్తే చాలట!' శాస్త్రి అన్నాడు

"మూడు వేలు కాకపోతే ముప్ఫయ్ వేలిస్తాం! ఏదీ ఆయన?"

శాస్త్రి వెంకటాచార్యులను తీసుకొని వచ్చాడు

సన్నగా, ఎత్తుగా, నల్లగా, ఉతికిన ఖద్దరు బట్టలు కట్టుకొని ఉన్న వెంకటాచార్యులను చూచి డాక్టర్ ముఖం ముడుచుకు పోయింది ఆచార్యుల పాండిత్యాన్నీ ప్రతిభనూ శాస్త్రి వర్ణించి చెప్పిన తరువాత, దేవుడు మీద భారం వేసి డాక్టర్




అయిష్టంగానే అంగికరించాడు

అనివార్య కారణాల వలన అవధానిని మార్చవలసి వచ్చిందని సంస్థ కార్యదర్శి మైకులో ప్రకటించి, ప్రేక్షకులను నిశ్శబ్దంగా ఆసీను లవవలసిందిగా కోరాడు

స్టేజి మధ్యలో ఆచార్యుల వారి ఆసనం ఉన్నది చుట్టూ నూరుగురు పృచ్ఛకులు పరివేష్టించి ఉన్నారు వాళ్లంతా అవధాని 'సత్తా'ను పరీక్షించడానికి కష్టపడి అనేక కొత్త కొత్త సమస్యలను తయారు చేసుకొని వచ్చారు

ప్రేక్షకులంతా వెంకటాచార్యుల వైపు అనుమానంగా చూస్తున్నారు వీడు శతావధానం చేయగలడా అనే భావాన్ని వాళ్ల కళ్ళు చెప్పకనే చెబుతున్నాయి

ఆచార్యులు సభవైపు దృష్టి సారించాడు. ఇంతకంటె పెద్ద సభల్లో గూడా తాను ఉపన్యసించాడు అవి వేరు అక్కడ తాను చెప్పిందే వేదం. ఇక్కడ అలాకాదు. పృచ్ఛకులు అడిగిన సమస్యను గుర్తుంచుకొని, అందమైన పద్యం చెప్పాలి పొరపాటువస్తే పరువు పోతుంది

పంటి చిగురు జివ్వున లాగింది ఆ బాధకు కళ్లలో నీళ్ళు తిరిగాయి కళ్ళు, కళ్లజోడూ తుడుచుకొని ప్రేక్షకుల వైపు చూశాడు ఎదురుగా చిన్నమ్మాయి కూర్చొని ఉంది

అచ్చు నాయనమ్మ పోలికే ఆ పిల్ల! ఆచార్యులకు తల్లి గుర్తుకు వచ్చింది ఒక దివ్య కవితావేశం ఆయనను ఆవహించింది పెదవులు కదిలాయి కమ్మని కంఠం స్వీకర్ణలోంచి శ్రుతిహితంగా వినబడేసరికి సభలో నిశ్శబ్దం తాండవించింది

వెంకటాచార్యులు మొట్ట మొదటగా తల్లిని స్తుతిస్తూ ఒక ఉత్పలమాలను ఆశువుగా చెప్పాడు. ఆర్ద్రమైన ఆ భావం ప్రేక్షకుల హృదయాలను తాకింది

ఆచార్యులు కలియుగేశుడైన వేంకటేశునిపై ఒక భక్తి రసాత్మకమైన పద్యాన్ని ఆశువుగా పఠించగానే, ప్రేక్షకులంతా వెంకటేశుని సన్నిధానాన్ని పొందినట్లుగా అరమోడ్పు కన్నులతో ఆ పద్యాన్ని ఆలించారు

ఎదురుగా ప్రేక్షకుల్లో ముందు సీట్లో కూర్చున్న కరుణశ్రీగారి మీద ఓ ఆటవెలది తుమ్మలవారిమీద ఓ తేటగీతి.. !

అవధానం ప్రారంభమైంది. పృచ్ఛకులు ఒక్కొక్కళ్ళు లేచి తమ సమస్యలను ఇస్తున్నారు కొన్ని చమత్కారంగా ఉన్నాయి. కొన్ని అసహ్యంగా ఉన్నాయి కొన్ని దుష్కరప్రాసలు . . వెంకటాచార్యులు అన్ని సమస్యలనూ చిరునవ్వుతో స్వీకరిస్తున్నాడు అడిగిన వారికి వెంటనే ఒకపాదం చెప్పి తరువాత సమస్యకు వెళుతున్నాడు

సమస్యకూ సమస్యకూ మధ్యలో పంటి నొప్పి గుర్తుకు వస్తోంది పెద్దమ్మాయి ఉద్యోగం గుర్తుకు వస్తోంది చిన్నమ్మాయి భవిష్యత్తు మదిలో మెదులుతోంది భార్య... తల్లి... మేనమామ సకాలానికి రాని పెన్షను. .

రిజర్వేషను సమస్య. పాలదాని గోల.. అప్పు ఒప్పుకోని కిరాణాకొట్టు సెట్టి...!

ఓహ్! ఎన్ని సమస్యలు!!

ఆ సమస్యల ముందు ఈ పృచ్ఛకులు అడిగే సమస్యలు ఓ లెక్కా? అలవోకగా ఈ సమస్యలను తాను పరిష్కరించ గలడు నన్నయ తిక్కనాది మహాకవుల రచనలను పెద్దల దగ్గర పఠించిన పాండిత్యం తనకుంది! వంశపారం పర్యంగా తనలో జీర్ణమై ఉన్న ప్రతిభ తనకున్నది! స్వయం కృషితో తెలుసుకున్న సాహిత్య రహస్యా లెన్నో రసనాగ్రంపై నాట్యం చేస్తున్నాయి!

చివరి సమస్య వచ్చింది "రాముడు రామునిన్ గెలిచి రాజిల రాముని మెచ్చె రామునిన్" అని సమస్య ఇచ్చి పృచ్ఛకుడు కూర్చున్నాడు

ఎంత అందమైన సమస్య!

వెంకటాచార్యులు తన యెదుట సీతారామ కళ్యాణాన్ని సాక్షాత్కరింప జేసుకున్నాడు పద్యం పలికింది

'భూమి సుతా కరగ్రహణబోగ శుభమ్ముగడించుకొన్నశ్రీ"

ఆనాటి శతావధాన కార్యక్రమం పూర్తయింది కరతాళ ధ్వనులతో హాలు దద్దరిల్లింది

ఆచార్యులు ఆ రాత్రంతా ఒక దివ్య సమాధిలో గడిపాడు. అది నిద్రావస్థో. జాగ్రదావస్థో తెలియకుండానే తెల్లవారింది ఆచార్యులు ఆ రోజు ఇంట్లో ఎవరితోనూ ఉలకలేదు. పలకలేదు

## మనిషి – కోతి

మనిషి కోతి నుండి పుట్టాడని
డార్విన్ చెప్పింది పరమ సత్యం
కాదామరి తనే రుజావు
చేసుకొంటున్నప్పుడు ప్రతి నిత్యం

– ఆమ్రపాలి

## మామయ్యా! నన్ను మన్నించు!

సాయంత్రం అయిదు గంటలకు డాక్టర్ ఆంజనేయ ప్రసాద్ స్వయంగా కారు తెచ్చి ఆచార్యులను ఎక్కించుకొని సభాస్థలికి చేరుకున్నాడు ఇవేళ మరింత మంది జనం వచ్చారు

పృచ్ఛకులను ఒక్కొక్కళ్ళను చూచి, వాళ్ళు నిన్న ఇచ్చిన సమస్యలను తానే గుర్తు చేస్తూ, ఇంతకు ముందు తాను చెప్పిన పద్య పాదాన్ని ఆలపించి, రెండవ పాదాన్ని కొత్తగా చెబుతూ శతావధానాన్ని ఆచార్యులు కొనసాగించాడు

"నిన్న- భూమి సుతాకరగ్రహణ బోగ శుభమ్ముగడించుకొన్నశ్రీ అనిచెప్పాను గదా! రెండవ పాదం- రాముని గాది పట్టియగు రాముని శిష్యుని జేరి శంకర' అని ఆచార్యులు అలవోకగా నూరవ సమస్యకు రెండవ పాదాన్ని పూర్తి చేయగానే ప్రేక్షకులు సంభ్రమాశ్చర్యలతో కరతాళధ్వనులు చేశారు

మూడవ రోజే శతావధానం సంపూర్తి అయే రోజు జిల్లా కలెక్టరు, మున్సిపలు చైర్మను, యస్పీ, జిల్లా జడ్జీ, స్థానిక యం యల్ ఏ మొదలైన పురప్రముఖులంతా విశేష ఆసక్తితో విచ్చేశారు

వెంకటాచార్యుల సతీమణి ఎన్నడూ ఒక సభకో, ఒక సినిమాకో పోయి ఎరుగదు చిన్నమ్మాయి గొడవపడలేక భర్త చేసే శతావధానాన్ని చూడటానికి ఆ రోజు రాకతప్పలేదు అక్కా చెల్లెళ్ళు తల్లికి చెరి ఒకపక్క కూర్చొని ఉన్నారు

వెంకటాచార్యుల దవడ వాచి వుంది ఆయన ఆలోచన పంటినొప్పి వైపు మరలింది

ఇంకకొన్ని గంటలాగితే చాలు ఈ పన్ను పీకించుకోవచ్చు ఆపైన హాయిగా నిద్రపోవచ్చు

మూడు వేలు!

అమ్మాయికి ఉద్యోగం వస్తుంది

చిన్నపిల్లను కాలేజీలో చేర్పించాలి

ఎలాగో అలాగా పెన్షను డబ్బులతో, పెద్ద పిల్లకు రాబోయే జీతంతో సంసారం గడుస్తుంది

వెంకటాచార్యులు పెళ్ళాం బిడ్డల వైపు చూస్తూ


ఆంధ్ర సచిత్ర వారపత్రిక
(స్థాపితం : 1908)
గాంధీనగరం : : విజయవాడ – 3

ఇంట్లో అందరికీ ఆనందాన్ని ఇచ్చే శీర్షికలు! కథలు!! వ్యాసాలు!!!

* సాహిత్య విలువలున్న సీరియల్ కథలు
* వైవిధ్యం వున్న కథానికలు
* అన్ని తరాలవారినీ అలరించే "ప్రశ్నావళి" "ధర్మపథం" న్యూఢిల్లీ లేఖ

ఇంకా ఎన్నో ఆకర్షణలతో ఏ వారానికా వారమే కొత్తదనాన్ని పుణికి పుచ్చుకుని మీకు అందుతుంది.

విడి ప్రతి వెల రు. 2-75

సంవత్సరచందా (పోస్టుద్వారా) రు. 156-00పై.

ఆరు మాసాలకు (పోస్టుద్వారా) రు. 78-00పై.

మీ స్థానిక ఏజెంటుద్వారా తెప్పించుకుంటే ప్రతివారం తెల్లారేసరికల్లా మీముందు వుంటుంది.

రచనలు పంపే చిరునామా :
సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక,
గాంధీనగరం, విజయవాడ-520 003

ఇతర వివరాలకు :
బిజినెస్ మేనేజర్, ఆంధ్రపత్రిక,
గాంధీనగరం, విజయవాడ-520 003

అవధానం ప్రారంభించాడు

ఆయన చూపుల్లోని అంతరార్థం గ్రహించిన ఆ యిల్లాలు కన్నులు ఆర్ద్రమైనాయి

పిల్లలిద్దరూ తండ్రిగారి వీర విహారాన్ని పరమానందంతో తదేకంగా తిలకిస్తున్నారు

మెదడులో ఎన్ని ముడత లున్నాయో ఎన్ని నరాలున్నాయో ఎన్ని కణా లున్నాయో అవి యెంత అద్భుతమైనవో! కంప్యూటర్‌ని మించిన జ్ఞాపకశక్తి. కల్పనా శక్తి.! వెంకటాచార్యుల అవధాన ప్రతిభాతిశయాన్ని చూచి ప్రేక్షకులు పులకిత గాత్రులవుతున్నారు

వెంకటాచార్యుల మెదడులో –

ఒకచోట పంటినొప్పి.

వేరొకచోట మూడు వేలు

ఒకప్రక్క పెద్దకూతురు ఉద్యోగం

ఇంకోప్రక్క చిన్నకూతురు చదువు

ఆ వైపు కూతుళ్ల పెళ్లిళ్ళు

ఈ వైపు పెద్దలను గూర్చిన జ్ఞాపకాలు.

మేనమామకు తానిచ్చిన మాట ..

మొత్తం ఎన్నో ఎన్నెన్నో భావాలు .. మదిలో సుడులు తిరుగుతూ ఉండగా వెంకటాచార్యులు శతావధానం నిర్వహిస్తూ ఉన్నాడు.

ప్రతి పృచ్ఛకుడూ వెంకటాచార్యులు చెప్పే మూడవ పాదాన్ని విని సంతృప్తితో ఆమోదిస్తున్నాడు.

నూరవ సమస్య వచ్చింది.

భూమి సుతాకర గ్రహణ భోగశుభమ్ము
గడించుకొన్న శ్రీ
రామునిన్ గాధి పట్టియగు రాముని శిష్యుని జేరి
శంకర
స్వామి ధనుస్సు ద్రుంచెనని భార్గవరాముడు
కాలు ద్రవ్వగా
రాముడు రామునిన్ గెలిచి రాజ్ఞల రాముని మెచ్చె
రామునిన్

వెంకటాచార్యులు రాగయుక్తంగా పద్యాన్ని ఆలపించాడు ప్రేక్షకులపై పూలవాన కురిసినట్లయింది హర్షధ్వానాలు మిన్ను ముట్టాయి

సాహితీసమితి అధ్యక్షుడు డాక్టర్ ఆంజనేయ ప్రసాద్ మైకు ముందుకు వచ్చాడు ఆయన ముఖంలో ఆనందం తాండవం చేస్తోంది

".. అసలు జరగదేమో అని మేమంతా ఎంతో భయపడిన ఈ శతావధాన కార్యక్రమం విచిత్ర పరిస్థితుల్లో, అత్యద్భుతంగా జరిగింది ఈ శతావధానాన్ని విజయవంతంగా నిర్వహించిన శ్రీ వెంకటాచార్యులు గారిది మనవూరే అవడం మనందరికీ గర్వ కారణం ఇటువంటి ఆణిముత్యాన్ని మన ముంగిట్లోనే పెట్టుకొని ఎక్కడెక్కడనుంచో వ్యక్తులను పిలిచి సన్మానింప జూడటం నిజంగా మన అవివేకం. శ్రీ వెంకటాచార్యులు గారికి మనం ఏమిచ్చినా తక్కువే అవుతుంది. నిజానికి వారీనాడు చేసింది శతావధానం కాదు ఆచార్యుల వారు చేసింది సహస్రావధాన

# ఇ·వేమన·పద్యాలు




శాంతమానసమున జల్లనైశీతల
భ్రాంతి నున్నవాడు పరమయోగి
యట్టివాడు ముక్తి యతివేగమున బొందు
విశ్వదాభిరామ వినురవేమ

మనవచ్చు వారు ఏ పరిస్థితుల్లో ఈ శతావదానం చేయడానికి ముందుకు వచ్చారో ఈ సభలోనే ఉన్న వారి సతీమణికి, వారి కుమార్తెలకు, సత్యనారాయణ శాస్త్రిగారికి మాత్రమే తెలుసు ఇంతకు ముందే శాస్త్రిగారు ఆచార్యుల వారి దురవస్థను గూర్చి చెప్పినప్పుడు నాకు కన్నీరు ఆగలేదు ఇటువంటి కష్ట స్థితిలో మూడువేల రూపాయలు కోరి వారు అవధానం చేయడానికి ముందుకు వచ్చారు నేను ముప్పయ్ వేలైనా ఇస్తానని మాటవరసకి అప్పుడన్నాను కానీ ఈ శతావధానం చూచిన తరువాత మన సాహితీ సమితి సభ్యుల అనుమతితో శ్రీ వేంకటాచార్యుల వారికి అరవైవేల రూపాయలు సమర్పించుకొంటున్నాము!"

డాక్టర్ ఆంజనేయ ప్రసాద్ ఆచార్యుల వారికి ఒక కవరు అందించి నమస్కరించాడు

ఆచార్యుల వారి సతీమణిని వేదిక మీదికి రావలసిందిగా ప్రార్థిస్తున్నాం!' అని మైకులో కార్యదర్శి ప్రకటించాడు పిల్లలిద్దరూ చెరివొక వైపున పట్టుకొని తల్లిని వేదిక మీదకు తెచ్చారు జిల్లా కలెక్టరు ఆ దంపతులను పుష్పమాల్యాంకృతులనుగావించి సత్కరించారు

ఆచార్యుల కన్నుల్లో నీళ్ళు నిలిచాయి ఆ కన్నీటి తెరల వెనుక ఒక చిన్న తేజోమూర్తి ప్రత్యక్షమైంది అది క్రమంగా పెరిగి పెద్దదై ఆయన మేనమామ ఆకారాన్ని దాల్చి వికటాట్టహాసం గావించింది

మామయ్యా! నన్ను మన్నించు!" అనే మాటలు ఆచార్యుల నోటి నుండి అప్రయత్నంగా వెలువడ్డాయి! □

# పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## విధివిసిరేసిన బొమ్మలు

ధనవంతుల, ఆఫీసర్ల యింటిలో పిల్లలను ఎత్తుకొని, ఆడించే పసిబాలలు- కొండలెక్కి- కట్టెలుఏరి ఊళ్లో అమ్ముతున్న బాలలు-

చిన్నారిచేతులతో రాళ్లనుకొట్టి పోగుపెట్టే అభాగ్యులు-

ఎంగిలిప్లేట్లను కడిగి, నీళ్లు మోసి, పాచిపనులు చేస్తున్న చిన్నారి బాలలు మనకు నిత్యం కన్పిస్తున్నారు ఎవరువీరు? అందరిలా నవమాసాలు మోసి కనిపెంచిన ఒక తల్లి పిల్లలే- సాటిపిల్లల్లా చక్కగా ముస్తాబయి, స్కూల్‌కి వెళ్లి చదువుకొని, ఆడంబరంగా ఉండాలన్న తమ మనసుల్లోని కోర్కెలు చంపుకున్న దీనహృదయాలు

చింపిరి జుత్తుతో, జీర్ణించిన వస్త్రాలతో, దైన్యమైన చూపులతో అర్ధాకలితో అలమటిస్తున్న ఈ పసిహృదయాలు నిత్యం కాఫీ హోటల్స్‌లో కనిపిస్తూనే ఉంటాయి తెల్లారగనే పనిలోనికి రావాలి కాఫీహోటల్‌ని ఊడ్చాలి కళ్లాపు చల్లాలి పాసింజర్స్ తిన్న ఎంగిలిప్లేట్లు, కాఫీగ్లాసులు, నీళ్ల గ్లాసులు వెంటవెంటనే కడిగి అందిస్తూ టేబుల్ క్లీన్ చేయాలి బజార్లకు వెళ్లి సామాన్లు మోసుకు రావాలి ఉల్లి పచ్చిమిర్చి వంటివి తరిగి ఉంచాలి యింతా చేస్తే రోజుకి 3 రూపాయలలోపు కూలి మిగిలి పోయిన అన్నం, కూరలు ఒక్కపూట పెడతారు రాత్రి ఏ ఎనిమిదింటికో యిల్లు చేరి ఆ కూలి డబ్బులు తలితండ్రులకిచ్చి నిద్రపోతారు వీళ్లకు రోగ మొస్తే యజమాని చూడదుకదా, ఎపుడైనా మానేస్తారేమోనని ఒకటి రెండు వారాల జీతం వాడిమీద ఉంచుకొంటాడు పెద్ద వాళ్లయితే ఆరేడు రూపాయలివ్వ వలసి వస్తుందని, ఈ పసిపిల్లలతో వెట్టి చాకిరి చేయించుకొని కర్కశంగా ప్రవర్తిస్తూ, అలసి సొలసి వారు పని మందగిస్తే వీపుపై, దవడపై యిష్టానుసారంగా కొడతారు వాతలు పెడతారు అడిగేనాధుడులేడు ఆ యజమానిపిల్లలు మాత్రం నీటుగా ఉండాలి చదువుకోవాలి. ఆ వయసు పిల్లలైనా వీరిపై జాలి దయ చూపరు బస్‌స్టాండులో బిస్కట్స్, డ్రింక్స్, చిల్లర తినుబండారాలు అమ్మే కుర్రాళ్లు రూపాయికి పది, పదిహేను పైసల కమీషన్‌కి అమ్ముతారు. ఖర్మవశాత్తు అవి క్రింద పడితే, ఆ నష్ట పరిహారం, ఆ పిల్లలే భరించాలి. ఆ సొమ్ము ముట్టచెప్పే వరకు యజమాని వెట్టిచాకిరీ చేయించి పైసా యివ్వడు ఇది నిత్యం జరుగుతున్న కథ పిల్లల విషయం పట్టించుకోలేని పరిస్థితుల ప్రభావాల కథ

ఇదిలా సాగుతే, ఈ పిల్లలు భయపకు లంతరించి, నిరక్షరాస్యులై జ్ఞానశూన్యులై జూదం, పానం, దొంగతనం, రౌడీజం వంటివి నేర్చుకొని అడ్రస్‌లేని వ్యక్తులుగా తయారయి, ఆ వాతావరణంకే మాయని మచ్చగా తయారవుతారు

ఈ వక్రమార్గానికి కారణం అందరిదీను ఒకటి తలితండ్రులు పిల్లల విషయంలో కళ్లు తెరవాలి నోరులేని పక్షులు ఎక్కడెక్కడో ఆహారాన్ని వెదికి పిల్లలకు అందించి రెక్కలొచ్చి, ఊహవచ్చేవరకు కాపాడుతున్నాయి అలాంటిది మనుషులైన తలితండ్రులు వీళ్ళని తీర్చి దిద్దగల జ్ఞాన సంపన్నత కలిగి ఉండాలి

రెండు తన పిల్లల్లాంటివారే ఆ పసిపిల్లలు అయితే వాళ్ల అంతస్తు తక్కువ అంతమాత్రాన వాళ్లని హీనంగా చూడకూడదన్న జ్ఞానం, ధనవంతులకు కలగాలి

మూడు వెట్టిచాకిరి చేయిస్తున్న హోటల్ యజమానుల ధరల పట్టికల-




పనివారి వివరములు- జీత భత్యాలు- శెలవుల వివరణ లేబర్ డిపార్ట్‌మెంట్ తెలుసుకొని మైనారిటీ తీరని యిలాంటి పిల్లలచే పనిచేయిస్తూ, తక్కువ డబ్బులిస్తూ, వాళ్ల జీతాలను దోస్తున్న కాఫీహోటల్ యజమానులను కఠినంగా శిక్షింప చేయాలి

నాలుగు అనేక పథకాలు ప్రవేశ పెడుతున్న ప్రభుత్వం, ఈ దీనబాలల సంక్షేమం చూడాలి అనాథలైపోతూ, ఆశ్రయం కరువై, ఆశలు అడుగంటి భవిష్యత్ నాశనం అవుతున్న యిటువంటి బాలలకు ఒక సంస్థ ఏర్పరచి, ఉచిత విద్య, భోజన వసతులు కల్పించి, భావి పౌరులుగా, దేశం గర్వించే వ్యక్తులుగా తయారు చేయించవలసిన ఆవశ్యకత ప్రభుత్వానికి ఎంతైనా అవసరం

పసివాళ్ల హృదయాలు దైవంతో సమానం అటువంటి పాలమనసులను విరిచేయవద్దు చిన్నతనంలో నే వాళ్ల హృదయంలో నైరాశ్యం కన్పించనీయకూడదు: వాళ్ల పెదవులపై చిరునవ్వు, వారి హృదయాలలో సంతృప్తి, వాళ్ల కన్నులలో నూతనకాంతి ఎపుడు ఈ దేశం చూస్తుందో ఆ నాడే నెహ్రూ కలలుగన్న మరో ప్రపంచం, ఇందిరమ్మ కలలుగన్న మరో ప్రపంచం, నేతాజీ కలలుకన్న కాంతివంతదేశం- మనం చూడగలుగుతాం

—టి. ఎస్. ఆనంద్,
యలమంచిలి



★ ★ ★

## ఆచరణలో ఆదర్శం చూపాలి

నేడు బాలబాలికల సమస్యను గురించి ప్రపంచ వ్యాప్తంగా ఆందోళన చెందుతున్నారు ముఖ్యంగా భారత దేశంలోని బాలల పరిస్థితి కడు దయనీయంగా ఉంది కారణం అధికశాతం పేదప్రజానీకం బాలబాలికలు వెట్టిచాకిరికి, యితర వృత్తులకు వెళ్ళుతున్నారంటే కారణం వారి పేదరికమే దానికి తోడు కుటుంబ యజమాని రాబడిలో మూడు వంతులు మద్య పానానికి ఖర్చు పెట్టటం కుటుంబపోషణ పిల్లల లేత భుజాలపై పడటం జరుగు తున్నది వారికి తిండి, బట్ట, ఉచిత నిర్బంధ విద్య, వైద్య సౌకర్యాలు, మానసిక ఉల్లాసానికి అనువైన వాతావరణం సమకూరిస్తే వాళ్ళు కూడ విద్యావంతులై ఉత్తమ పౌరులు అవుతారు భారత రాజ్యాంగంలోని ఆదేశ సూత్రాలలో బాల బాలికల సంక్షేమానికి వారి జీవితాలు పటిష్టంగా ఉండేందుకు పొందు పరచ [illegible] ఆదేశాలు నిర్దుష్టంగా, [illegible]యుతంగా అమలు పరిచే అధి[illegible] ఉండాలి మొదట [illegible] ఉంది ఈ సంక్షేమ [illegible] అమలు జరగాలి [illegible] రావలసిన రాయితీలలో ఎన్నో [illegible] తప్పకలు, లోపాలు ఉన్నాయి వాటిని సరిదిద్ది

వెంకటాచార్యులు గారూ! బయట నుండి ఎవరో గట్టిగా కేక వేశారు ఆచార్యులు ఉలిక్కి పడి నిద్ర లేచారు టైం తొమ్మిదయింది ఆలస్యంగా నిద్ర లేచినందుకు సిగ్గు పడుతూ వాకిట్లోకి వచ్చారు. ఎదురుగా బాల్యమిత్రుడు సత్యనారాయణశాస్త్రి కుశల ప్రశ్నలయ్యాయి చివరకు, వచ్చిన విషయం చెప్పాడు శాస్త్రి

"మన పట్టణంలో యాభై యేళ్ల తరవాత శతావధానం జరగబోతోంది ఎప్పుడో ఈ వూళ్లో శివరామశాస్త్రి గారు శతావధానం చేశారట అది చూచిన వాళ్లెవరూ ఇప్పుడు లేరు మన సాహితీ సమితి వారు రామదాసు అనే యువకుని చేత శతావధానం చేయించబోతున్నారు అప్పుడే యాభైవేల రూపాయలు పోగు చేశారు కూడా! లక్ష రూపాయలవుతుందని అంచనా! వంద మంది పృచ్ఛకులు కావాలి ప్రతి పృచ్ఛకుడికీ నూట పదహార్లిస్తారు మీరూ పృచ్ఛకుడుగా రావాలి!"

అవధానంలో ప్రశ్న లడిగే వారిని పృచ్ఛకు లంటారు నూరు మంది నూరు సమస్య లిస్తారు వాళ్లడిగిన సమస్యలను వరసగా పూర్తి చేసి, చివరలో ఎవరి పద్యం వారికి అప్పజెప్పాలి ప్రపంచంలో ఒక్క తెలుగులో నే ఈ ప్రక్రియ ఉంది

'. ఈ పంటి నొప్పితో తానెందుకు వెళ్లటం? అనవసరం.' అబ్బే! వెళ్ళకపోతే ఎలా? నూట పదహార్లు! ఎలాగో సమస్య నడిగి కళ్లు మూసుక్కూర్చుంటే సరి నూటపదహార్లు వస్తాయి పన్ను పీకించడానికి పనికి వస్తాయి!" ఆచార్యులు నిర్ణయానికి వచ్చారు

పెద్దమ్మాయి కాఫీ తెచ్చింది శాస్త్రి కాఫీ అందుకుంటూ 'అమ్మాయికి ఉద్యోగమేదైనా ? అన్నాడు

'ఆ! మొన్ననేదో చెప్పుల కంపెనీలో ఓ చిన్న ఉద్యోగం సంపాదించింది అయితే మూడు వేలు డిపాజిట్ కడితే గాని ఆ ఉద్యోగం ఇవ్వరట!'

తన నెక్కడ ఆచార్యులు అప్పు అడుగుతాడో అనుకున్నాడేమో శాస్త్రి సెలవు తీసుకొని వెళ్లిపోయాడు

శతావధానం చూడటానికి జనం తండోప తండాలుగా వచ్చారు తామొక చారిత్రాత్మక ఘట్టాన్ని చూడబోతున్న సంతోషం వాళ్ల ముఖాల్లో కనబడుతోంది

సాహితీ సమితి అధ్యక్షుడు డాక్టర్ ఆంజనేయ ప్రసాద్ ముఖాన మాత్రం నెత్తురు చుక్కలేదు

తాను అనారోగ్య సమంచితుడవటం వలన రాలేనని అవధాని నుంచి అప్పుడే ఆయనకు టెలిగ్రాం అందింది డాక్టర్ గారికి గుండె ఆగినంత పనైంది పృచ్ఛకులంతా నూటపదహార్లు పోతాయేమోనని దిగులు పడి కూర్చున్నారు ఆరు దాటినా అవధానం ప్రారంభం కానందుకు కారణం తెలియక ప్రేక్షకులు గొడవ చేస్తున్నారు

ఈ యేర్పాట్లకి ఇప్పటికే పది వేలు ఖర్చయింది ఇప్పుడు శతావధానం ఆగితే అంతా దండగే! ఇదిగాక ఊళ్లో మిగిలిన సాంస్కృతిక సంస్థలు తనను చులకనగా చూస్తాయి ఎంత అవమానం! డాక్టర్‌కి ఏడు పాళ్ళటే తక్కువ

ఈ దశలో వెంకటాచార్యులు ఒక సాహసోపేతమైన నిర్ణయం తీసుకున్నారు తన నిశ్చయాన్ని ఆచార్యులుశాస్త్రి చెవిలో ఊదారు శాస్త్రి డాక్టర్‌తో ఆ విషయాన్ని చెప్పారు డాక్టర్ ఆశ్చర్య పడ్డాడు ఆనంద పడ్డాడు

"పాపం! ఆయన చాలా ఇబ్బందుల్లో ఉన్నాడు మూడు వేలిస్తే చాలట' శాస్త్రి అన్నాడు

"మూడు వేలు కాకపోతే ముప్పయ్ వేలిస్తాం! ఏదీ ఆయన?"

శాస్త్రి వెంకటాచార్యులను తీసుకొని వచ్చాడు

సన్నగా, ఎత్తుగా, నల్లగా, ఉతికిన ఖద్దరు బట్టలు కట్టుకొని ఉన్న వెంకటాచార్యులను చూచి డాక్టర్ ముఖం ముడుచుకు పోయింది. ఆచార్యుల పాండిత్యాన్నీ ప్రతిభనూ శాస్త్రి వర్ణించి చెప్పిన తరువాత, దేవుడు మీద భారం వేసి డాక్టర్




అయిష్టంగానే అంగీకరించాడు

అనివార్య కారణాల వలన అవధానిని మార్చవలసి వచ్చిందని సంస్థ కార్యదర్శి మైకులో ప్రకటించి, ప్రేక్షకులను నిశ్శబ్దంగా ఆసీను లవవలసిందిగా కోరాడు

స్టేజి మధ్యలో ఆచార్యుల వారి ఆసనం ఉన్నది చుట్టూ నూరుగురు పృచ్ఛకులు పరివేష్టించి ఉన్నారు వాళ్లంతా అవధాని 'సత్తా'ను పరీక్షించడానికి కష్టపడి అనేక కొత్త కొత్త సమస్యలను తయారు చేసుకొని వచ్చారు.

ప్రేక్షకులంతా వెంకటాచార్యుల వైపు అనుమానంగా చూస్తున్నారు వీడు శతావధానం చేయగలడా అనే భావాన్ని వాళ్ల కళ్ళు చెప్పకనే చెబుతున్నాయి.

ఆచార్యులు సభవైపు దృష్టి సారించాడు. ఇంతకంటె పెద్ద సభల్లో గూడా తాను ఉపన్యసించాడు. అవి వేరు అక్కడ తాను చెప్పిందే వేదం. ఇక్కడ అలాకాదు. పృచ్ఛకులు అడిగిన సమస్యను గుర్తుంచుకొని, అందమైన పద్యం చెప్పాలి పొరపాటువస్తే పరువు పోతుంది.

పంటి చిగురు జివ్వున లాగింది. ఆ బాధకు కళ్లల్లో నీళ్లు తిరిగాయి కళ్ళు, కళ్లజోడూ తుడుచుకొని ప్రేక్షకుల వైపు చూశాడు ఎదురుగా చిన్నమ్మాయి కూర్చొని ఉంది

అచ్చు నాయనమ్మ పోలికే ఆ పిల్ల! ఆచార్యులకు తల్లి గుర్తుకు వచ్చింది ఒక దివ్య కవితావేశం ఆయనను ఆవహించింది పెదవులు కదిలాయి కమ్మని కంఠం స్వీకర్ణాలోంచి శ్రుతిహితంగా వినబడేసరికి సభలో నిశ్శబ్దం తాండవించింది.

వెంకటాచార్యులు మొట్ట మొదటగా తల్లిని స్తుతిస్తూ ఒక ఉత్పలమాలను ఆశువుగా చెప్పాడు అర్ధమైన ఆ భావం ప్రేక్షకుల హృదయాలను తాకింది

ఆచార్యులు కలియుగేశుడైన వేంకటేశునిపై ఒక భక్తి రసాత్మకమైన పద్యాన్ని ఆశువుగా పఠించగానే, ప్రేక్షకులంతా వెంకటేశుని సన్నిధానాన్ని పొందినట్టుగా అరమోడ్పు కన్నులతో ఆ పద్యాన్ని ఆలించారు

ఎదురుగా ప్రేక్షకుల్లో ముందు సీట్లో కూర్చున్న కరుణశ్రీగారి మీద ఓ ఆటవెలది.. తుమ్మలవారిమీద ఓ తేటగీతి.. '

అవధానం ప్రారంభమైంది పృచ్ఛకులు ఒక్కొక్కళ్ళు లేచి తమ సమస్యలను ఇస్తున్నారు కొన్ని చమత్కారంగా ఉన్నాయి. కొన్ని అసహ్యంగా ఉన్నాయి కొన్ని దుష్కరప్రాసలు.... వెంకటాచార్యులు అన్ని సమస్యలనూ చిరునవ్వుతో స్వీకరిస్తున్నాడు. అడిగిన వారికి వెంటనే ఒకపాదం చెప్పి తరువాత సమస్యకు వెళుతున్నాడు

సమస్యకూ సమస్యకూ మధ్యలో పంటి నొప్పి గుర్తుకు వస్తోంది పెద్దమ్మాయి ఉద్యోగం గుర్తుకు వస్తోంది చిన్నమ్మాయి భవిష్యత్తు మదిలో మెదులుతోంది. భార్య ... తల్లి.... మేనమామ .. సకాలానికి రాని పెన్షను .

రిజర్వేషను సమస్య.... పాలదాని గోల... అప్పు ఒప్పుకోని కిరాణాకొట్టు సెట్టి....!

ఓహ్! ఎన్ని సమస్యలు!!

ఆ సమస్యల ముందు ఈ పృచ్ఛకులు అడిగే సమస్యలు ఓ లెక్కా? అలవోకగా ఈ సమస్యలను తాను పరిష్కరించ గలడు నన్నయ తిక్కనాది మహాకవుల రచనలను పెద్దల దగ్గర పఠించిన పాండిత్యం తనకుంది! వంశపారం పర్యంగా తనలో జీర్ణమై ఉన్న ప్రతిభ తనకున్నది! స్వయం కృషితో తెలుసుకున్న సాహిత్య రహస్యా లెన్నో రసనాగ్రంపై నాట్యం చేస్తున్నాయి!

చివరి సమస్య వచ్చింది "రాముడు రామునిన్ గెలిచి రాజిల రాముని మెచ్చె రామునిన్ అని సమస్య ఇచ్చి పృచ్ఛకుడు కూర్చున్నాడు

ఎంత అందమైన సమస్య!

వెంకటాచార్యులు తన యెదుట సీతారామ కళ్యాణాన్ని సాక్షాత్కరింప జేసుకున్నాడు పద్యం పలికింది.

"భూమి సుతా కరగ్రహణభోగ శుభమ్ముగడించుకొన్నశ్రీ"

అనాటి శతావధాన కార్యక్రమం పూర్తయింది కరతాళ ధ్వనులతో హాలు దద్దరిల్లింది

ఆచార్యులు ఆ రాత్రంతా ఒక దివ్య సమాదిలో గడిపాడు. అది నిద్రావస్థో. జాగ్రదావస్థో తెలియకుండానే తెల్లవారింది. ఆచార్యులు ఆ రోజు ఇంట్లో ఎవరితోనూ ఉలకలేదు, పలకలేదు

## మనిషి – కోతి

మనిషి కోతి నుండి పుట్టాడని
డార్విన్ చెప్పింది పరమ సత్యం
కాదామరి తనే రుజువు
చేసుకొంటున్నప్పుడు ప్రతి నిత్యం

– ఆమ్రపాలి

## మామయ్యా! నన్ను మన్నించు!

సాయంత్రం అయిదు గంటలకు డాక్టర్ ఆంజనేయ ప్రసాద్ స్వయంగా కారు తెచ్చి ఆచార్యులను ఎక్కించుకొని సభాస్థలికి చేరుకున్నాడు ఇవేళ మరింత మంది జనం వచ్చారు

పృచ్ఛకులను ఒక్కొక్కళ్ళను చూచి, వాళ్ళు నిన్న ఇచ్చిన సమస్యలను తానే గుర్తు చేస్తూ, ఇంతకు ముందు తాను చెప్పిన పద్య పాదాన్ని ఆలపించి, రెండవ పాదాన్ని కొత్తగా చెబుతూ శతావధానాన్ని ఆచార్యులు కొనసాగించాడు

"నిన్న– భూమి సుతాకరగ్రహణ భోగ శుభమ్ము గడించుకొన్నశ్రీ అనిచెప్పాను గదా! రెండవ పాదం– రాముని గాధి పట్టియగు రాముని శిష్యుని జేరి శంకర" అని ఆచార్యులు అలవోకగా నూరవ సమస్యకు రెండవ పాదాన్ని పూర్తి చేయగానే ప్రేక్షకులు సంభ్రమాశ్చర్యలతో కరతాళధ్వనులు చేశారు

మూడవ రోజే శతావధానం సంపూర్తి అయే రోజు జిల్లా కలెక్టరు, మున్సిపలు ఛైర్మను, యస్పీ, జిల్లా జడ్జీ, స్థానిక యం యల్ ఏ మొదలైన పురప్రముఖులంతా విశేష ఆసక్తితో విచ్చేశారు

వెంకటాచార్యుల సతీమణి ఎన్నడూ ఒక సభకో, ఒక సినిమాకో పోయి ఎరుగదు. చిన్నమ్మాయి గొడవపడలేక భర్త చేసే శతావధానాన్ని చూడటానికి ఆ రోజు రాకతప్పలేదు అక్కా చెల్లెళ్ళు తల్లికి చెరి ఒకపక్క కూర్చొని ఉన్నారు

వెంకటాచార్యుల దవడ వాచి వుంది ఆయన ఆలోచన పంటినొప్పి వైపు మరలింది

ఇంకకొన్ని గంటలాగితే చాలు ఈ పన్ను పీకించుకోవచ్చు ఆపైన హాయిగా నిద్రపోవచ్చు

మూడు వేలు!

అమ్మాయికి ఉద్యోగం వస్తుంది.

చిన్నపిల్లను కాలేజీలో చేర్పించాలి

ఎలాగో అలాగా పెన్షను డబ్బులతో, పెద్ద పిల్లకు రాబోయే జీతంతో సంసారం గడుస్తుంది

వెంకటాచార్యులు పెళ్ళాం బిడ్డల వైపు చూస్తూ


# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

(స్థాపితం : 1908)

గాంధీనగరం : : విజయవాడ – 3

ఇంట్లో అందరికీ ఆనందాన్ని ఇచ్చే శీర్షికలు! కథలు!! వ్యాసాలు!!!

* సాహిత్య విలువలున్న సీరియల్ కథలు
* వైవిధ్యం వున్న కథానికలు
* అన్ని తరాలవారినీ అలరించే "ప్రశ్నావళి" "ధర్మపథం" న్యూఢిల్లీ లేఖ

ఇంకా ఎన్నో ఆకర్షణలతో ఏ వారానికా వారమే కొత్త దనాన్ని పుణికి పుచ్చుకుని మీకు అందుతుంది.

విడి ప్రతి వెల రు. 2-75

సంవత్సరచందా (పోస్టుద్వారా) రు. 156-00పై.

ఆరు మాసాలకు (పోస్టుద్వారా) రు.78-00పై

మీ స్థానిక ఏజెంటుద్వారా తెప్పించుకుంటే ప్రతివారం తెల్లారేసరికల్లా మీముందు వుంటుంది.

రచనలు పంపే చిరునామా :

సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ–520 003

ఇతర వివరాలకు :

బిజినెస్ మేనేజర్, ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ–520 003

న్యాయసమ్మతంగా వారికి అందేటట్లు చూడవలసిన బాధ్యత ప్రభుత్వానిది

అనాద పిల్లల విషయానికొస్తే వారి జన్మకి కారకులైన స్త్రీ, పురుషులు సంతోషంగా, గౌరవ ప్రదంగా జీవిస్తుంటే, ఏ తప్పు చేయని అమాయక పిల్లలు అనుక్షణం వేదనా భరితంగా, అవమానాలు, నిరాశా నిస్పృహల మధ్య జీవితం సాగించి సమాజం మీద కక్షతో బాలనేరస్థులుగా మారి, మరికొందరు దురలవాట్లకు బానిసలై దుర్భరంగా జీవించాలా! ఏ స్త్రీ కూడ నిర్దయగా కన్న బిడ్డను అనాదను చెయ్యదు మోసపోయిన అవివాహితలను, వితంతువులను యువకులు ముందుకు వచ్చి వివాహం చేసుకోవాలి అలా చేసుకున్న వారిని సమాజం ఆదరించాలి వేదికల మీద ఉపన్యాసాలిచ్చే రాజకీయ నాయకులు, ప్రజాసేవకులు, స్వచ్ఛంద సేవా సంస్థల నిర్వాహ కులు తమ పిల్లలకు యోగ్యులైన అనాద పిల్లలను వివాహం చేసి ఆచరణలో ఆదర్శంగా నిలబడాలి



పసిపిల్లల మీదే గాక 60 సం ల స్త్రీ మీద కూడ అమానుషంగా అత్యాచారాలు జరుగుతున్నవి నేటి నవనాగరిక ప్రపంచంలో స్త్రీకి విలువ లేకుండా పోయింది స్త్రీని నగ్నంగా ఊహించుకొని ఆనందించే స్థితికి, సెక్స్ వాంఛతో సతమతమయ్యే స్థితికి వారిని పురికొల్పుతున్నాయంటే అందుకు దోహదం చేసే పరిస్థితులు ఏమిటి? అందరకూ తెలిసిందే నేటి సినిమాలు, సెక్స్ సాహిత్యం సినిమాలలో స్త్రీలకు అసభ్య వస్త్రదారణ సిగ్గుపడవలసిన ప్రేమ సన్నివేశాలు కుటుంబ సహితంగా చదివే కొన్ని వారపత్రికలు మితిమీరిన సెక్స్ కథలు, మూకుమ్మడి మానభంగాలు, హింసతో కూడిన కథలు, సీరియల్స్ అందిస్తున్నాయి సర్క్యులేషన్ పెరగటానికి హేయమైన చిట్కాలు యివి ప్రభుత్వం వీటి మీద కఠినమైన చర్యలు తీసుకోవాలి సెన్సార్




నిబంధనలు మరింత కఠినంగా ఉండి మనస్సులను, శరీరాన్ని ఉద్రేకపరిచే సన్నివేశాలను తొలగించాలి బాలల అభివృద్ధికి, సంక్షేమ పథకాల అమలుకు నిజాయితీ గల సమర్థులైన అధికారులను నియమించాలి. యూనిసెఫ్, యునెస్కో వంటి అంతర్జాతీయ సంస్థలు అందించే సహాయ సహకారాలను బాలబాలికలకు సరైన పద్ధతిలో అందేటట్లు చూడడానికి ప్రభుత్వం, రెడ్ క్రాస్ సంస్థలు మొ వి పర్యవేక్షణ జరపాలి అభం శుభం తెలియని పిల్లల భవిష్యత్తుకి అందరూ బాధ్యత వహించి వారి జీవితాలలో వెలుగు నింపి భారతదేశ ప్రగతికి, జాతి సమైక్యతకు తోడ్పడాలి

–రమ, సీతమ్మధార;
విశాఖపట్నం

* * *

# అందరూ బాధ్యత తీసుకోవాలి!

"బాలలే విజ్ఞాన హేతువులు-
నేటి రేపు మధ్య సేతువులు
చంద్ర బంధుర సుధా శీతువులు
మానవతా వికాస హేతువులు–"

అంటూ కల్మషం కాలుష్యం, అంటని ఆ లేతగులాబీల సౌందర్యం కోసం, కవితా మకరందాన్ని అందించారు మహాకవి శ్రీశ్రీ. ఈ సౌందర్యం సృష్టిలో కొందరికేనేమో. వెలుగు రేఖలు ప్రసరించక, చీకటి గవాక్షంలో చిక్కుకు పోతున్న బాలలు ఎందరో! తెల్లారి లేస్తే, పనిదొరకదేమోనని, వణికి పోతారు పలకలు పట్టికెళ్ళవల్సిన బడికి టాటాచెప్పి ,పలకల ఫ్యాక్టరీలో పని చేస్తుంటారు దీపావళి వస్తే అందరికి ఆనందం– మరి శివకాశీలోని పిల్లలకి, అదంటే భయంతో కంపించి పోతారు ఫిరోజాబాద్ గాజు ఫ్యాక్టరీ బాలల చేతులు అగ్నితో ఆడుతుంటే,




జయపూర్ వజ్రాల ఫ్యాక్టరీలు బాలల శ్రమశక్తిని ఆరగించి బడా పెత్తందార్లు. బీర్లు సీసాల్లో కలుస్తాయి టీ కొట్టుల్లో, రైల్వే స్టేషన్‌లలో, క్యాంటీన్లలో, బూట్ పాలీష్ యిలా ఎన్నో పరిశ్రమలలో బాలల రెక్కలు



ముక్కలై లేలేత రక్తం చెమట బిందువులై పోతున్నది తరగ పోయే లేత శ్రమకి ప్రతిఫలం రోజు రూ 2 నుంచి రూ 3, యిక పనిగంటలు కనీసం 12 గంటలు

ఇక కారణాల తెర తొలిగిస్తే, తేనెటీగల్లా ముసురుకొంటాయి దేశ ఆర్థిక పరిస్థితే కావచ్చు, కుటుంబ పరిస్థితులు, కుటుంబ సభ్యుల మధ్య వైషమ్యాలు, పెద్ద పెద్ద కుటుంబాలు, దారిద్ర్యం యిలా ఎన్నో ఎన్నెన్నో. బాల్యాన్ని ప్రాయాన్ని "దుర్వినియోగం" చేయొద్దని భారత రాజ్యాంగం పదే పదే ఆదేశించింది ఫలితం శూన్యం. చట్టాలు చేసి చేయి దులుపుకొంటే, కాగితాలపై సంతకాలు మాత్రమే మిగులుతాయి భారత ప్రభుత్వం యిటీవల కొత్త బిల్లును '1986 బాల కార్మికుల బిల్లు ప్రవేశ పెట్టింది. ఫలితాల కోసం యింకా వేచి చూడాలి

ప్రస్తుతం బాల కార్మికులను ఏ చట్టం రూపుమాపలేదు కానీ, పని చేసుకొంటూనే కనీస సౌకర్యాలను కలిగించి 'ప్రతి బాలుడు' 'మనిషి'గా ఎదిగేటట్టు పరిస్థితులు కల్పించాలి

పని గంటలు, వేతనాలు, సంక్షేమం మొ నవి క్రమబద్ధం చేయాలి. అపాయకరమైన పరిశ్రమల్లో బాలలను నిషేధించాలి ప్రతి ఫ్యాక్టరీకి ఓ బడి' నినాదాన్ని అమలు పరచాలి ప్రభుత్వ చట్టాలు మాత్రమే ఏమి చేయలేవు. స్వచ్ఛంద సంస్థలు, కేవలం కబుర్లకై పరిమితమైన క్లబ్బులు, చౌరస్తాల్లో హస్కు కొట్టే నేటి యువతరం దీనిలో చొరవ చూపించవచ్చు.

లేలేత గులాబీల సౌందర్యాన్ని నలుదిక్కులు వ్యాపింప చేయాలి ఒకటి మాత్రం నిజం –

బాల్యం నాశనమైతే, భవిష్యత్ భారతమే విచ్ఛిన్నమవుతుంది

-యం. సాయిరమణ,
దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు :..................
పూర్తి చిరునామా :.....................
.....................
.....................
పిన్‌కోడ్ :

## కాళీమాతకు విస్కీ అభిషేకం!

ఉత్తర ప్రదేశ్ ఆగ్రాకు చెందిన భైరాన్ దేవాలయంలోని కాళీమాతకు భక్తులు విస్కీపోసి అభిషేకం చేస్తారట. ముఖ్యంగా సంతానం కావాలనుకొనేవారు యీ కాళీమాతకు విస్కీతో అభిషేకం చేస్తారట. కొన్నేళ్ళకు క్రితం భక్తి ముదిరినవారు అధిక ఉద్రేకంతో తమ కాలో, చెయ్యో, ముక్కో, చెవో కోసి సమర్పించుకునే వారట పోలీసులు కలుగ జేసుకోడం వల్ల యీ చర్యలు ఆగిపోయాయట

## ఆస్ట్రేలియాలో కంగారు బెడద!

ఆస్ట్రేలియాలో కంగారు జంతువులు అధికమై అవి పంటలను నానా భీభత్సమూ చేస్తూంటే వేరే గత్యంతరంలేక వాటిని కాల్చి చంపేయవచ్చునని ప్రభుత్వం ఆజ్ఞ నివ్వడమేగాక, ఆ మేరకు ఆ పని తానూ చేపట్టిందట తత్ఫలితంగా ఆ జంతు చర్మాలను విదేశాలకు అమ్మడం వల్ల 17 కోట్ల రూపాయ లు(మన లెక్కలో) సంపాదించిందట

## పొగ తాగేవారికి దూరంగా ఉంటే క్షేమం!

హవాయికి చెందిన హనలూలులో ఓ అమెరికన్ సర్జన్ జనరల్ మాట్లాడుతూ పొగ త్రాగే వారి పక్కనున్న వారికి కూడా క్యాన్సరు, గుండె దుర్బలం




వంటి వ్యాధులు నిశ్చయంగా వస్తాయని. అందువల్ల పొగ త్రాగనివారు. పొగవదిలే వారికి దూరంగా వుండడం క్షేమమనీ అన్నారట

## నగ్నపండగ!

కర్నాటక షిమోగా జిల్లాకు చెందిన చంద్రగుత్తి గ్రామానికి దాపులో వరదానది వున్నదట. ఆ నది వద్దవున్న వో కొండమీద రేణుకాదేవి ఆలయం వున్నదట ఈ ఆలయంలో ఏటికి ఒక రోజున ఉత్సవం జరుగుతుందట. లక్షలాది ప్రజలు వరదానదిలో స్నానం చేసి, ఆనక నగ్నంగా ఆ కొండ ఎక్కి అక్కడి రేణుకాదేవిని సందర్శించుకుని, తిరిగి




వస్తారట. ఈ పండుగకు ఒక ఇతిహాస ముందట రేణుకాదేవి నీళ్ళకోసం నదికి వెళ్ళేసరికి అక్కడో సుందర పురుషుడు నగ్నంగా ఆ నదిలో స్నానం చేస్తున్నాడట అతన్ని చూసేసరి కామె మనస్సు చలించిందట. ఈ విషయం గ్రహించిన జమదగ్ని ఆమె తల నరకమని పరశురామునికి చెప్పేసరికి ఆమె తన కొడుకుని చూసి బట్టలన్నీ విప్పేసి, నగ్నంగా వో గుహలోకి పారిపోయి, అక్కడ అగ్ని సృష్టించుకుని ఆత్మాహుతి చేసుకున్నదట. ఆ ప్రదేశంలోని ఆ గుహలో యీనాడు రేణుకాదేవి దేవాలయం వెలసిందట ఈ నగ్న పండుగను ఆపడానికి కర్నాటక ప్రభుత్వం యిప్పటికి మూడేళ్ళుగా నానాపాట్లూ పడుతోందట

## జర్నలిజంలో పతకాలు సాధించిన మహిళ!

అంజు అగ్రవాల్ అనే ఆమె జర్నలిజంలో చేరి, దాన్ని అవుపోసన పట్టి 'టైమ్స్ ఆఫ్ ఇండియా" రజత పతకం, "నాగపూర్ టైమ్స్' బంగారు పతకం, "భవాన్స్ కులపతి" రజత పతకం- యీ మూడు బహుమతులను పొందిందట

## వింత పోటీ!

పశ్చిమ జర్మనీలో వో వింతపోటీ జరిగిందట ఉల్లిపాయలు ఎవరు ఎక్కువ తరుగుతారో వారికి బహుమతి యివ్వడమట ఈ పోటీ ఈ పోటీలో ఒకాయన అవలీలగా ఒక గంటలో 18 కిలోల వుల్లిపాయలు తరిగి ఆ బిరుదు లాక్కుని ఛక్కాపోయాట్ట కన్నీళ్ళు తుడుచుకుంటూ

## దాంపత్య సుఖం ఇవ్వని భర్తకి జరిమానా!

ఇజ్రాయిలుకు చెందిన హాయిఫా అనే నగరంలోని వో స్కూలు టీచరు తన భార్యకు ఒక ఏడాదిగా దాంపత్యసుఖం యివ్వలేదట దాంతో ఆమె కోర్టుకు ఎక్కి యీ విషయం సిగ్గు విడిచి ఫిర్యాదు చేస్తే జడ్జిగారు విమర్శించి యిది తప్పనీ, సదరు టీచరుగారు తన భార్యకు దాంపత్యసుఖం యివ్వని ప్రతి రాత్రీ లెక్క గట్టి వారానికో మూడు బంగారు నాణాలు జరిమానా చెల్లించుకోవాలనీ అన్నారట

## పొలంలో వెండి భూదేవి విగ్రహం!

చిత్తూరు జిల్లా కంచినవారిపల్లెకు చెందిన గుర్రెడ్డివారిపల్లెలో భాగ్యమ్మ అనే ఆవిడ తన పొలం దున్నుకుంటూండగా వెండి భూదేవి విగ్రహం ఒకటి బయట పడ్డదట సుమారు రెండువేల రూపాయల ఖరీదు చేసే యీ వెండి విగ్రహాన్ని పోలీసు సబ్ యినస్పెక్టర్ స్వాధీనపరచుకున్నారట!

## వివాహిత యువకుని అఘాయిత్యం!

ఒంగోలుకు చెందిన 30 ఏళ్ళ దిలిప్ అనే వో వివాహిత యువకుడు అదే వూరుకు చెందిన వో పోలీసాయన కూతుర్ని ప్రేమించాడట పెళ్ళిమీద పెళ్ళేమిటి రర్ అనడంతో జేబులో వున్న చిన్న చాకు తీసి తనను తానే ఆ దిలీప్ కస కస పొడిచేసు కున్నాడట చావు తప్పి ఆసుపత్రిలో చికిత్సలో వున్నాడట

## శతాబ్దాంతానికి 10 కోట్ల ఎయిడ్స్ మరణాలు!

యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన శస్త్ర విద్యా నిపుణుడు డాక్టర్ కూప్ ఇటీవల లింబ్‌బర్గ్‌లో ఉపన్యాసం యిస్తూ యీ శతాబ్దం పూర్తయ్యే నాటికి ప్రపంచంలో వెయ్యి లక్షల మంది భయంకర మైన ఎయిడ్స్ వ్యాధితో మరణిస్తారని జోస్యం చెప్పారట ఈ సుఖవ్యాధికింత వరకూ సరియైన మందు, ఇంజక్షను, వాక్సిను వంటి వేమీ తయారు కాలేదని, తత్ఫలితంగా రోజు రోజూ పెరిగే యీ వ్యాధి పేట్రేగి పోతోందని కూడా ఆయనన్నారట ఇప్పటికే




యావత్ ప్రపంచంలో యీ రోగం వున్నవారు సుమారు వంద లక్షలమంది వున్నట్టు లెక్కలు తెలుస్తున్నాయని ఆయన ప్రకటించారట

## తిరుపతి అడవుల్లో వింత జంతువు!

తిరుపతికి చెందిన తలకోన అడవులలో వో భూతంసైజు బల్లి కనబడిందట ఆ బల్లి 18 అడుగుల పొడవుందట ఇది బల్లో మరొకటో తేల్చుకోడానికి తిరుపతి విశ్వ విద్యాలయానికి చెందిన జంతుశాస్త్ర విజ్ఞానులు హుటా హుటి వెళ్ళి జౌరా జౌను అని తేల్చారట ఇది ఆకలేస్తే మనుషుల్నే చప్పరించదు కదా! □

ఆంధ్రపత్రిక ప్రచురణ

# బాలరంజని

చిన్నపిల్లల మాసపత్రిక

(పెద్దవారు కూడా చదవవచ్చు!)



# సినిమా:

## ఫిబ్రవరి ఆఖరున "ఇంటి దొంగ"

కుటుంబాలలో కలతలు కలహాలు అశాంతిని సృష్టించే ఇంటి దొంగలు ఎంతో ప్రమాదకరమైనవారు ఆ కుటుంబంలో అల్లకల్లోలం తొలగి ప్రశాంతత మళ్ళీ నెలకొనాలంటే భగీరథ ప్రయత్నం చేయవలసిందే ఈ ఇతివృత్తంతో రూపొందించబడిన చిత్రం

మలయాళ నటి లలితను పరిచయం చేస్తున్నాం అన్నారు కోడిరామకృష్ణ ఈయన కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో వాకాడ అప్పారావు దాట్ల రామకృష్ణంరాజు నిర్మించిన శ్రీ లలిత కళాంజలి ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో కల్యాణ చక్రవర్తి అశ్విని రావు గోపాలరావు, రాజా గిరిబాబు జి కె

రెడ్డి, తలంబ్రాలు సుబ్బారావు, వై. విజయ, అన్నపూర్ణతో పాటు కోడిరామకృష్ణ డాక్టర్‌గా ఒక

"మకుటంలేని మహారాజు"లో శ్రీదేవి



అంట్లగిన్నెలన్ని కడిగి తోర్లించి వంట గది శుభ్రం చేసి కాఫీకి నీళ్ళు పెట్టి ఫిల్టర్ వేసింది

ఇంతలో –

ప్రక్కింటి గడియారం ఠంగ్.. ఠంగ్.... మని మూడు గంటలు కొట్టటం, వీధి తలుపు శబ్దం కావటం ఒకేసారి జరిగింది

'పోస్టేమో" అనుకుంటు వెళ్ళి తలుపు తీసిన అనూరాధ ఎదురుగా భర్తని చూస్తూనే ఆశ్చర్య పోయింది.

'అదేంటండీ? ఇప్పుడొచ్చారు? ఆఫీసుకి సెలవా?'

' . . . ' సుధాకర్ నిశ్శబ్దంగా లోపలికి వచ్చాడు అతను పెదవి విప్పకముందే "ఏమండి' అన్నట్లు మానాన్న వచ్చారు ఇప్పుడే భోజనం చేసి గదిలో పడుకున్నారు.. అంది ఆనందంగా

!?' సుధాకర్ గబాల్న తల ఎత్తి అయోమయంగా భార్య మొఖం లోకి చూశాడు. ఆమె ఏం చెపుతూందో ఒక్క క్షణం అర్థం కాలేదు

. అనూరాధ పకపకా నవ్వింది



ఎందుకండి అంత ఆశ్చర్యం. గడపలో నాన్నని చూడగానే ముందు నేనూ అలాగే ఆశ్చర్య పొయ్యా కాని నాన్న నిజంగానే వచ్చారు. రండి పలకరిద్దురు గాని . అంటూ ఆనందంగా భర్త చెయ్యి పట్టుకుని గదిలోకి తీసుకెళ్ళింది.

నాన్నా . మీ . అల్లుడొచ్చారు " అంటు హుషారుగా గదిలో కాలు బెట్ట బోయిన అనూరాధ హఠాత్తుగా గడప దగ్గరే ఆగిపోయింది

గదిలో మంచం ఖాళీగా వుంది

సుందర్రామయ్య లేదు.

అనూరాధ గుండె ఝల్లుమంది

ఒక్క క్షణం సర్ప దష్టలా అలాగే చూస్తూ నిల్చుండి పోయింది.

అరె . మా నాన్న ఇప్పటి వరకూ మంచం మిదే పడుకున్నారండి లేచి బాత్ రూమ్‌కు గాని వెళ్ళారేమో అంటూ చప్పున బాత్‌రూమ్ వైపు అడుగులు వేసింది.

బాత్‌రూమ్ తలుపు తీసి తొంగి చూసింది.

అక్కడా తండ్రి జాడ లేదు.

అనూరాధ బిత్తరపోతూ వెర్రి దానిలా భర్త మొఖం లోకి చూసింది.

ఏమండీ? నాన్న వచ్చి అన్నంతిని . పక్కనేనే మంచం మీద.. .. నె... ."

సుధాకర్ జాలిగా భార్య మొఖం లోకి చూశాడు

ఆప్యాయంగా ఆమె భుజాలు పట్టుకుని ఓదారుస్తున్నట్లు అన్నాడు

అనూ ! ప్లీజ్ అప్‌సెట్ అవకు ఇదిగో ఇది చదువు" అంటు జేబులోంచి ఎర్రటి టెలిగ్రాం కాగితం తీసి భార్యకి అందించాడు

'సుందర్రామయ్య ఎక్స్‌పైర్డ్ సార్ట్ ఇమిడియట్లీ అంతే'

మరుక్షణం ఆ గది పిడుగు పడినట్లు దద్దరిల్లింది.

నా. . న్నా'? " అంటూ వెర్రికేక పెట్టి మొదలు నరికిన చెట్టులా వున్న చోటే నిలువునా కుప్ప కూలిపోయింది అనూరాధ

సుధాకర్ జాలిగా భార్య రెండు భుజాలు పట్టుకొని దగ్గరకి తీసుకున్నాడు.

అనూ! ఈ రోజు మధ్యాహ్నం పన్నెండు గంటలకి మీ నాన్నగారికి హార్ట్ ఎటాక్ వచ్చి పోయారుట మీ అన్నయ్య మా ఆఫీసుకి ట్రంక్‌కాల్ చేసి చెప్పాడు టెలిగ్రాం కూడా అందింది ఆయన చనిపోయి చాలా సేపయ్యింది. మనింటికి రావట మేమిటి? నువ్వేదో కలగని వుంటావ్ వెంటనే బయలు దేరదాం లేచి బట్టలు సర్దుకో.. . అన్నాడు ఓదారుస్తున్నట్లు

కాని అనూరాధకి భర్త మాటలు ఓదార్పు ఏమి వినిపించటం లేదు

ఎర్రని ఎండలో తండ్రి తలుపు కొట్టటం, తను ప్రక్కన కూర్చుని వడ్డిస్తుంటే, తండ్రి పీట మీద కూర్చుని అన్నం తింటున్న దృశ్యమే మనోనేత్రం ముందు కదులు తూంది

నాన్నా?' అన్న ఒక చిన్న కేక గుండెల్లో సుడి తిరుగుతూంది □





కుందేళ్ళను పోలిన అగవుతీలు అనబడే ఈ జంతువులు దక్షిణ అమెరికా, మెక్సికో, వెస్ట్ ఇండీస్‌లలో కనిపించే సాదు క్షీరదాలు' ఆకుకూరలు, క్యారట్‌లు, చెఱకుగడలు తింటూ ఉల్లాసంగా తిరుగాడుతుంటాయి వీటి మనస్తత్వం కల్లాకపటం ఎరుగని పసిపిల్లల మనస్తత్వంలా ఉంటుంది''

## జంతు ప్రవర్తన

# ఏమిటి సం

ఇటీవల జంతు ప్రవర్తన కూడ జన్యు ప్రకటితమేనన్న సరి క్రొత్తవాదం రంగంలోకి వచ్చింది బవేరియాకు చెందిన కొన్‌రాడ్ లొరెంజ్ అనే జంతు శాస్త్రజ్ఞుడు అడవి బాతుల మందలపై పరిశోధనలు కొనసాగనిచ్చి ఆ పక్షుల ప్రవర్తనా సరళి జన్యునిర్దేశిత సంకేతాల ననుసరించి క్రమానుగతంగా మార్పుచెందుతూ ఉంటుందని స్పష్టం చేసాడు అనూచానంగా, సాంక్రమికంగా జన్యుప్రబావం అవిచ్ఛిన్నంగా కొనసాగి జంతువుల ప్రవర్తనమీద ఆధిపత్యాన్ని కనబరుస్తుందని చెప్పుకోవచ్చు ఈ విషయం మనిషికి కూడ వర్తిస్తుంది' ఈ అంశాన్ని కూలంకషంగా వివరించిన లొరెంజ్‌కు క్రీ శ 1973 లో నోబెల్ బహుమతి రావటం చెప్పుకోదగ్గ విశేషం''

ప్రవర్తన అంటే ఏమిటి అనేదానికి స్పష్టమైన సమాదానం చెప్పుకోవాలి శారీరక దర్మ నిర్వహణమే ప్రవర్తనని అనుకుంటే అది ఉచితం కాబోదు మానసిక ప్రవర్తన కూడ లెక్కలోకి తీసుకుంటే శాస్త్రబద్ధంగా వివరించడానికి తగిన సాక్ష్యాదారాలు ప్రత్యక్షంగా లబ్యంకాబోదు పరోక్ష ప్రమాణాన్ని శాస్త్రగత పరిబాషలో అంగీకరించడం న్యాయమనిపించుకోదు ఇంతకూ లొరెంజ్ ప్రవర్తన అంటే ఏమని తలబోసాడన్నది చర్చనీయం ప్రవర్తనా సరళి, శరీరదర్మ నెలవు మాదిరే వంశపారంపర్యంగా సంక్రమిస్తుందన్నది లొరెంజ్ విశ్వాసం శరీర దర్మాలు పరిణామ ప్రవృత్తిని అనుసరించి ఎలా మారుతాయో, ప్రవర్తనా దోరణులు కూడ అంతేనని అతని అభిమతం అది నిజంకూడ'

బాగా అర్థమయ్యేటట్లు చెప్పుకోవాలంటే పరిణామ వికాస స్థాయిని బట్టి శరీరధర్మాలు, ఆ ధర్మాలను నిర్వహించే స్థోమతులను బట్టి ప్రవర్తనా ధోరణులు ఆధారపడి ఉంటాయని నిర్ణయించుకోవచ్చు అంటే శరీర దర్మాన్ని నిర్వహించే లక్షణాన్నే ప్రవర్తనగా బావిస్తున్నారని అనుకోవడం తప్పుకాదు క్రీ శ 1966 లో ఆంగ్లంలో ప్రచురించబడిన లొరెంజ్ రచన అన్ అగ్రెషన్ ఎంతో ఆలోచనని రేకెత్తింప జేసింది జంతువులలో ద్యోతకమయ్యే సంఘటిత భావసరళి మానవాళిలో కూడ ప్రస్ఫుటమవుతుందని ఆయన అంటాడు ఈ బావాల క్రమ ఉరవడినుంచే ఉదాత్త నైతిక విలువలు మనిషిలో అవతరిస్తాయని లొరెంజ్ బలీయంగా విశ్వసించడం ఆసక్తిని మాత్రమే కాదు, ఎంతో వివాదాన్ని కూడ రేపింది' ఇంత మాత్రానికే నోబెల్ బహుమానమా అనిపించవచ్చు కాని, ఈ సరళమైన ప్రాతిపదిక వెనుక ఎంత పరిశోదనా నేపధ్యముందో, కృషితాలూకూ నైపుణ్యముందో గుండెలోతుల్లోంచి ఆలోచించి చూస్తే కాని తెలియదు

సమస్త జంతుజాలానికి మూలం ఒకటేనన్నది నిర్వివాదాంశం అమీబా మొదలు ఆడమ్‌వరకు జన్యుపరమైన వారసత్వపు అనుబందముంది అందువల్లే అన్ని జంతువులలోనూ (మనిషితో సహా') ఎన్నో లక్షణాలు ఒకేవిదంగా ఉంటాయి పరిణామ క్రమంలో వాటి స్థాయిలు మార్చవచ్చు కాని మూల జనస్థానం మాత్రం ఒకటేనని స్పష్టంగా తెలుతుంది ప్రకృతి పర్యంతంగా అన్ని జంతురాశుల్లోనూ ఆకలి, నిద్ర, కామవాంచ ఉండడం ఈ బావనకు ప్రత్యక్ష తార్కాణంగా తీసుకోవచ్చు అన్ని జంతువులు ఆనందాతిశయాన్ని, మానసికోత్సాహాన్ని, ఆందోళనను, ఉద్రేకాన్ని, బయాన్ని, బయపెట్టడాన్ని, కేరింతలు వేయడాన్ని, గంతులు వేస్తూ హాయిని తెలపడాన్ని – ఇలాంటి లక్షణాలన్నింటిని తెలుపుతాయి ఆనందంతో త్రుళ్ళిపడుతూ, ఈ ప్రపంచాన్నే మరచిపోయి, చెట్టకొమ్మలమీద సర్వంమరచి గంతులువేసే ఉడతపిల్లను చూస్తే పసిపాపను చూచినట్లే ఉంటుంది మేఘ గంభీర వచనంలో రాజసం ఉట్టిపడేలా ధీరోదాత్తంగా అడవిలో నడయాడే మృగరాజును చూచినప్పుడు, మనపురాణాల్లో చరిత్రలో కనిపించే మహారాజులు మనోవీదిలో మెదలుతారు అందమైన చక్రాల్లాంటి కళ్లను త్రిప్పుకొంటూ సౌకుమార్య లావణ్యంతో అందీ అందకుండా పారిపోయే జింకపిల్లను చూస్తే, పచ్చికొబ్బరిలాంటి పడహారేళ్ల పడుచుపిల్ల, పరవశించిపోయే ఆమె సౌందర్యము స్ఫురణకు వస్తాయి మేరు పర్వతంలా మౌనంగా మందగమనంతో అలరారే మత్తగజాన్ని చూచినప్పుడు తపోనిధి కూడగట్టుకొన్న మహా యోగిపుంగవుడు హృదంతరంలో తప్పక నిలుస్తాడు అంటే జంతువుల ప్రవర్తనకు, మానవుల ప్రవర్తనకు అవినాబావమైన అత్యంత సున్నితమైన



కంగారు కంగారుగా కడుపులోని సంచిలో బిడ్డతో ఆస్ట్రేలియా ఖండమంతటా గంతులు వేస్తూ కానవచ్చే ఈ జంతువు కంగారూ' మాతృప్రేమ జాలువారే మధుర స్మృతిని ఇస్తుంది ఈ మూగ జీవి''

# ...బంధం?



గినీపిగ్స్ అన్ని రకాల ప్రయోగాలకు ఉపయోగించబడుతున్నాయి. నెమ్మదిగా ముద్దుగా ఉండే ఈ జీవుల్ని డచ్ గినీ నుంచి 16 వ శతాబ్దంలో ఐరోపాకు తరలించారు!

జన్యుసంబంధముందని అర్థం అవుతుంది. విశేష మేమిటంటే ప్రవర్తనకు సంబంధించి శరీర ధర్మ నిర్వహణాక్రమము, శరీరావయవ నిర్మాణక్రమము కూడ ఒకేవిధంగా ఉండడం' ఆహార పోషణ విధానము, ప్రత్యుత్పత్తి విధానము, విసర్జక వ్యవస్థ, జ్ఞానాంగాల వ్యవస్థ మొదలైనవన్నీ ఒకేవిధంగా అన్ని జంతువుల్లోనూ స్థాయీ భేదంతో ఉండటం జన్యుపరమైన వాటి ఏకోదర సంబంధానికి సంకేతమనే చెప్పాలి ఫలితంగా ప్రవర్తన కూడ జన్యుపరమైనట్లు భావించడం జరిగింది

అన్ని జంతువుల మల్లే మనిషికూడ అయితే మనిషి ప్రత్యేకత ఏమిటన్నది ప్రశ్న ఇలాంటి చర్చ ఒక మనిషి మాత్రమే చేయగలడు ఆ పని జంతువు చేయలేదు మనిషికున్న పాటి తెలివి జంతువులకుండవచ్చు కాని మనిషికున్నపాటి ఆలోచనా బలం, యోచనా శక్తి, వివేచనా సామర్థ్యం జంతువులకు లేవు గొరిల్లా, చింపాంజీల వంటివి మనుష్యుల మాదిరే ప్రవర్తించవచ్చు కొన్ని చింపాంజీలు రాస్తాయి కూడ' ఇటీవల

> చెట్లు చేమల మీద ఆనందంతో తుళ్ళిపడుతూ పరుగులు తీసే ఉడుతను చూస్తే ఎవరికైనా హాయనిపిస్తుంది' చిన్ని పాపను చూస్తున్నట్లు ఉంటుంది"



మలయాళ రాష్ట్రంలో ఒక గున్నఏనుగు మనుష్యుల మాదిరే మలయాళం మాట్లాడిన సంగతి ఎంత సంచలనాన్ని రేపిందో మనకందరికీ తెలిసిందే. ఏనుగుల దాక ఎందుకు, మనుష్యులకంటే ఎంతో తక్కువ స్థాయిలో ఉన్న రామ చిలుకలు,



ఐవేరియా జంతు శాస్త్రజ్ఞుడు
కొన్‌రాడ్ లొరెంజ్

గోరువంకలు మాట్లాడడం లేదా? అయితే అవన్నీ, మక్కికి మక్కి అందించే ఎంగిలిపదాలు' ఎందరో మనుష్యుల మాదిరి, స్వంతంగా యోచించి, నిర్దిష్టమైన వివేచనతో, విచక్షణతో తూచి, చూచి మాట్లాడే శక్తి మనిషికి మాత్రమే పరిమితం ఈ భావవికాసానికి జన్యుస్థాయి కారణంకాదని అనడం ధర్మంకాదు మనిషి స్థితి కొచ్చేసరికి జన్యుగత పరిభాషలో పరిపూర్ణత వచ్చిందని అనుకోవచ్చు ఎందుకు ఇప్పుడే రావాలని ప్రశ్నిస్తే ప్రకృతే సమాధానం చెబుతుంది అది ప్రకృతి గొప్పతనమని ప్రకృతివాదులుగా శాస్త్రజ్ఞులు నిలిచిపోతే, మరికాస్త పైమెట్టుకెళ్ళి ప్రకృతి పురుషుడైన విశ్వభవుని దివ్యశక్తి ప్రభావంగా మనవాళ్ళు చెబుతారు మానవజన్మ సర్వోత్కృష్టమైనదని మన పురాణాలు అనడం ఇందుకేకాబోలు' జన్యుపరమైన పరిణామ పరిణతిని సంస్కారమని పురాణాలు అనుకొంటాయని భావిస్తే వివరణ ఎంతో సులువుగా ఉంటుంది సంస్కారం పురాకృత సుకృతమని, పూర్వజన్మ పుణ్యఫలమని కదా మనవారనేది, ఈ పూర్వజన్మ అంటే పరిణామ ప్రవృత్తిలో తక్కువస్థాయికి చెందివున్న జీవజాతి అని ఎందుకనుకోరాదు? విశదీకరణలో స్థాయీ భేదమేకాని పురాణాలు, విజ్ఞానశాస్త్రాలు రెండూ చెప్పేదొకటేనని నా అభిప్రాయం'

ఈ విధంగా ఆలోచించినప్పుడు కొనరాడ్ లొరెంజ్ చెప్పిన ప్రవర్తనా నియమావళి, తత్సంబంధిత జన్యుప్రభావం క్రొత్తవేమీ కాదని స్పష్టంగా బోధపడుతుంది నైతిక విలువల ప్రామాణ్యానికి కూడ జన్యుప్రభావమే కారణమని లొరెంజ్ అంటె, తరాల సంస్కార బలం ముఖ్యహేతువని భారతీయ ఋషులంటారు జన్యుప్రభావము, సంస్కార బలము అంతా ఒకటేనని కొంచెం ఆలోచిస్తే తెలిసిపోతుంది రెండింటి వివరణా ఎంతో క్లిష్టంగా ఉంటుంది అయితే వాటి పరమార్థ మొకటే' ప్రకృతిలో అనర్థాలు సృష్టిస్తే జాతులు పతనం కాక మానవన్న మన ప్రాచీనుల వేదోక్తినే లొరెంజ్ కూడ మళ్ళీ మళ్ళీ చెబుతున్నాడు విజ్ఞాన శాస్త్రాల పేరిట రకరకాల ప్రయోగాలు చేస్తూ ప్రకృతిని పతనం చేస్తున్నారని, అనుభూతులనేవే లేకుండా జీవజాతులు కొనసాగుతున్నాయని, ప్రకృతిపరమైన విపరీతమార్పులు జీవజాతుల ప్రవర్తనా సరళిలో వివాదాస్పదమైన మార్పులను తెస్తాయని, ఫలితంగా క్రమగతి, నియతి లేని అస్తవ్యస్త అవస్థ ఏర్పడి క్రమానుగతంగా తిరోగమనం ఆరంభమవుతుందని లొరెంజ్ ఎంతో విచారాన్ని వ్యక్తపరుస్తున్నాడు ఒక నియతి నియమం అంటూ ఉంటేనే ప్రకృతి ఆహ్లాదకరంగా ఉంటుందని లేకపోతే ఉత్పాతాన్ని తెస్తుందని భారతావనిలో ఎందరు ఎన్నిసార్లు చెప్పలేదు'

ప్రవర్తన జన్యు ప్రకటితమే అయినా పరిసరాల ప్రాబల్యం కూడ ఉంటుంది పరిసరాల అవరోధాలను తొలగించగలగాలన్న విచక్షణ మళ్ళీ జన్యుసంబంధమైనదేనని గుర్తించాలి ఇదే లొరెంజ్ చెప్పిందని అనుకోవచ్చు సమస్త లోకాస్సుఖినోభవంతు అన్నది వేదతంతు ఈ మాటనడానికి వలసిన విచక్షణ మాన్యమానవ జన్యు వితరణేనని చెప్పవచ్చు మన పూర్వీకుల పరిభాషలో అయితే అదే సంస్కారం'

—డా. గుమ్మనూరు రమేష్‌బాబు



# అభినేత్రి భానుప్రియ సమాధానాలు

**జి. లక్ష్మి, విజయవాడ**

'అనాదిగా ఆడది' లో మీ నటన అద్భుతంగా ఉంది నిజ జీవితంలో కూడా అంతటి సాహసము ఎదురైతే ఎదుర్కోగలరా?

ఎదుర్కోగలను! కానీ ఆ పద్ధతుల్లో మాత్రం కాదు!

మీ అసలు పేరు చెప్పండి.

నా అసలు పేరు భాను.

ఎంత వరకు చదువుకున్నారు?

మెట్రిక్ వరకూ.

**ఆర్. కులకర్ణి, మెదక్**

విజ్ఞానపు బావుటాన్ని చూపి, అసలైన సామాజిక స్పృహని సినిమాలు ఎంతవరకు కల్పిస్తున్నాయి?

మీరు ఈ ప్రశ్నని సమాచార శాఖా మంత్రిగారినో.. ఏ అభ్యుదయ రచయితనో ఏ సంఘ సంస్కర్తనో అడగండి.

**సామ రామారావు, టెక్కలి**

భానుప్రియగారూ! మీరు నటించే ప్రతి చిత్రంలోనూ జీవిస్తున్నారు తప్ప నటించడం లేదు మరి నటించేదెప్పుడు?

ఎప్పుడూ లేదు!

**పొడేటి మొగిలి, పర్కాల**

అక్కయ్యా! నేడు దిన దినానికీ వరకట్న దురాచారము పెరిగిపోవుచున్నది. దీనిని నిర్మూలించే రోజులు ఎప్పుడు వస్తాయి?

యిప్పట్లో వస్తాయనే నమ్మకం నాకులేదు.

**పి. రసూల్‌ఖాన్, దూపాడు**

ప్రేమ- పెళ్ళి మధ్య జరిగే సమరంలో పెద్దలే గెలుస్తున్నారు. యువకులు విజయం పొందే రోజు వస్తుందంటారా?

వస్తుందనే నా భావన

**పి. వెంకటేశులు, బళ్ళారి**

స్వార్థరహితమైన ప్రేమయే మంచిదని నా అభిప్రాయము మరి మీరేమంటారు?

మీ అభిప్రాయం సరైనదంటాను.

**జె. సుధారాణి, చిత్తూరు**

చక్కని పాత్రలకే ప్రాధాన్యత ఇచ్చి, ఈ సారి సూపర్ అవార్డును పొందాలని నేను కోరుకుంటున్నాను

మీ కోరిక తీరాలనే నా కోరిక.

## ఉత్తమ ప్రశ్న

**కస్తూరీ భాస్కర్, సిర్పూర్ కాగజ్‌నగర్**

ఏదైనా ఒక చిత్రంలోని ఒక సన్నివేశం ప్రేక్షకులకు బాగా నచ్చితే దాన్నే ఇతర- చిత్రాల్లోనూ చూపిస్తున్నారు మన చిత్రాలు దెబ్బతినడానికి ఇదొక కారణమంటాను మరి మీరేమంటారు?

మీరు కరెక్ట్ అంటాను!

**హకీంపేట వెంకటయ్య, కోస్గి**

"మంచి మనుషులు లాంటి మంచి మంచి చిత్రాలలో బహు మంచిగా నటించి మంచి శిఖరాలందుకోవాలని నా మంచి కోరిక దీనిని నిలబెడతారు కదూ?

మంచిగా నిలబెడతాను.

**కె. త్రివేణి, తణుకు**

నేటి సమాజం ముందడుగు వేయాలంటే యువతరం అవసరమంటాను మీరు ఏమంటారు భానుప్రియగారూ!

అలాగేనంటాను.

**హెచ్. సుప్రియ, వి. కోట**

మీరెందుకు పెళ్ళి చేసుకోలేదు

ఇప్పుడప్పుడే ఎందుకు చేసుకోవాలి ?

**ఎం. జి. రెడ్డప్ప, ఐరాల**

మీరు మహానటి సావిత్రి అంతటివారు కావాలనుకుంటున్నారా?

అనుకోడంలో తప్పేదన్నా వుందా?

**నాగధనరాజు, మాధవరం**

అక్కా! నీవు 'శ్రావణ మేఘాలు' సినిమాలో చాలా బాగా పాత్రను పోషించినావు ఒక ఫోటో పంపరా!

పంపుతాను.

**జి. జానకీదేవి, బరంపురం-2**

మీ మీద కిట్టనివాళ్ళు ఏవేవో పుకార్లు పుట్టిస్తే బాధపడతారా?

నవ్వి వూరుకుని, జాలిపడతాను

**కె. వి. ఆర్. కె. ప్రసాద్, కలకత్తా-26**

మీరు మొదటి తెలుగు చిత్రములో నటించినప్పుడు పొందిన అనుభూతికి, హిందీ మొదటి చిత్రములో నటించినప్పుడు కల్గిన అనుభూతికి తేడా వివరించెదరా?

తేడా ఏమీలేదు.

**కొప్పురవూరి నాగేశ్వరరావు, గుడివాడ**

ఒక సినిమా ఒకే థియేటర్లో 100 రోజులు ఆడితే శతదినోత్సవం చేసుకోవడం గొప్పతనం అలాకాక ఒక థియేటర్ తర్వాత మరొక థియేటర్ చొప్పున 100 రోజులు ఆడితే శతదినోత్సవం గొప్పకాదు ఏమంటారు

ఒప్పుకుంటాను. □

కూపన్.

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక భానుప్రియ సమాధానాలు

ప్రశ్న : ______________________

______________________

______________________

పంపిన వారి పేరు ______________________

పూర్తి చిరునామా ______________________

______________________

# అభిమాన తారలపై అభిప్రాయం

నా అభిమాన నటుడు అరున్నర కోట్ల ఆంధ్రుల అందాల నటుడు, సాహస సామ్రాట్ సూపర్‌స్టార్ కృష్ణగారు 'అల్లూరి సీతారామరాజు' చిత్రాన్ని చూసిన దగ్గర్నుండి వారి అభిమానినయ్యాను. సాహసానికి మారు పేరు కృష్ణ. ఈనాడు చలన చిత్ర సీమలో సాహసం చేయాలన్నా విరాళాలు



ఇవ్వాలన్నా కృష్ణగారి తర్వాత ఎవరైనా. మొన్నటు పద్మాలయా స్టూడియోస్ తెలుగులో మొట్ట మొదటి 70ఎం.ఎం. చిత్రం "సింహాసనం" చిత్రంతో (తెలుగు, హిందీ, తమిళ, మలయాళ భాషలలో) యావత్ భారత దేశానికి కీర్తి ప్రతిష్ఠలు తెచ్చి పెట్టారు మా సూపర్‌స్టార్. నిన్నటి 'నా పిలుపే ప్రభంజనం' చూచి తన సాహసం, పట్టుదల ఎంత గొప్పదో నేను తెలుసుకోగలిగాను. నేటి "శాంతినివాసం" చిత్రంలో వారి నటన ఓ! ఫెంటాస్టిక్. వారు సినిమాలలోనే జీవించకుండా ఎల్లప్పుడు ప్రజల 'మహా మనిషి'గా జీవిస్తున్నారు. అందుకనే నాకు సూపర్‌స్టార్ కృష్ణగారంటే ఎనలేని అభిమానం.

-చెరుకూరి వెంకటేశ్వరి, బేస్తపేట, బాపట్ల

★ ★ ★

నా అభిమాన హీరోయిన్ సుమధుర హాసిని "సుహాసిని". ఆమె నటనంటే నాకు చాలా యిష్టం. "స్వాతి" చిత్రం చూచి ఆమె అభిమాని నయ్యాను. ఆమె నటన చాలా అద్భుతం. ఆమె ఆ చిత్రంతోనే నన్ను ఆకట్టుకుంది. అభిమానిగా మార్చుకుంది. ఆమె నటనా చాతుర్యం, కుటుంబ కథా చిత్రాలకే పరిమితం కాకుండా వెరైటీ పాత్రలు కూడా నటించి,



ఆమె చిత్రం చూచిన ప్రతి ప్రేక్షకుణ్ని ఆకట్టుకోవాలని ఆమె అభిమానిగా నేను కోరుకుంటున్నాను. మరియు నా అభిమాన హీరో నటభూషణ "శోభన్ బాబు"తో ఎక్కువ చిత్రాల్లో నటించాలని ఆమె అభిమానిగా నా కోరిక.

– ఎస్. అశోక్, అజ్మన్ (దుబాయి)

నా అభిమాన నటి విజయశాంతి ఆమె నటించిన అన్ని చిత్రాలు కాకపోయినా కొన్నయినా చూస్తుంటాను ఆమె నటనంటే నాకు చాలా ఇష్టం. ఆమె తన ప్రతి పాత్రను ఓ 'ఛాలెంజ్'గా పోషించి, నేటి 'సమాజములో స్త్రీ' కి జరుగుతున్న అన్యాయాన్ని "ప్రతిఘటన" ద్వారా ఎదిరించి, అభిమానులతో ఉత్తమనటిగా "పట్టాభిషేకం" చేయించుకుని, "అరుణకిరణం"లా వెలుగొందుతూ, నేటి బాలలే "రేపటి పౌరులు" అని చాటి చెప్పిన వీరవనిత ఆమె ఈ మధ్య మంచి చిత్రములలో నటించుటలేదు ఎక్కువగా. ఓవర్‌గా డ్రస్సులు వేయుచున్నారు అలాకాకుండా నిండైన వస్త్ర ధారణతో నటించి..... సారీ , జీవించి,



ఎక్కువగా మహిళల అభిమానాన్ని అందుకోవల్సిందిగా విజయశాంతిగార్ని కోరుతున్నాను.

–పి. జ్యోతి, వెలమపేట, నర్సీపట్నం

★ ★ ★

నా అభిమాన నటుడు నాగార్జున అక్కినేని. మొదటి చిత్రం "విక్రమ్" తోనే పరిపూర్ణ మైన నటనను ప్రదర్శించి – పరిపక్వతను సాధించి



ప్రేక్షకులచే శెహభాష్!! అనిపించుకొన్న యువ నటసామ్రాట్ మా నాగార్జున.

రెండవ చిత్రం "కెప్టెన్ నాగార్జున్", అలాగే మూడవ చిత్రం– 'అరణ్యకాండ'తో విభిన్న పాత్రలను పోషిస్తూ, ఒకే ఒరవడికి తావివ్వక పలురకాల పాత్ర పోషణలతో నేడు, రేపు రాబోతున్న "మజ్ను", 'కలెక్టరు గారి అబ్బాయి" చిత్రాలతో పరిశ్రమలో ఉన్న బిజీ ఆర్టిస్టులలో ఒకరిగా మన బోతూ, మంచి సాంప్రదాయాలను నెలకొల్పుతూ, మనుగడ సాగిస్తున్న మా 'నాగార్జున' ముందు ముందు మరిన్ని మంచి చిత్రాలలో నటించి అటు 'మాస్'ను ఇటు 'క్లాస్'ను అలరించ గలరని ఆశిస్తున్నాను!

–కె. శివరామిరెడ్డి, నందివెలుగు

విశ్వ విఖ్యాత నటసార్వభౌముని వారసుడిగా చిత్ర సీమలో ప్రవేశించి తండ్రికి తగ్గ తనయుడు అనిపించుకున్న యువరత్న బాలకృష్ణ నా అభిమాన నటుడు –"దాన వీర శూర కర్ణ"లోని అభిమన్యుని పాత్ర తోనే తనకు ఉజ్వలమైన భవిష్యత్తు ఉందని నిరూపించిన నటుడు బాలకృష్ణ – "మంగమ్మ గారి



మనవడు", "ముద్దుల కృష్ణయ్య", వంటి శతదినోత్సవ చిత్రాలు అతని నటనా వైభవానికి ఉదాహరణలు కలియుగ కృష్ణుడు , "దేశోద్ధారకుడు , 'అపూర్వసహోదరులు" వంటి చిత్రాలు విజయవంతమై 86వ సంవత్సరపు హీరోగా నిలబడిన ఏకైక నటుడు బాలకృష్ణ – అయితే కేవలం సాంఘిక చిత్రాలలోనే -కాక జానపద, పౌరాణిక చిత్రాలలో కూడా నటించి నావంటి అభిమానులను ఆనందింప జేయాలని నా కోరిక.

–శేఖరమంత్రి లక్ష్మణ్, అనకాపల్లి

★ ★ ★

సినీ వినీలాకాశంలోకి 'వందేమాతరం' అంటూ ధ్రువతారగా దూసుకు వచ్చిన రాజశేఖర్ అంటే నాకు ఎనలేని అభిమానం సంఘంలోని దుష్ట శక్తులను ప్రతిఘటించటానికి పూనుకొని, 'రేపటి పౌరులను' తీర్చి దిద్దటానికి ప్రయత్నించిన, మన 'దొరబిడ్డ' గారికి ఒక చిన్న మనవి

దయ చేసి ప్రేక్షకుల సానుభూతికి నోచుకోని పాత్రలలో నటించవద్దని. అఫ్‌కోర్స్ ఎటువంటి పాత్రలలోనయినా జీవించి, ఆ పాత్రకు న్యాయం చేకూర్చి, ప్రేక్షకుల హృదయాలను ఆకట్టుకోగలరు ఆయన్ని మా సొంత అన్నయ్యకన్నా ఎక్కువగానే అభిమానిస్తుంటాను. కానీ ఆయన నటించిన ఒకే



ఒక చిత్రం ('ఈ ప్రశ్నకు బదులేది?') చూడలేక పోయాను. ఇక ముందు కూడా వెరైటీ పాత్రలు పోషిస్తూ, నాటికీ, నేటికీ ఏనాటికీ తరగని కీర్తిని ఆర్జించి, సినీ కళామతల్లికి ముద్దు బిడ్డగా వెలుగొందాలని ఆకాంక్షిస్తూ-

-శిరసాని నిర్మల, నాజరుపేట (తెనాలి) ☐



"కార్తీకపౌర్ణమి"లో భానుప్రియ

# సినిమా విశేషాలు

—జి వి జి.

## విజయ బాపినీడు దర్శకత్వంలో 'నాకూ పెళ్లాం కావాలి'

హాస్య ప్రధాన చిత్రం పెళ్లి చూపుల్లో చూసిన అమ్మాయిని మధ్యలో అవాంతరం ఏర్పడినా— చివరికి ఎలాగో తంటాలుపడి ఆ అమ్మాయి మెళ్లోనే మూడు ముళ్లూ వేయడం తమాషా అయిన కథ కోట శ్రీనివాసరావు సోదరులు కోట నరసింహారావు కోట శంకరరావులను ఓ చక్కని పాత్రతో విజయ బాబును పరిచయం చేస్తున్నాం రెండో షెడ్యూల్ నాగర్‌కోయిల్ ప్రాంతంలో జనవరి 20 నుంచి ఫిబ్రవరి 10 వరకు అన్నారు విజయబాపినీడు ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో జె మురళీమోహన్ నిర్మిస్తున్న శ్రీనాద్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో చంద్రమోహన్, కల్పన రేఖ నూతన్‌ప్రసాద్ నిర్మల పై విజయ రమణమూర్తి రావికొండలరావు, చిట్టిబాబు తాతినేని రాజేశ్వరి అశోక్‌కుమార్ పాత్రదారులు కాశీ విశ్వనాద్ మాటలు వాసూరావు సంగీతం మహీదర్ చాయ దిలీప్‌సింగ్ శిల్పం, పుల్లారావు సంయుక్త దర్శకత్వం విజయబాబు కూర్పుతో ఆలపాటి రంగారావు సమర్పించే ఈ చిత్రానికి ఎం పి శివలింగేశ్వరరావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్

## మార్చిలో "అక్షింతలు"

పచ్చగా ఉండే ఒక మధ్యతరగతి కుటుంబంలో ముద్దుల కుమారుడు హీరో కళ్యాణ చక్రవర్తి మానసికంగా చిత్రహింసను అనుభవిస్తూనే కుటుంబభారాన్ని మోస్తూ ఉంటాడు జీవితాన్ని ఒక సవాల్‌గా తీసుకుని అటు ఎం ఎస్ సి చదువును ఇటు ప్రేమను త్యాగం చేయవలసిన విచిత్ర స్థితిలో సంఘర్షణకు లోనైనా నైతిక విలువలను కోల్పోని ఉదాత్తమైన పాత్రను కళ్యాణ చక్రవర్తి ఎంతో చక్కగా నిర్వహించారు షూటింగ్ పూర్తయింది మార్చి విడుదల అన్నారు మౌళి ఈయన కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో కె వి వి సత్యనారాయణ సమర్పించే సత్యా మూవీక్రియేషన్స్‌వారి పై చిత్రంలో పూర్ణిమ రమ్యకృష్ణ గొల్లపూడి రాళ్లపల్లి నగేష్ రాజా రాజ్యలక్ష్మి శుభలేఖ సుధాకర్ మణిమాల ఉమ రతిష్ పాత్రదారులు సుదర్శన్ బట్టాచార్య మాటలు రాశారు ఆత్రేయ వేటూరి జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు గీతాలకు కె వి మహదేవన్ స్వరకర్త పి లక్ష్మణ్ చాయ కుదరవల్లి నాగేశ్వరరావు శిల్పం ఎం అప్పారావు-రామచంద్రన్ సంయుక్త దర్శకత్వం సాహుల్ సాహసాలు శివసుబ్రహ్మణ్యం నృత్యాలు వెంకటేశ్వరరావు ప్రొడక్షన్ కె సత్యం కూర్పుతో గాది సత్యం ఆర్ సి దొరై ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్‌లు కె రామ్మోహన్‌రావు నిర్మాత

మా చిత్రంలో మంచి వెరైటీ పాత్రలు పెట్టాం! హీరో హీరోయిన్లు దుర్మార్గులు. విలన్ చాలా మంచివాడు!



## విశ్వనాధ్ సృష్టి 'శ్రుతిలయలు"

పండిత పామరుల హృదయాల మీద చెరగని ముద్ర వేయగల గొప్ప కళాత్మక విలువలున్న చిత్రాన్ని రూపొందించగల్గడం కొద్ది మందికే పరిమితమైన వరం వేళ్ళ మీద లెక్క పెట్టదగిన అలాంటి కొద్ది మంది దర్శకులలో క విశ్వనాద్ ముఖ్యులు తెలుగు సినిమాని అంతర్జాతీయ స్థాయికి తీసుకెళ్ళిన ఆ కళాతపస్వి దర్శకత్వం వహించిన సుదర్శన్ సినీ ఎంటర్ ప్రైసెస్ వారి శ్రుతిలయలు చిత్రం గురించి ఇలా తెలిపారు సంగీతమే తన ప్రాణంగా భావించే ఓ విద్వాంసుడు ముగ్గురు యువకులకు శిక్షణ ఇచ్చాడు అయితే వాళ్ళు పెద్దయ్యాక ఆ విద్యను నిర్లక్ష్యం చేస్తారు చివరికి తన మనుమడికి సంగీత సాధన చేయించి ఆ ముగ్గురు యువకులకూ గుణపాఠం నేర్పటం ఈ చిత్రం ఇతివృత్తం అరుదైన అత్యంత మధురమైన అన్నమాచార్యుని గీతాన్ని నారాయణ తీర్థుల వారి తరంగాన్ని ఈ చిత్రంలో ఉపయోగించాం పవిత్రమైన హృషీకేశ్‌లో వారం రోజులకు పైగా షూటింగ్ జరిపాం ఒక మహోత్కృష్టమైన చిత్రాన్ని నిర్మించాలన్న తపన గల ఈ నిర్మాతలను మనసారా అభినందిస్తున్నాను మద్రాసులోని సుబ్రహ్మణ్య



"అస్తులు-అంతస్తులు"లో
కోట శ్రీనివాసరావు, చరణ్‌రాజ్

సవేరా హోటల్ మేనేజింగ్ డైరెక్టర్ ఎ. ఎ. కె. రెడ్డి సమర్పించే ఈ ప్రతిష్టాత్మక చిత్రంలో సత్యనారాయణ రాజశేఖర్ నరేష సుమలత ముచ్చర్ల అరుణ జయలలిత అంజలీదేవి శ్రీకుమారి మురళి వంకాయల సాక్షిరంగారావు మిశ్రో ప్రసాదరావు బహుముఖ ప్రజ్ఞావంతుడైన బాలుడు షణ్ముఖ శ్రీనివాస్ నటించారు ఆకెళ్ళ సంభాషణలు సిరివెన్నెల సీతారామశాస్త్రి గీతాలు కె వి మహదేవన్ సంగీతం జి వి సుబ్బారావు ఛాయ అరుణ్ కుమార్ శిల్పం నందూరి విజయ్ సహకార దర్శకత్వం జి జి కృష్ణారావు కూర్పు, గురుదేవ్ నిర్వహణతో సుదాకర్ కరుణాకర్ నిర్మాతలు

## "చిలిపి దంపతులు"

చంద్రమోహన్ పూర్ణిమ చిలిపి దంపతులు ఫిబ్రవరి రిలీజ్ అన్నారు రేలంగి నరసింహారావు ఈయన దర్శకత్వంలో పెళ్ళకూరు అమరేంద్రరెడ్డి నిర్మించిన పై చిత్రంలో నూతన్‌ప్రసాద్ వేలు వీరభద్రరావు రావి కొండలరావు వై విజయ నిర్మల విజయవాణి ఇతర నటవర్గం దివాకర్‌బాబు కథ మాటలు రాశారు ఆత్రేయ సి నారాయణరెడ్డి సీతారామశాస్త్రి గీతాలను సాలూరి వాసూరావు స్వర పరిచారు బి కోటేశ్వరరావు ఛాయ లీలాకృష్ణ శిల్పం కమల్‌తేజ్ సంయుక్త దర్శకత్వం అంభోని నృత్యాలు రాజగోపాల్ కూర్పు నిర్వహించారు □

"అల్లరి కృష్ణయ్య"లో భానుప్రియ, బాలకృష్ణ



'కథ అడ్డం తిరిగింది'లో చిత్ర, నరేష్



'భారతంలో అర్జునుడు'లో వెంకటేష్, ఖుష్బూ

# హిందీ చిత్ర విశేషాలు

★ గాయకుడు స్వర్గీయ మహమ్మద్ రఫీ కొడుకు షహీద్ రఫీని వివాహమాడిన నటి' — నర్తకి లీనాదాస్ ఖురేషా వేసుకుని ఏడాదిపాటు అజ్ఞాత వాసంలో ఉంటూ వచ్చింది "పెళ్ళయ్యాక నేను సినిమాలలో నటించను" అని ప్రకటించింది కూడా కాని, తన భర్త వ్యాపారంలో దెబ్బతిన్నాక మళ్ళీ సినిమాలలో నటించడానికి నిశ్చయించింది. ఇటీవల "ఇన్సాఫ్" చిత్రంలో నటించింది.

★ బాంక్‌ని దోపిడీ చేసిన ముగ్గురు "శిన్హాతువరోన్ కా" అనే హిందీ చిత్రాన్ని నిర్మిస్తున్న విషయం ఇటీవల బయట పడింది రాజేందర్ సురేందర్ పాల్ సింగ్, గంగారత్ అనే ఆ ముగ్గురూ కొన్ని బాంకులలో 35 లక్షలకు పైగా దోచుకున్నారట! ఇటీవల అరెస్టు అయ్యారని థర్డ్ డిప్యూటీ కమిషనర్ ఆఫ్ పోలీస్ ఆమోద్‌కాంత్ ధ్రువపరిచారు.

★ బొంబాయిలోని థియేటర్లలో కొనుగోలుదార్లు రానందున దాదాపు 3౦౦ చిత్రాల ప్రింట్లు మూలుగుతున్నాయట అంటే, దాదాపు 60 కోట్ల మూలధనానికి స్తంభన ఏర్పడిందన్న మాట!

★ పాకిస్తాన్‌లో 1985లో 29 కథా చిత్రాలే తయారయ్యాయి 14 కోట్ల మూలధనంతో రాబడి అందులో 50 శాతం మాత్రమే ఇందుకు కారణం మన భారతదేశ చిత్రాల వీడియో కేసెట్లు అక్కడికి విపరీతంగా దొంగ రవాణా అవడమే

★ 'చిత్రహార్' కార్యక్రమంలో ఇటుపైన అమితాబ్ బచ్చన్ పాల్గొన్న దృశ్యాలను ప్రదర్శించరాదని దూరదర్శన్ ఉద్యోగులకు సూచన అందజేశారట.

★ "కర్మయోగి" నిర్మించిన సూరి తదుపరి చిత్రానికి నటుడు నసిరుద్దీన్ షా దైరెక్టరు.

★ సులక్షణ పండిట్‌కి నటిగా కన్నా గాయనిగా ఎక్కువ చిత్రాలలో పని చేయాలని ఆశ సంజీవ్‌కుమార్ అస్తమించడంతో ఈమె కొంతకాలం మరుగున పడింది నాకు "పెళ్ళంటూ జరిగితే సంజీవ్‌తోనే జరగాలను కున్నాను. అతని పక్కన ప్రియవుంటే ఎలాగో అతని తాగుడును మాన్పించి ఉండేదాన్ని, కాని, తన ఆరోగ్యం విషమించినందున నన్ను వివాహం చేసుకోనన్నాడు సంజీవ్ పోయాక ఒక వారం రోజులపాటు ఆలయాలను దర్శించాక గాని నా మనసు కుదుట పడింది కాదు" అంటుంది సులక్షణ పండిట్.

★ హేమమాలిని నిర్మించిన తొలి చిత్రం షరారా అంతగా విజయవంతమవలేదు అయినా, ఆమె బాధపడలేదు ఇప్పుడు మహేష్ భట్ దర్శకత్వంలో రెండో చిత్రాన్ని ప్రారంభించింది. ఇందులో మీనాక్షి శేషాద్రి, అనిల్ కపూర్ నాయికా నాయకులు గోవింద కూడా ఒక ప్రధాన పాత్రధారి

★ "కమాండో" హాలీవుడ్ చిత్రం ఆధారంగా బి. సుభాష్ దర్శకత్వంలో ముషీర్ – రియాజ్ నిర్మించే చిత్రానికి కూడా అదే పేరు పెట్టారు. ఇందులో మందాకిని మిథున్ చక్రవర్తి నాయికానాయకులు

★ "మా నాన్న స్వతాల్యంలో మూడు చిత్రాలు నిర్మించి దెబ్బతిన్నారు. మా ఆస్తంతా హరించుకు పోయింది. పూరి పాకలో నివసించాల్సిన దుర్గతి ఏర్పడింది దైవవశాత్తు నేనిప్పుడు యాభై చిత్రాలలో హీరోగా బుక్ అయ్యాను. ఇటీవలే ఒక మారుతీ కారు కొన్నాను కూడా" అంటాడు హీరో గోవింద

—(శ్రీ. వి. జి.)

# స్మృతిలో తీయనిది

శ్రీకంఠ విశ్వనాథం

సరిగ్గా పదిహేను సంవత్సరాల తర్వాత రాఘవేందర్‌కు ఆమె మళ్ళీ ఇక్కడ కనిపిస్తుందనుకో లేదు. కనిపించినా తిరిగి ఇలా విడిపోవలసి వస్తుందనీ అనుకోలేదు

* * * *

రాఘవేందర్ ఉద్యోగరీత్యా మెదక్‌లో వుంటున్నా దగ్గరి మిత్రుని కొడుకు పుట్టు వెంట్రుకలని, పైగా చాలా రోజుల తరువాత ఇతర మిత్రులని కలువ వచ్చుననీ నూటయాభై కిలోమీటర్ల దూరమైన కొండగట్టుకు ఒక రోజు ముందుగానే బయలు దేరాడు

రాత్రి మిత్రుని భార్య పిల్లలతో చాలా పొద్దు పోయేదాకా మర్నాటి ఏర్పాట్లు చూసుకోవడం– పడుకొనే ముందు చిన్ననాటి మిత్రుల గురించి వివరాలు తదితర విషయాల గురించి మాట్లాడు కొని నిద్రపోయాడు. పైగా మిత్రుడు డాక్టరు– మీదు మిక్కిలి మంచి ప్రాక్టీసున్నవాడు కాబట్టి చాలా మంది మిత్రులే ఈ కేశఖండన వుత్సవానికి రావచ్చు

ఎలా అయితేనేమి తెల్లవారింది గుట్టమీద ఆంజనేయస్వామి దేవాలయం– భక్తులు స్నానం చేయడానికి కోనేరు కోనేరుకు కుడి పక్కకు కొంచెం దూరములో గవర్నమెంటువారి వసతి గృహం గట్టు కింద మామూలు భక్తులకు ధర్మశాలలు ఇది ఒక మోస్తరు పేరున్న దేవాలయంలా వుంది భక్తుల హడావిడి 'బాగా లేదు వసతి గృహంలోని వాళ్ళు తప్ప చుట్టూ పచ్చని చెట్లు దూరంగా తెల్లగా పారుతున్న పోచంపాడు కాలువ– ప్రశాంతమైన ప్రకృతి వాతావరణం

రాఘవేందర్‌కు దైవభక్తి లేదు. కానీ భక్తులను చూసి ఎద్దేవ చేయడు ఎవరి అభిప్రాయాలు వారివి అని సరిపెట్టు కుంటాడు కాని తన నెవరన్నా దేవుని భక్తునిగా చేయదల్చుకుంటే మాత్రం చర్చలోకి దించి అతనిచేత 'లేదు వట్టిదే'నని ఒప్పించేదాకా వదలడు

వసతి గృహంలోనే స్నానం చేసి మిత్రుడు అందజేసిన టిఫిన్, టీలనూ పూర్తి చేసి ప్రకృతి దృశ్యాలను కొంచెం దూరంలో వున్న బండమీద కూర్చుని చూస్తున్నాడు

ఉదయం పదకొండు గంటలకు కార్యక్రమం డాక్టరుగారి మిత్రులు, శ్రేయోభిలాషులు తదితరులు రావడం మొదలయింది

'రఘూ! అరేయ్' ఎప్పుడొచ్చావురా అనే చిన్ననాటి మిత్రుల మాటలతో రాఘవేందర్ వెనకకు తిరిగి చూసాడు

చెప్పలేని ఆనందంతో రాఘవేందర్ మిత్రులందరి చేతిలో చేయి కలిపి చాలా రోజుల తర్వాత కాబట్టి కౌగిలించుకొని నీకు పిల్లలెందరురా!" అని, పిల్లలు లేనివాన్ని, 'అయ్యో ఇంకా పిల్లలే పుట్టలేదా' అని అరేయ్ నీ శ్రీమతి వచ్చిందా" అని ఒక్కొక్కరి మంచి చెడ్డలు అడిగాడు

మిత్రులంతా చాలా రోజుల తర్వాత కలుసుకోవడం వలన ఒకరినొకరు పలకరించుకో-డాలు– ఉద్యోగ ధర్మాల గురించి తమ తమ అనుభవాలు– బాస్‌ల కోపతాపాలు– తమ వద్ద కొచ్చేవారి నుండి ఎలా 'అమ్యా– అమ్యా"లు లాగడాలు– లంచాల తాలూకూ డబ్బుల పంపకాల వివరాలు– ఒకటేమిటి ఇంటి కిరాయి నుండి ఇల్లు కట్టుకునే దాకా, కిరసనాయిలు నుండి గ్యాస్ స్టవ్ దాకా పంజాబ్ నుంచీ ప్రత్యేక రాష్ట్రం కావాలంటున్న గూర్ఖాల దాకా, రామారావ్ నుంచీ రాజీవ్ దాకా, అంతర్జాతీయ సమస్యలు, చర్చల్లో చోటు చేసుకున్నాయి

సమయం పదకొండు గంటలు కావస్తుందని గెస్ట్‌హౌస్ వైపు దారి తీసారు

గదిలో మంచముపై కూచుని మళ్ళీ కబుర్లు మొదలు పెట్టారు ఈలోపు మిత్రుని కొడుకు కేశ ఖండన, పూజ అయిపోయినట్లున్నాయి 'హోలో" మంటూ వచ్చారు ఆడవాళ్ళు, పిల్లలూ, మిత్రుని చుట్టాలు అంతా చేరారు గదులన్నీ నిండి పోయాయి కొందరు ఆడవాళ్ళు వంటలు తయారయ్యే వద్దకు, గదిలోకి, వరండాలోంచి ఇటూ అటూ కొంగులు బొడ్లో దోపుకుని నడుస్తున్నారు

అతిథులందరినీ పలకరించి మిత్రుడు మళ్ళీ పనిలోకి వెళ్ళిపోయాడు. వంటలు ఆలస్యం అయ్యేలా వుంది 'రమ్మీ' ఆడదామని కొందరు కార్డ్సు ముందేసుకున్నారు

రాఘవేందర్‌కు రమ్మీ అంటే పెద్ద ఇంటరెస్ట్ లేదు అయినా మిత్రుల బలవంతంమీద ఆడాడు మూడు ఆటలకే అవుటయిపోయాడు

పీడ విరగడయిందనుకొని ఆ రోజుటి పేపరు ముందేసుకుని చూస్తున్నాడు

ఎండకాలం గదిలో పిల్లల ఏడుపులు ఉక్కపోతకు

రాఘవేందర్ పేపర్‌ను పక్కకు పెట్టి వరండాకేసి చూస్తున్నాడు కాంపౌండు గోడ ప్రక్కని మామిడిచెట్టు పైనుంచి ఆగి ఆగి వస్తున్న కోకిల పాటను వింటున్నాడు

ఈ మధ్యలో వరండాలో నుండి ఓ స్త్రీ గది ముందు నుండి దాటి తిరిగి మళ్ళీ వచ్చి చూసీ చూడనట్లు చూసింది. ఆమె అనుకున్నవారు అవునో కాదో నిర్ధారించుకోటానికి మరో మారు నిశితంగా ఈసారి తననే చూసి వెళ్ళింది.

రాఘవేందర్ చూపులు ఆమెపై పడ్డాయి. వెంటనే లేచి వరండాలోకొచ్చి ఆమె పోయిన గదికేసి చూసాడు తను ఎలాగైనా వచ్చి చూస్తాడను కున్నట్లే ఆమె తిరిగి అలాగే అతన్ని చూసింది.

అవును ఆమే నిజంగానే ఆమే– పదిహేను సంవత్సరాల కింద లంగా ఓణీలో చివరిసారిగా చూసిన ఆమె ముమ్మాటికీ తనతో పాటు ఎనిమిదో తరగతి వరకూ చదువుకున్న ఆమె – రియల్లీ తన బాల్య మిత్రురాలు ఆమె– సముద్రంలోని అలలుగా ఆనందం – మనసంతా – చలాకి మాటలు తన జీవితానికి చదువునూ సంస్కారం నేర్పినది ఆమె– ఆమే జయలక్ష్మి కాదు జయ.

రాఘవేందర్ మాట్లాడుదామనుకుని గది ముందువరకూ పోయాడు. కానీ చాలామంది స్త్రీలు వున్నారు గదిలో. కాస్సేపు ఆగాడు. బాగున్నావా అన్నట్లే కనులతోనే అడిగింది బాగానే వున్నానని కళ్ళు మూసి చెప్పాడు రాఘవేందర్.

రాఘవేందర్‌ను పక్కకు నెట్టుకుంటూ "జయా! జయా బాబు మట్టిలో ఆడుకుంటున్నాడు. తీసుకో " ఒకతను పిల్లవాన్ని ఆమెకు ఇచ్చి వచ్చినంత తొందరగా బయటకు వెళ్లాడు

రాఘవేందర్ ఆ స్థలంలో కొచ్చి రెండు నిమిషాల పైననే అయింది. ఎవరైనా చూస్తే ఏమైనా అనుకుంటారని కొంచెం దూరములో నున్న మామిడిచెట్ల వైపు నడిచాడు.

రాఘవేందర్ మనసు పరిశోధన పూర్తి చేసిన తెలుగు మాష్టారిలా వుంది. ఇంతకుముందు తనను నెట్టుకుంటూ పోయినతను బహుశా జయ భర్త కావచ్చు– అవును జయ భర్తే సందేహం లేదు.

చిన్నపుడు రాఘవేందర్ అమ్మానాన్నల పరిస్థితి బాగులేక పెద్దమ్మకు పిల్లలు లేకపోయేసరికి పెంచుకుందామని అనుపురంకు తీసుకుపోయారు

పెద్దమ్మకు ఓ పది ఎకరాల పొలమూ ఇల్లూ వుండేది ఆ గ్రామంలో– పైగా పెదనాన్న ఊరిలో పెద్దమనిషి.

రాఘవేందర్ అమ్మానాన్నల వద్ద మూడవ తరగతి పూర్తి చేసి అనుపురంలో నాలుగవ తరగతిలో చేరాడు పుట్టిన ఊరిలో చదివిన చదువు వానాకాలం చదువే సరిగ్గా వాళ్ళతో కలిపి చదువు రాకపోయేది. అమ్మానాన్నల గారాబం వల్ల సరిగ్గా స్కూలుకి పోయే వాడేకాదు.

నాలుగవ తరగతిలో చేరాడు. పెద్దనాన్న చాలా కటువైన మనిషి మనసులో ఏముందో తెలుసు కోవడం చాలా కష్టంగా ఉండేది. అంతేకాక కొత్త ఊరు స్నేహితులు లేరు ఇల్లూ తప్పితే స్కూలు

ఆ రోజు క్లాసులో టీచర్ తెలుగు వాచకంలోని ప్రశ్న అడిగాడు, చాలామంది నిలబడ్డారు. అందులో రాఘవేందర్ కూడా వున్నాడు. జవాబు చెప్పినవారు చెప్పనివారి ముక్కు పట్టుకుని చెంపపై

దెబ్బకొట్టాలి. ఎర్ర టెర్లిన్ ఆఫ్ లంగా, జాకెట్ వేసుకున్న అమ్మాయి జవాబు చెప్పింది. అందరినీ కొడుతుంది. చాచి చెంపపై కొట్టిన దెబ్బ చప్పుడు రాఘవేందర్‌కు స్పష్టంగా వినవస్తుంది. ఆ అమ్మాయి తనదాకా వచ్చింది. ఎంత గట్టిగా కొడుతుందో అని కళ్ళు మూసుకున్నాడు. చాలా మెల్లగా ఒక చిటికలో కొట్టి పక్కనున్నవారిని మళ్ళీ బాగానే కొట్టింది. రాఘవేందర్ అప్పుడు అనుకున్నాడు. 'ఈమెకు మగపిల్లలపై ఎందుకంత ద్వేషం' అని– అలా అనుకుందామన్నా తనను మెల్లగానే కొట్టింది కదా' తనకు సిగ్గనిపించింది.

ఆ నాటి నుండి ఆమె అంటే ఎందుకో ఇష్టం స్నేహం చేయాలని కోరిక– ఆమే జయ తరువాత క్లాసులోని మిగతా పిల్లలు అంతా ఒక్కటి, జయ ఒక్కతే ఒక్కతి– వాళ్ళ మధ్యా ఆమె మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమనేది

రాఘవేందర్ సాయంత్రం స్కూలు వదిలిపెట్టగానే ఇంట్లో పుస్తకాలు పడేసి జయ ఇంటికి పోయేవాడు కలిసి చదువుకునే వారు, కలిసి క్యారంబోర్డు ఆడేవారు. ఎండాకాలం వచ్చిందంటే కాలువలో ఈత కొట్టేవారు.

అయిదవ క్లాసు పూర్తి అయ్యేసరికి మిగతా పిల్లలందరి కంటే రాఘవేందరే మొదటి తరగతిలో పాస్ అయ్యాడు

జయకూ రాఘవేందర్‌కు స్నేహం బాగా పెరిగింది. సెలవు రోజు వస్తే పూర్తిగా వాళ్ళింట్లోనే గడిపేవాడు. కలిసి పొలాల దగ్గరికి పోవడం, బావిలో చేదను ఇద్దరు కల్సి పైకి లాగి చిన్న చిన్న నారు మళ్ళను పారించేవారు. కల్సి చదివే వారు. ఆడేవారు, స్కూలుకు పోయేవారు. ఒక్క పడుకోవడమే వేరు

జయ వాళ్ళ నాన్న పక్కనే వున్న పట్టణం హైస్కూల్లో గుమాస్తాగా వుండేవాడు. రోజూ సైకిలుపైన స్కూలుకు పోయి వచ్చేవాడు పట్టణం నుండి వారపత్రిక, పిల్లల పత్రిక, జయ నాన్న తెచ్చేవాడు

కొత్త వారపత్రిక రాగానే జయ అన్నిటినీ మరచి పూర్తి అయ్యేవరకు చదివేది. ఒకరోజు రాఘవేందర్, "ఎందుకు అంత బాగా చదువుతావు. అందులో ఏముంది?" అని అడిగాడు

జయ వివరాలు చెప్పింది చదవాలనే ఉత్సాహాన్ని తనలో నింపింది అంతే రాఘవేందర్ వార్తా పత్రికలనూ, నవలలనూ చదవడం మొదలు పెట్టాడు

ఏడవ తరగతి పూర్తి అయిపోవటానికి వచ్చింది



జయ రాఘవేందర్‌ను రఘు అని పిలిచేంతవరకూ స్నేహం కొనసాగింది.

రఘుకు జయన్నా ప్రాణం, జయకు రఘు అంటే ఇష్టం

ఒకసారి స్కూల్లో ఉపన్యాసాల పోటీ జరుగుతున్నది జయ కాగితం మీద రాసుకొచ్చి చదివింది. చారి నోటికి బట్టీ పెట్టి చదివాడు. జయను అందరూ ఎగతాళి చేసారు, చూసి చదివిందని 'రఘుకు కోపం వచ్చింది ఇంకా ఎవరైనా ఉపన్యాసం ఇవ్వాలనుకుంటే ఇవ్వొచ్చు అని టీచర్ చెప్పాడు. అంతే రఘు వెళ్ళి ఆ నాటి శీర్షిక మీద పది నిమిషాలు ఆగి ఆగి మాట్లాడాడు

రఘుకు మొదటి బహుమతి వచ్చింది. అందరూ నోరు వెళ్ళబెట్టారు జయ చాలా సంతోషించింది రఘుకు కూడా సంతోషం కలిగింది

సాయంత్రం జయ వాళ్ళింటికి వెళ్ళి ఆనాటి విశేషాలు మాట్లాడుకున్నారు "చారికి మంచిగయిందని" అంది టీ తీసుకొచ్చి తాగుమని ఇచ్చింది రఘుకు ఏమిటో వాసన వేసి తాగనన్నాడు. జయ "అయ్యో! అది బోర్నవిటా తాగు చాలా మంచిది" అంది.

ఆవిధంగా రాఘవేందర్ జీవితంలో మొదటిసారిగా బోర్నవిటా రుచి చూసింది జయ ద్వారానే

రాఘవేందర్‌కు ఆ చిన్ననాటి విషయాలు జ్ఞాపకం వచ్చేసరికి నవ్వొచ్చింది దూరంగా గెస్ట్‌హౌస్‌లో భోజనాల కోసం సందడిగా వుంది జయ ఇవతలి వరకూ వచ్చి రఘును చూసింది ముందుకు రెండడుగులు వేసింది ఏమైందో ఏమోగానీ ఆ వైపు ఈ వైపు చూసి మళ్ళీ లోపలికే వెళ్ళిపోయింది

రాఘవేందర్‌కు బాధనిపించింది కనీసం బాగున్నావా!" అనైనా అడగలేదని "ఎక్కడున్నావు అని కూడా అడగనందుకు

రాఘవేందర్ తీయని జ్ఞాపకాల మధ్య గుండెను గాజుముక్కతో గీసినంత బాధపడ్డాడు

ఎంత వదిలించు కుందామనుకున్నా చిన్న నాటి స్మృతులు మనసు తెరపైకి వస్తూనే వున్నాయి

అవి వేసవి కాలం సెలవులు– దొరగారి పొలంలో

# సృష్టిలో తీయనిది....

ఆ యేడు చెరకు పెట్టారు. ఊరిలోని ఆసాములు ఇళ్ళల్లో అందరూ చెఱకు తెచ్చుకొని తింటున్నారు.

జయా తను కాలువ దాటి సన్నటి పొలాల ఒడ్డును దాటి–చెరకు తోట వద్దకు చేరారు. ఇరవై ఎకరాలవరకు వేశారు. కావలివాడు ఎత్తయిన మంచంపైన పడుకొని వున్నాడు. వేసవి గాలి చెరకు తోటల్లోంచి "గుయ్యి" మంటూ వేడిగా చెవులను అదరగొడుతోంది

"ఎట్లా" అంటే "ఎట్లా" అనుకున్నారు.తాను భయమవుతుందన్నాడు.జయ నవ్వింది. తోట దగ్గరకు వంగి వంగి నడిచారు. జయ చెఱకు గడను పట్టుకొంది. విరుద్దామంటే విరగదు గడను కొంచం వంచిపట్టి గడపిన కాలు వేసి బలంగా చేయితో లాగి గనె వద్ద విరిచింది అంతే దీపావళి నాటి టపాకాయ శబ్దం అయింది.

కావలివాడు లేచి కిందికి దిగి ఎవడ్రా! అరేయ్ ఎవడ్రా " అంటూ రాసాగాడు. తాను ఒడ్డుమించి పరుగందుకున్నాడు చెరకు గడ అలానే పట్టుకొని జయ వెనకనే వురికి వస్తూనే వుంది. కొంచెం దూరం పరుగెత్తి వెనకకు చూసారు– కావలివాడు తిట్టుకుంటూ వస్తూనే వున్నాడు.

తాను, జయ ఇంకా పరిగెత్తారు. కావలివాడు కనిపించకుండా పోయిన తరువాత వాగుదాకావెళ్ళి ఆగారు.

దమ్ము వస్తుంది గాలి ఆడక ఉక్కిరిబిక్కిరి అవుతున్నారు తాను అలాగే చిన్నవాగులోని ఇసుకలో కూలబడ్డాడు ఆ వెంటనే జయ ఓపిక లేక గడను పక్కకు విసిరేసి పడిపోయి చేయితో అరికాలును చూసుకొంటుంది.

రక్తం కారుతుంది. అరికాలంతా రక్తమే అయింది 'అమ్మయ్యో' అంటూ రఘూ ఆమెకు రక్తం కారుతున్న చోట గట్టిగా పట్టుకున్నాడు

కొంచెంసేపటికి రక్తం ఆగింది. పక్కన చెలమ తోడాడు తాను జయ నీళ్ళు తాగారు

'రఘు! ఈ చెఱకు తిను' అంటూ ఓ మూరెడు తనకు ఇచ్చి తనో మూరెడు నములుతూనే వుంది.

రఘుకు సరిగ్గా తినరాకుంటే చిన్న రాయితో పగులగొట్టి చెఱకు పైని వేళ్ళు తీసివేసి ఒక్కొక్కటి తనకు ఇస్తూ తనూ తినసాగింది.

సుడిగాలి ఒక్కసారి రాఘవేందర్‌ను కమ్మేసింది. కళ్ళల్లో దుమ్ముపడకుండా కళ్ళకు రెండు చేతులు అడ్డంపెట్టుకున్నాడు.

కడుపులో ఆకలి చంపేస్తూంది. గెస్ట్ హవుస్ వైపు చూసాడు అందరూ భోజనాలు చేస్తున్నారు

లేచి ఆ వైపు నడిచాడు

జయకూడా భోజనాలు వడ్డిస్తూంది మామూలు ఎత్తు అయినా కొంచెం ఒళ్ళుచేసి లావు అయినట్లు అగుపిస్తూంది.

ఓ వరుసలో మిత్రుల పక్కన కూర్చున్నాడు. జయ అవతల పంక్తిలో భోజనాలు వడ్డిస్తూ ఈ వైపు చూసి చూడ నట్లు చూస్తుంది ఆమె భర్త భోజనం చేసి బాబును ఎత్తుకున్నాడు రాఘవేందర్ రెండు ముద్దలు తిన్నాడు సహించడంలేదు

తన కళ్ళ ముందే వున్న జయతో ఐదు సంవత్సరాలు కలిసి వుండి తలపుల్ని కలబోసుకున్న తనూ ఆమెతో మాట్లాడలేకపోతున్నాడు

చేయి కడిగి మధ్యలోనే లేచాడు.

మగవారి అందరి భోజనాలు అయ్యాయి.

రాఘవేందర్‌ను మిత్రుడు కొత్తవారికి తనను పరిచయం చేస్తున్నాడు కవి, రచయిత అని

వరండాలో భోజనం చేస్తున్న జయ మా మాటలు విని మళ్ళీ వెనక్కి తిరిగి చూసింది

జయ ఆనందంతో కళ్ళలోని నీటిని కొంగుతో తుడుచుకుని భోజనం మధ్యలో నుండి లేచిపోయింది

రాఘవేందర్ మనసు ఎండాకాలపు ఆకాశంలా బోసిగా వుంది

జయ బాబును ఎత్తుకుని అందరికీ చెప్పి భర్త స్కూటరు వెనక కూర్చుంది స్కూటర్ స్టార్ట్ అయింది

మనసులో అనుకున్నాడు 'జయ తననెందుకు పలకరించలేదు పోనీ తానుకూడా ధైర్యంచేసి ఎందుకు మాట్లాడలేదు చిన్ననాటి మిత్రులు మిత్రులుగా కలసి ఉండటానికి వీల్లేదా పలకరించుకోవడం కూడా తప్పా?'

కనుచూపు మేర దాటిపోయిన స్కూటర్ వెనక కూర్చున్న జయ మనసులో కూడా సరిగ్గా ఇదే ప్రశ్నలు తలెత్తాయి

స్వేచ్ఛగా మాట్లాడుకోవటానికి వీలులేని ఈ సమాజం యొక్క వికారాలను చూసి రాఘవేందర్‌కు కోపమొచ్చింది

అయిదు సంవత్సరాలు ఒక జీవితకాలంపాటు నిలిచిపోయేంతటి అనుభవాలను కలిసి పంచుకున్న మిత్రులు మాట్లాడుకోవటానికి వీలులేని పరిస్థితులను కలిపించిన ఈ సమాజం అడుగడుగునా నర నరాల్లోనూ మనస్సులోనూ పెంచి పోషింపబడుతున్న ఈ అడ్డ గోడలు రాఘవేందర్ మనసును ఎంతో కుంగదీసి కలచివేసాయి □



V.V.D

ఊహాలలో విహరించే
నవయౌవన సుందరాంగి
ఆమె హృదయాన్ని దోచుకున్నది ఎన్నెన్నో.
అల్లనల్లన సాగే అందాల సెలయేరు
హాయి హాయిగ వీచే చల్లని మలయ మారుతం
హృదయాన్ని చూరగొన్న సొగసైన చెలికాడు
రంగు రంగుల కోమల కుసుమాలు
నిగ నిగలాడే సుదీర్ఘ శిరోజాలు
ఆ శిరోజాలకు
వి.వి.డి. కొబ్బరి నూనె

VVD-3/86 R




**వి.వి.డి.కొబ్బరి నూనె**

*సహజ శిరోజాల యౌవన రహస్యం*

V.V.D





# సీరియల్
# ఆరోహణ
## శైలకుమార్



(గత సంచిక తరువాయి)

ప్రభాకర్ రూములో కూర్చుని వున్న రేఖకు చాలా విసుగ్గా వుంది రాత్రికి తనని రమ్మని రూము తాళం ఇచ్చి ఎక్కడికి వెళ్ళాడు ఎప్పుడూ ఇలా చెయ్యలేదు ఏదో కారణం వుంటుంది అనుకుంది

ఏమీ తోచక ఎదురుగా షెల్ఫులో వున్న పుస్తకాలు పరిశీలించ సాగింది ఆమె దృష్టి ఓ పుస్తకం మీద ఆగింది అది ప్రభాకర్ డైరీ చేతిలోకి తీసుకుంది డైరీ చదవాలని అనిపించింది మరొకరి డైరీ చధవటం, వ్యక్తి గత విషయాలు తెలుసుకోవాలనుకోవటం సంస్కారం కాదు

సమాజంలో ప్రతి వ్యక్తికి ఎదుటి మనిషి వ్యక్తిగత విషయాలు తెలుసుకోవాలన్న కోరిక ఎంతో వుంటుంది. అవకాశం వస్తే తప్పకుండా ఆ ప్రయత్నం చేస్తారు డైరీలు చదవటం కూడ అందులో ఒక భాగం. నలుగురిలోనూ ఎంతో సంస్కారపు ముసుగు వేసుకుని నటించే మనుషులు ఏకాంతంగా వున్నప్పుడు ఎంతో వింతగా ప్రవర్తిస్తారు ఏకాంతంగా వున్నప్పుడు ప్రవర్తించే తీరే ఆ మనిషిలోని నిజమైన లక్షణాలను బయట పెడుతుందేమో.

డైరీ చదవ సాగింది రేఖ. ఒక పేజీదగ్గర ఆగి ఆశ్చర్యంగా చదివింది. మళ్ళీ మళ్ళీ చదివింది అది సరిగ్గా ప్రభాకర్ తల్లి మరో పురుషుడితో వెళ్ళిపోయిన రోజు ప్రతి సంవత్సరం కూడ ఆ రోజు తానెంత నరకం అనుభవించింది వ్రాసుకునే వాడు ప్రభాకర్ ఊర్లోని అందరూ తనని లేచి పోయిన దాని కొడుకుగా ఎలా పిలిచింది, ఎంత హీనంగా చూసింది, చిన్న వయసులోనే తానెంత బాధకు గురయ్యింది వ్రాసుకున్నాడు ప్రభాకర్

ఆ తరువాత ఏమీ చదవాలనిపించలేదు రేఖకు డైరీ మూసి యధా స్థానంలో వుంచింది. స్త్రీపట్ల ప్రభాకర్‌కు ఎందుకంత తేలిక దృష్టి వుందో అర్ధమైంది రేఖకు అతని మీద విపరీతమైన జాలి కలిగింది

తలుపు చప్పుడు కావటంతో లేచి తలుపు తీసింది. తూలుతూ గదిలోకి అడుగుపెట్టాడు ప్రభాకర్ అతని దగ్గర నుంచి గుప్పు గుప్పున బ్రాందీ వాసన

'ఎంతసేపైంది వచ్చి" అడిగాడు

"చాలా సేపైంది వెళ్ళి పోదామనుకుంటూ వుండగా వచ్చావు

ఏం చెయ్యను, దారిలో ఒక మిత్రుడు తగిలి బార్‌కు తీసుకెళ్ళాడు" లుంగీ కట్టుకుంటూ అన్నాడు ప్రభాకర్

**జరిగిన కథ –11:** నీలిమ ఎడబాటు వల్ల కలిగిన నిరాశతో తిరుపతి వదలి మద్రాసు చేరిన చక్రవర్తికి మద్రాసులోనూ నిరాశే ఎదురవుతుంది ప్రముఖ డైరెక్టర్ సత్యం దగ్గర అవమానం, నిర్మాతల దగ్గర అవమానం, మోసం, శశాంక మీద అపనమ్మకం వంటి అనుభవాలతో చక్రవర్తి నిరుత్సాహ పడతాడు చక్రవర్తి దగ్గర డబ్బు అయిపోయిందని తెలిసి శశాంక పారిపోతాడు చక్రవర్తికి ఆత్మహత్య చేసుకోవాలన్నంత నిరాశ కలుగుతుంది సరిగ్గా ఆ సమయంలోనే తిరుపతిలో చక్రవర్తి ఆదరణను చవిచూసిన రవి కలుస్తాడు రవి తోడ్పాటుతో సినీరంగంలోకి ప్రవేశించడానికి చక్రవర్తికి అవకాశం దొరుకుతుంది

"ఎందుకిలా తాగుతావు ప్రబాకర్".

'ఏం కట్టుకున్న దానిలా అడుగుతున్నావే".

"కట్టుకున్న దానికే తప్ప నాకేం హక్కు లేదంటావా"

"నా మీద ఏ హక్కూ నేను ఎవ్వరికీ ఇవ్వను" రేఖను దగ్గరకు లాక్కుంటూ అన్నాడు

"నువ్వివ్వకుండానే తీసుకుంటే" అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అంది చిలిపిగా

ఏం ఆశపడుతున్నావ్"

'లేదు నువ్విలా తాగి చెడిపోతున్నావని బాధపడుతున్నాను' అంది రేఖ

"రేఖా నాలోని ఒంటరితనాన్ని పోగొట్టు కోవటానికే తాగుతున్నాను' నిరాశగా అన్నాడు

"ఎవరినైనా తోడు తెచ్చుకోవచ్చుగా"

"అంటే పెళ్ళి చేసుకోమనా నీ ఉద్దేశ్యం"

'అవును' అన్నట్టు తల ఆడించింది రేఖ

"ఆడదంటే నాకు అసహ్యం. ఆడది కేవలం రాత్రిపూట ఇందుకు తప్ప మరిదేనికీ పనికిరాదు '

'ఎంత మాటన్నావు ప్రభాకర్! ఎప్పుడో ఏదో జరిగితే దానికి కారణాలు ఆలోచించక ఆడవాళ్ళందరినీ అసహ్యించుకోవటం చాలా అన్యాయం" బాధగా అంది రేఖ దూరం జరుగుతూ

అనుమానంగా చూశాడు రేఖవైపు ప్రభాకర్ మత్తుదిగుతున్నట్టు అనిపించింది

ఏదో జరిగిందని నీకెలా తెలుసు "

"ఎలా తెలిస్తే ఏం నీకు చెప్పేది ఒక్కటే, అందరు ఆడవాళ్ళు చెడ్డవాళ్ళు కాదు మంచి అమ్మాయిని చూసి భార్యగా తెచ్చుకో"

"ఎలా తెలుసునీకు" ఆమె మాటలు వినిపించుకోకుండా భుజాలుపట్టి కుదిపివేస్తూ అడిగాడు తాను తన తల్లి విషయం చెప్పింది ఒక్క చక్రవర్తికే చక్రవర్తి చెప్పాడా

రేఖ మాట్లాడలేదు

'అడిగింది నిన్నే కఠినంగా అన్నాడు

'నీ డైరీ చదివాను" తలవంచుకుని చెప్పింది

"ఇడియట్" రేఖ చెంప చెళ్ళుమంది ఆ విసురుకు మంచంమీద పడింది రేఖ ఎర్రగా కందిపోయింది ఆమె చెంప కళ్ళనుండి బొటబొటా కన్నీళ్ళు జారగా చేత్తో చెంపను పట్టుకుంది రేఖ

ఎంతధైర్యం నీకు డబ్బుకు శరీరాన్ని అమ్ముకునే నువ్వు నాకు నీతులు చెబుతున్నావా" కళ్ళల్లో నిప్పులు కురిపిస్తూ అన్నాడు

ఎంతో బాధ, ఎంతో ఆవేశం కలిగించాయి ఆ మాటలు రేఖకు

ఔను ప్రభాకర్ నేను అమ్ముడు బోతున్నాను కాని ఎందుకోతెలుసా? నావాళ్ళు వీధుల్లో నిలబడి అడుక్కోవటం ఇష్టంలేక నాలా పెళ్ళి కెదిగిన నా చెల్లెళ్ళు తయారు కావటం ఇష్టంలేక అంతే కాని లక్షలు సంపాదించాలనికాదు

కోరికలు అపుకోలేకాకాదు"కన్నీరు కారుతూ వుండగా చెప్పింది రేఖ

ప్రభాకర్‌లో కోపం కాస్త తగ్గింది మౌనంగా కుర్చీలో కూర్చున్నాడు.

"ఒక మనిషి దిగజారటానికి కారణం పరిస్థితి, ఆర్థిక సమస్యల వత్తిడి ప్రభాకర్ పెళ్లి చేసుకోవాలని, భర్తతో హాయిగా కాపురం చెయ్యాలనీ, చక్కగా పిల్లలను పెంచాలని నాకూ ఎన్నో కోరికలున్నాయి కాని ఏం చెయ్యను "

కన్నీరు తుడుచుకుంది రేఖ

"నా తల్లి విషయంలో ఇవేవీ కారణాలు కావు రేఖా" చిన్నపిల్లవాడిలా చూస్తూ అన్నాడు ప్రభాకర్

"కావచ్చు ఏదో బలమైన కారణం లేనిదే ఏ మనిషీ తప్పు చెయ్యదు నాకీ ఉద్యోగం ఎలా వచ్చిందో తెలుసా నా బంగారు కలలన్నీ నాశనం చేసుకుంటే వచ్చింది పురుషస్పర్శ ఎరుగని నా శరీరం ఇష్టంలేకుండా ఓ వ్యక్తి చేతుల్లో నలిగిపోయినందుకు వచ్చింది అతను లంచంగా నా శరీరం కోరాడన్న విషయం నా తల్లికి చెబితే ఏమందో తెలుసా అంటూ ప్రభాకర్ కళ్ళల్లోకి చూసింది రేఖ

అతను ఏమీ మాట్లాడలేదు అతనికి రేఖ ఏదో కొత్తగా కనిపిస్తోంది

"నీ ఇష్టం తల్లీ! ఇందరి ప్రాణాలు కాపాడుతావో నీ శరీరం కాపాడుకుంటావో నీ ఇష్టం' అంది అందుకు నేనామెను అసహ్యించుకోలేదు. రాత్రంతా నలిగి వచ్చిన నాతో ఈ విషయం ఎవరికి తెలుస్తుంది తల్లీ' అంటూ తలస్నానంతో పాటు తప్పునూ కడిగి వెయ్యాలని ప్రయత్నించింది అందుకూ నేనామెను అసహ్యించుకోలేదు. జాలిపడ్డాను.' తాపీగా చెప్పింది రేఖ.

వింటున్న ప్రభాకర్ కళ్ళల్లో తీలగా తడి రేఖపట్ల ఎంతో జాలి కలిగింది అతనికి లేచి రేఖ దగ్గరగావచ్చి ఆమె ముఖాన్ని చేతులలోకి తీసుకున్నాడు

"అయాం సారీ రేఖా" అన్నాడు మనస్ఫూర్తిగా

జాలిగా అతన్ని దగ్గరకు తీసుకుని ఎదకు హత్తుకుంది రేఖ

"ఒకరి కారణంగా అందర్నీ అసహ్యించుకోవద్దు ప్రభాకర్."

"మనసులో నాటుకున్న భావాలు అంత తేలిగ్గా పోవు రేఖా' సౌమ్యంగా అన్నాడు ప్రభాకర్

'ప్రయత్నిస్తే సాధ్యంకానిదేదీ లేదు ప్రభాకర్.'

ఆప్యాయంగా ఆమెను కౌగలించుకున్నాడు ప్రభాకర్

ఇద్దరిలోనూ ఏదో పెద్ద బరువు దిగి పోయినట్లు భావన

"నువ్వు చక్రవర్తిని ప్రేమించావా" ఆమె కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగాడు ప్రభాకర్ గుర్తువచ్చి

'లేదు ఆరాధించాను' అంది మైకంగా

మరి ఎప్పుడూ అతన్ని సూటి పోటి మాటలు అనేదానివి

'అతను నాకు అందలేదన్న బాధ, కసి అందుకు" నిజాయితీగ పలికింది రేఖ



## ఆరోహణ

అమెను మరింత దగ్గరకు తీసుకున్నాడు ప్రభాకర్ అతనిలో రాజుకుంటున్న కోరిక దిగిన మత్తును మరింత పెంచుతున్న రేఖ చూపులు ఆవేశంగా ఆమె పెదవులు అందుకున్నాడు పెనవేసుకుంటున్న శరీరాలను చూడలేక లైటు ఆరిపోయింది

★ ★ ★ ★ ★ ★

పార్థసారథి బొంబే నుంచి రాగానే చక్రవర్తి కథ తయారు చేశాడన్న విషయం చెప్పాడు రవి. స్టోరీ డిస్కషన్ కోసం అట్లాంటిక్ హోటల్లో రూము బుక్ చేశాడాయన

కారుదిగి హోటలు రిసెప్షనులోకి అడుగు పెట్టారు రవి, చక్రవర్తి.

'బావున్నారా సార్' చక్రవర్తిని పలకరించాడు కిరీటి ఎదురొస్తూ

"బావున్నాను" నవ్వుతూ చెప్పాడు చక్రవర్తి.

"రండి మీ కోసమే ఎదురు చూస్తున్నాం"

"ఈ కంపెనీలో చేరావా కిరీటీ' అడిగాడు చక్రవర్తి

ఔను సార్"

"ఎప్పుడు'

"ఈ మధ్యనే"

"ఏం రాంబాబును వదిలేశావా"

"ఔనండీ ఆయన పని చేయించుకుంటాడేగాని డబ్బు ఇవ్వడు' వ్యంగ్యంగా అన్నాడు కిరీటి

ముగ్గురూ గదిలోకి అడుగు పెట్టారు చక్రవర్తి వచ్చినట్టు పార్థసారథికి ఫోన్ చేశాడు కిరీటి వెంటనే వస్తున్నట్టు సమాధానం చెప్పాడాయన

'గుడ్‌లక్ సార్ పార్థసారథిగారికి మీ కథ నచ్చాలి' అన్నాడు కిరీటి.

"థాంక్స్'

పార్థసారథి, డైరెక్టరు త్రిమూర్తి, మరో ఇద్దరు ఆ గదిలోకి ప్రవేశించారు లేచి నమస్కరించారు రవి, చక్రవర్తి చక్రవర్తిని డైరెక్టర్ త్రిమూర్తికి పరిచయం చేశాడు పార్థసారథి.

కాఫీ టిఫెన్లు వచ్చాయి. రచనల ఫైలును చక్రవర్తికి అందించాడు పార్థసారథి

'కొన్ని బాగా నచ్చాయి నాకు అన్నాడాయన

"థాంక్సండి మీకు నచ్చటం నా అదృష్టం

నవ్వి కాఫీ అందుకున్నాడు పార్థసారథి



కథకన్నా కథ చెప్పే విధానం ముఖ్యం అన్న శశాంక మాటలు గుర్తొచ్చాయి చక్రవర్తికి. శశాంకకుమనసులోనే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. మోసంచేసి వెళ్ళినప్పటికీ చాలా విషయాలు నేర్పాడు శశాంక

దాదాపు గంటసేపు కథను వినిపించాడు చక్రవర్తి. కథ పూర్తయిన పది నిముషాలదాకా ఎవ్వరూ మాట్లాడలేదు. ముందుగా పార్థసారథే తన అభిప్రాయం చెప్పాడు

"కథ బావుంది చక్రవర్తీ. వెరైటీగా వుంది సినిమా కోసం కాబట్టి కొన్ని చిన్న చిన్న మార్పులు చెయ్యాలి."

మెల్లగా నవ్వాడు చక్రవర్తి

'ఎలా వుంది" త్రిమూర్తిని అడిగాడు పార్థసారథి

"బావుంది కానీ మీరన్నట్టు కొన్ని మార్పులు చెయ్యాలి. ముఖ్యంగా క్లయిమాక్స్ దగ్గర'

మొత్తానికి కథ అందరికీ నచ్చింది త్రిమూర్తి, పార్థసారథి కొన్ని మార్పుల్ని చెప్పారు. వాటిని నోట్ చేసుకున్నాడు చక్రవర్తి.

'రేపు ఉదయం ఒకసారి ఆఫీసుకు రండి" చెప్పాడు పార్థసారథి

"అలాగేసార్" అని లేచారు రవి, చక్రవర్తి. వాళ్ళను పంపించటానికి కారుదాకా వచ్చాడు కిరీటి.

"రవీ కథ తీసుకుంటారంటావా" దారిలో అడిగాడు చక్రవర్తి

"ఎంతో ఆలోచించిగాని పార్థసారథిగారు తన అభిప్రాయాన్ని చెప్పరు నీ ముందే బావుందన్నారు కాబట్టి తీసుకోవచ్చు బహుశా మనం వచ్చేసింతరువాత ఈ విషయమే డైరక్టర్‌తో చర్చిస్తూ వుండవచ్చు'.

రవి మాటలతో మరింత నమ్మకం కలిగింది చక్రవర్తికి. ఆ రాత్రంతా నిద్రలో అటూ ఇటూ పొర్లుతూనే వున్నాడు అతను కథ తీసుకుంటారన్న నమ్మకం ఏమో ఏమౌతుందో అన్న అనుమానం అతన్ని బాధ పెట్టాయి

మరుసటిరోజు పార్థసారథిని కలుసుకున్నారు ఆఫీసులో చక్రవర్తి గుండె దడదడ లాడుతోంది. పార్థసారథి నిర్ణయం ఎలా వుంటుందో అని.

ఆయనకు ఎదురుగా కూర్చున్నారు రవి, చక్రవర్తి

"కాఫీ తాగుతారా" అడిగాడు పార్థసారథి.

"వద్దండీ ఇప్పుడే తాగాం."

రెండు నిమిషాలు మౌనంగా కూర్చున్నాడు పార్థసారథి మనిషి ఆత్రుతగా వున్నప్పుడు కాలం ఎంత నిదానంగా సాగుతుందో అర్థమైంది చక్రవర్తికి.

"చక్రవర్తీ రాత్రి నేనూ, త్రిమూర్తీ చాలాసేపు మీ కథ మీదే ఆలోచించాం. మాకు బాగా నచ్చింది మాటలు, పాటలు కూడా మీతోనే రాయించాలనుకున్నాం". తాపీగా చెప్పాడు పార్థసారథి

ఆనందం పట్టలేక గుండె ఆగిపోతుందేమో అనిపించింది చక్రవర్తికి రెక్కలు లేకుండా ఆకాశంలో ఎగురుతున్నట్టు, కలలు నిజమైనట్టు భావన సంతోషం పట్టలేక పోతున్నాడు చక్రవర్తి కుర్చీలోంచి లేచి గంతులు వెయ్యాలన్న కోరికను అతి బలవంతంగా అణచుకున్నాడు.

"మీ ఆశీర్వాదం సార్' అన్నాడు ఇంకేమనాలో తెలీక

చక్రవర్తి చేతిని గట్టిగా ఊపేస్తూ కంగ్రాచ్యులేషన్స్ చెప్పాడు రవి

"కామిడీ ట్రాక్‌ను ఇంకొంచెం పెంచాలన్నది మా అభిప్రాయం'

"అలాగే సార్"

బుద్ధిమంతుడిలా ఒప్పుకుంటున్న చక్రవర్తిని చూస్తుంటే నవ్వు వచ్చింది పార్థసారధికి

మేము చెప్పినవన్నీ ఒప్పుకోకండి మీరు బావుంది అనుకున్న దానిమీద గట్టిగా నిలబడి మమ్మల్ని ఒప్పించండి సినిమా అన్నది సమష్టి కృషి. అందరం చర్చించి నిర్ణయించాలి '

తల ఊపాడు చక్రవర్తి అలాగే అన్నట్టు

"మీకు అట్లాంటిక్‌లో కంపెనీ పేరు మీద రూం బుక్ చేశాము సింగిల్ లైను ఆర్డరు రాసేసి రేపట్నుంచి వర్కు మొదలు పెట్టండి. సాయంత్రం త్రిమూర్తి హోటల్‌కు వస్తారు ఆయనతో స్క్రీన్‌ప్లే డిస్కస్ చెయ్యండి. మీకు సహాయంగా అసిస్టెంటు డైరెక్టరు కిరీటి వుంటాడు వివరించాడు పార్థసారథి

'ఈ రాత్రికే డైలాగ్ వర్షన్ మొదలు పెడతాను"

తొందరేంలేదు చక్రవర్తి మీకు కావలసిన టైము తీసుకోండి ఆలస్యమైనా మనకు వర్కు బావుండాలి '

తప్పకుండా సార్ నాశక్తంతా కేంద్రీకరించి వ్రాస్తాను మొదటి సినిమాలోనే పేరు తెచ్చుకోవటానికి ఎంత కృషి చేయాలో అంతా చేస్తాను నిజాయితీగ అన్నాడు చక్రవర్తి

మీ మీద నాకా నమ్మకం వుంది "

అది నా అదృష్టం

'డైలాగ్ వర్షన్ పూర్తయితే సాంగ్ సిట్యుయేషన్స్ చూసుకుని మ్యూజిక్ సిట్టింగు పెట్టుకుందాం

తల ఊపాడు చక్రవర్తి అతనికి అదంతా నిజమా అనిపిస్తూ వుంది

నాలుగువేల రూపాయలు తీసి చక్రవర్తికి అందించాడు పార్థసారథి

"ఇది అడ్వాన్సుగా వుంచండి'

చాలా కాలం తర్వాత అంత డబ్బు కళ్ళ చూశాడు చక్రవర్తి పార్థసారథి ఆదరణకు అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి

అన్నిటికీ కలిపి ఆయన ఇస్తానన్న మొత్తం విని మరింత ఆశ్చర్యపోయాడు చక్రవర్తి అది అతను ఊహించిన దానికన్నా చాలా ఎక్కువ

అన్నీ అనుకున్నట్లు జరిగితే ఈ నెలాఖరుకే షూటింగ్ స్టార్ట్ చేద్దాం ఆర్టిస్టులను కూడా రాత్రే అనుకున్నాం తిరిగి చెప్పాడు పార్థసారథి

ఎవరుసార్ ఆత్రుతగా అడిగాడు చక్రవర్తి

హీరోయిన్ సబ్జెక్టుకదా అందుకని కీర్తన గారనుకుంటున్నాం డేట్సు కోసం ప్రొడక్షన్ మేనేజరు వెళ్ళాడు

చాలా ఆనందం కలిగింది చక్రవర్తికి కీర్తన చాలా మంచి నటి అందరికన్నా ఎక్కువ పారితోషికం తీసుకునేది ఆమే తెలుగు ప్రేక్షకులను తన అందంతోను, నటనా చాతుర్యంతోను ఉర్రూతలూపుతూ సినిమా రంగంలో శిఖరాగ్రంలో వున్ననటి ఆమె తన మొదటి చిత్రంలోనే ఆమె నటిస్తున్నందుకు పొంగిపోయాడు చక్రవర్తి

ఇక అంతా మీ చేతుల్లో వుంది అన్నాడు నవ్వుతూ పార్థసారథి

నాదేముందిసార్ అంతా మీ నమ్మకం, మీ ఆశీర్వాదం'

ఆ మధ్యాహ్నమే హోటలు గదికి చేరుకున్నాడు చక్రవర్తి వ్రాసుకోవటానికి కావలసిన కాగితాలు, కలం మొదలైనవన్నీ అప్పటికే తెచ్చిపెట్టాడు కిరీటి

డబుల్‌రూం కావటంవల్ల బాగా విశాలంగా వుంది గది ఫోన్‌తో సహా అన్ని సౌకర్యాలూ వున్నాయి రాత్రి వరకు రాయబోయే సీన్ల గురించి ఆలోచిస్తూ వుండిపోయాడు చక్రవర్తి

'సార్ భోజనం తెప్పించనా' అడిగాడు కిరీటి

వద్దు కిరీటీ నువ్వు భోంచేసిరా

అదేమిటిసార్ మీరు భోంచేయకుండా

కడుపు నిండితే నిద్రొస్తుంది కిరీటీ కాస్త ఆకలిగా వుంటేనే మెదడు ఆలోచించేది నవ్వుతూ చెప్పాడు చక్రవర్తి

హోటలులో చేరగానే అందరూ ప్రొద్దున్నే తింటారు మీరు భోజనమే వద్దంటున్నారు

"నువ్వు భోంచేసి నాకు ఫ్లాస్కునిండా టీ, సిగరెట్ ప్యాకెట్లు తెప్పించు

కిరీటీ భోజనం చేసి టీ, సిగరెట్లు తెప్పించి పెట్టాడు

కిరీటీ శశాంక కనిపించాడా ఎక్కడైనా

' లేదండీ

సిగరెట్ వెలిగించి పొగ పీల్చాడు చక్రవర్తి

మొదటి సీను వ్రాయటానికి కూర్చున్నాడు

'కిరీటీ ఇన్నాళ్ళు అవకాశం రాలేదని బాధ పడేవాడిని తీరా అవకాశం వచ్చాక ఏదో భయంగా వుందయ్యా

భయం ఎందుకుసార్ మీరు రాయగలరు చాలా బాగా వ్రాయగలరు నమ్మకంగా అన్నాడు కిరీటి

కాగితం మీద కలం పెట్టబోయాడు చక్రవర్తి కళ్ళ ముందు నీలిమ కదలాడింది ఒకనాడు డైలాగుల గురించి ఆమె చెప్పిన విషయాలు జ్ఞాపకం వచ్చాయి

(ఇంకా ఉంది)

# కార్టూనిస్టులకు సూచనలు !

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ **వెనుక** కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి !

★ వ్యాఖ్య **చిన్నదిగా, క్లుప్తంగా** వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి ! కార్టూన్ **మీదే** పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి కాపీ కార్టూన్‌లు పంపరాదు.


విడుదలయ్యాయి!

ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి
కల్పతరువు
(డైరెక్ట్ నవల)
వెల రూ 25/-

ఆర్ సంధ్యాదేవి
సిందూర గంధాలు
(డైరెక్ట్ నవల)
వెల రూ 25/-

లల్లాదేవి
బ్లడ్ సక్కర్
(డైరెక్ట్ నవల)
వెల రూ 25/-

జి వి సుబ్బయ్య
బ్లడ్ ఫర్ రివెంజ్
డిటెక్టివ్ రాజేంద్ర అడ్వెంచర్
వెల రూ 25/-

శ్రీ శ్రీనివాస పబ్లిషింగ్ హౌస్
ఏ.టి.అగ్రహారం గుంటూరు-522004



మూడవ నెంబరు స్తూపం



మహాస్తూపం

# బౌద్ధ శిల్పకళకు కాణాచి సాంచీ

వందల సంవత్సరాలుగా ప్రకృతి వైపరీత్యాలకు మతోన్మాదుల దుశ్చర్యలకు తట్టుకొని తన అస్తిత్వాన్ని నిలుపుకొని నిలబడగలిగిన బౌద్ధ స్తూపాలు శిల్పాలు మన దేశంలో వున్నాయంటే, అవి సాంచీ స్తూపాలనే చెప్పాలి మన దేశంలో వున్న బౌద్ధ స్తూపాలన్నింటిలోను శిల్పకళా నైపుణ్యానికి ప్రఖ్యాతి గాంచినవి సాంచీ స్తూపాలు అవి నేటి మధ్యప్రదేశ్ రాష్ట్ర రాజధాని నగరమైన భోపాల్‌కు 70 కిలోమీటర్ల దూరంలో వున్నాయి ఈనాడు సాంచీ ఒక చిన్న గ్రామం ఇక్కడ సుమారు 91 మీటర్ల ఎత్తు కలిగిన కొండపై ఈ స్తూపాలు ఆరామాలు బౌద్ధమత చరిత్రకు శిల్పకళకు ప్రత్యక్ష సాక్ష్యంగా విరాజిల్లుతున్నాయి

మద్రాసు- ఢిల్లీ రైలు మార్గంలో సాంచీ రైల్వేస్టేషన్ వుంది ఇక్కడ ఎక్స్‌ప్రెస్ రైళ్ళకు "స్టాప్" లేనందున భోపాల్‌లో దిగి బస్సులో సాంచీ చేరుకోవచ్చు. విదిశ పట్టణం సాంచీకి 9 కిలోమీటర్ల దూరంలో వుంది. కొండపై వున్న ఈ స్తూపాలు చుట్టుపక్కల ఎన్నో మైళ్ళవరకు కనపడుతూ నేత్రానందం కలిగిస్తాయి. ప్రస్తుతం ఇక్కడ మూడు స్తూపాలు మాత్రమే కనిపిస్తాయి మిగిలిన కట్టడాలన్నీ శిధిలమై పోయాయి వీటిలో మహాస్తూపం శిల్పకళకు ప్రఖ్యాతి గాంచింది పురావస్తు పరిశోధన శాఖ పర్యవేక్షణలో వున్న జాతీయ ప్రాధాన్యత గల చారిత్రక కట్టడాలలో సాంచీ స్తూపం" ఒకటి

సాంచీ అసలు పేరు చైత్యగిరి ఒకనాడు బౌద్ధ సంస్కృతీ కేంద్రంగా విలసిల్లిన సాంచీ ఈనాడు తన ప్రాచీన వైభవాన్ని తనలో ఇముడ్చుకుని యాత్రికులను దీనంగా పిలుస్తోంది బుద్ధుడు నిర్యాణం పొందిన తర్వాత ఆయన శరీర అవశేషాలను వుంచి బౌద్ధమత ప్రచారం కోసం మౌర్య అశోకుడు 84000 స్తూపాలను నిర్మింప జేశాడని బౌద్ధ గ్రంథాలు పేర్కొంటున్నాయి వాటిలో సాంచీ సారనాద్ బార్హూత్ స్తూపాలు సుప్రసిద్ధమైనవి

## నిర్మాణక్రమం

సాంచీ స్తూపాల నిర్మాణం క్రీస్తుపూర్వం 3వ శతాబ్దం నుంచి (అశోకుని కాలం నుంచి) క్రీస్తుశకం 12వ శతాబ్దం వరకు కొనసాగింది అంటే మౌర్య, శుంగ తూర్పుమాల్వా, క్షాత్రపుల మొదలైన రాజుల కాలంలో ఈ నిర్మాణం కొనసాగింది అశోకుని కుమారుడైన మహేంద్రుడు బౌద్ధమత ప్రచారం నిమిత్తం సింహళం వెళ్ళేటప్పుడు ఇక్కడ ఒక నెల రోజుల పాటు విడిది చేయడం ఈ ప్రాంతం యొక్క ప్రాధాన్యతను తెలియ జేస్తుంది అశోకుని కాలం నుంచే గొప్ప బౌద్ధ క్షేత్రంగా పరిఢవిల్లిన సాంచీకి బుద్ధుని జీవితానికి (ఆయన బతికి వున్న రోజులలో) ఎలాంటి ప్రత్యక్ష సంబంధం లేకపోవడం ఆశ్చర్యకరం క్రీస్తుశకం 7వ శతాబ్దంలో మన దేశాన్ని సందర్శించిన చైనా యాత్రికుడు అయిన హుయన్‌సాంగ్ కూడా తన రచనలలో సాంచీని గురించి ఎక్కడా పేర్కొనక పోవడం అత్యంత శోచనీయం గొప్ప వర్తక కేంద్రమైన విదిశనగరం

ముక్కలైన అశోకుని శిలాస్తంభం



గుప్తరాజుల కాలంలో నిర్మించ బడిన ఆలయం



సాంచికి సమీపంలో వుండడం చేత, అక్కడి వర్తకులు సాంచీ బౌద్ధ సంస్థలకు పెద్ద ఎత్తున దాన ధర్మాలు చేయడం వల్ల సాంచీ పరిపూర్ణమైన బౌద్ధక్షేత్రంగా వర్థిల్లినది.

## మహా స్తూపం

శిఖరాగ్ర భాగాన అన్నింటికన్నా పెద్దదిగా వున్న స్తూపం ప్రధాన స్తూపంగా చెప్పబడుతుంది. ఈ స్తూప నిర్మాణం అశోకుని కాలంలో నే ప్రారంభమైనా శుంగరాజులు ఆ కట్టడాన్ని విస్తృత పరిచారు. ఆటు పిమ్మట ఆంధ్ర శాతవాహనులు దీనిని క్రీస్తు శకారంభంలో ప్రాకార తోరణాదులతో అలంకరించారు. ఈ స్తూపం ఇటుకలతో నిర్మించబడి చుట్టూ పైభాగం రాతితో పూర్తి చేయబడింది. గుండ్రని వేదిక, అండం, హార్మిక, ఛత్రావళి స్తూప ప్రధాన భాగాలు. స్తూపం చుట్టూ శిలా ప్రాకారం దానికి నాలుగు వైపులా ఎత్తయిన తోరణ ద్వారాలు వున్నాయి. గోళాకృతిలో వున్న ఈ స్తూపం వ్యాసం 121 1/2 అడుగులు కాగా, ఎత్తు 77 1/2 అడుగులు వుంది. ఒక్కొక్క తోరణ ద్వారం ఎత్తు 34 అడుగులు.



ఉత్తర ద్వారం పడమటి స్తంభం పై మలచ బడిన కొన్ని శిల్ప దృశ్యాలు (బుద్ధునికి ఒక కోతి తేనెను సమర్పిస్తున్న దృశ్యాన్ని పై భాగాలలో చూడవచ్చు

ప్రత్యేకత. శిథిల శిల్పాలను కొంత క్రింద వున్న పురావస్తు శాఖవారి మ్యూజియంలో భద్రపరిచారు.

ఒక శిలా స్తంభాన్ని నాటాడు. అయితే ఈ స్తంభాన్ని ఈ ప్రాంత జమీందార్ ముక్కలు ముక్కలుగా చేయించి, ఆ భాగాలను తీసికొని పోయి చెఱుకు రసం తీసే గానుగకు అమర్చడం దురదృష్టకరం. ఆ విధంగా ఆ జమీందార్ అజ్ఞానం వల్ల అశోకుని స్తంభాన్ని కోల్పోయాము. పోయినవి పోగా మిగిలిన ముక్కలను అదే స్థలంలో పురావస్తు శాఖవారు ఒక షెడ్ ఏర్పాటు చేసి పరిరక్షిస్తున్నారు. స్తంభ కిరీటాన్ని పురా వస్తు ప్రదర్శన శాలలో ప్రదర్శనార్థం వుంచారు.

సాంచీలో అనేక ఆరామాల పునాదులు వెలుగులోకి వచ్చాయి. బౌద్ధ భిక్షువుల విశ్రాంతి గృహాలే ఆరామాలు. అయితే వాటి చుట్టూ మనిషి ఎత్తు గడ్డి పెరగడం వల్ల వాటిలో ఇప్పుడు సర్పాలు నాట్యమాడు తున్నాయి. గుప్త రాజుల కాలంలో నిర్మించబడిన తొలి దేవాలయం సాంచీ స్తూపాల వద్దనే వుండడం సాంచీకి మరో ప్రత్యేకత.

## పునరుద్ధరణ

సాంచిలోని అనేక బౌద్ధ కట్టడాలు, వెల కట్టలేని కళాఖండాలు పెద్ద ఎత్తున దుండగుల దాడులకు



బౌద్ధ భిక్షువుల విశ్రాంతి గృహ శిథిలాలు



కొండపై నిర్మించ బడిన ఆధునిక బౌద్ధాలయం

వీటిలో మూటిని శుంగులు నిర్మించగా నాలుగవది ప్రధాన ప్రవేశ ద్వారం అయిన దక్షిణ తోరణ ద్వారాన్ని ఆంధ్రశాత వాహన చక్రవర్తి అయిన రెండో శాతకర్ణి నిర్మింప జేసినట్లు ఈ ద్వారంపై గల ఒక శాసనాన్ని బట్టి తెలుస్తోంది

## శిల్పం

ఈ స్తూప తోరణ ద్వారాలపై రమణీయమైన శిల్ప సంపద దర్శన మిస్తుంది బౌద్ధ జాతక కథలు బుద్ధుని జీవిత విశేషాలు వివరించే శిల్పాలే కాక చెట్లు లతలు మేకలు గుర్రాలు ఏనుగులు మంగళ వాయిద్యాలతో సాగిపోతున్న ప్రజలు మొదలైన దృశ్యాలు ఈ శిల్ప కళలో చోటు చేసుకున్నాయి ఇక్కడ బుద్ధుడు మనుష్య రూపంలో కనిపించడు వజ్రాసనం ధర్మచక్రం పాదాలు త్రిరత్నగుర్తు బుద్ధుని ఉనికని తెలిపే సంకేతాలుగా వాడబడ్డాయి బుద్ధుడు దేవతలకు కూడా సందేశమిస్తున్న ఒక దృశ్యం ఇక్కడ వుంది

ఈ స్తూపం శిల్పాలు గ్రామీణ జీవితాన్ని ప్రతిబింబిస్తూ ప్రకృతికి సన్నిహితంగా వుంటాయి. నిరాడంబరం సహజ సౌందర్యం ఈ శిల్పా

## అశోకుని శిలా స్తంభం

సాంచి మహాస్తూప దక్షిణ ద్వారం వద్ద అశోకుడు

క్రీస్తు శకం 8వ శతాబ్దం నాటి శిథిల దేవాలయం



గురయ్యాయి ఏదో సంపద దనరాసులు లభిస్తాయనే ఆశతో ఇక్కడ స్తూపాలను తవ్వి ధ్వంసం చేశారు సాంచి కట్టడాలను పునరుద్ధరింప జేసి గత వైభవాన్ని కాపాడిన ఘనత ఆంగ్లేయులది

గుప్తనిధి వేటగాళ్ళ దుశ్చర్యలకు అనుభవం లేని పురావస్తు శాస్త్రవేత్తలకు బలి అయిన ఈ స్తూపాల పునరుద్ధరణను మేజర్‌కూలే అనే పండితుడు 1881లో చేపట్టారు కూలే తర్వాత సర్ జాన్ మార్షల్ (1912- 1919) అనే పురావస్తు శాఖాధికారి తిరిగి మరోసారి ఈ కట్టడాలను మరమ్మతు చేశారు ఆ విధంగా సాంచీ వైభవాన్ని సంస్కృతిని గొప్పతనాన్ని చాటించ అంగ్లేయులు

బౌద్ధవాస్తు శిల్ప కళకు ప్రతీక అయిన సాంచీ స్తూపం శిల్పాల గని బౌద్ధమతంపై మౌర్య శుంగ గుప్త వాస్తు కళారీతులపై అభిమానం వున్న వాళ్ళంతా సాంచని దర్శించవచ్చు ఇక్కడ యాత్రికులకు అన్ని సౌకర్యాలున్నాయి విశ్రాంతి గదులు క్యాంటీన్ సౌకర్యాలు కొంత క్రింద వున్నాయి

వ్యాసం ఫోటోలు

– వరికూటి వెంకట సుబ్బారెడ్డి

"కెరోలీన్ .. కెరోలీన్ . !" దాదాపుగా అరుస్తూ, విసురుగా తలుపు తోసుకుని భార్య గదిలోకి ప్రవేశించాడు బర్టన్ అతని ముఖం జేవురించి ఉంది. గదిలో తివాచీమీద కూచుని వయొలిన్ సాధన చేస్తూ సంగీతాబ్ధిలో పరవశించిపోతున్న ఆమె, భర్త హఠాత్తుగా అలా రావడంతో నివ్వెర పోయింది వయొలీన్‌ను, కమానును ప్రక్కన నెట్టేసి, చటుక్కున లేచి నుంచుంది.

'ఏమైందండి?' అంటూ ఖంగారుగా. అతనొక్కమారు ఆమెను ఎగాదిగా చూసాడు. పెళ్లయి అయిదేళ్ళు గడిచాక, మొట్ట మొదటి సారిగా భార్యను, ఓ కొత్త వ్యక్తిని చూసినట్టు! అతని చూపులో నిర సనా, అసహ్యమూ పోటీ పడుతున్నాయి.

"వాట్ హేపెండ్ డియర్?" అతని దగ్గరగా వెళ్లి భుజంమీద చెయి వేసి అడిగింది ఆందోళనవల్ల ఆమె కంఠం వణికింది

"చాల్చాల్లే, నీ కపట ప్రేమను కట్టిపెట్టు. మాది ప్రేమ వివాహం అని పదిమందికీ చెప్పుకుని పొంగిపోతూ వచ్చా నిన్నాళ్ళూ! ఛీ. ఛీ. ఇవ్వాళ

"సెభాష్! నువ్వు నిలదీసి అడిగితే జంకి నేను లెంప లేసుకుని నిన్ను సీతమ్మవారిగాను, ఆ రాస్కెల్‌ను జనక మహారాజుగానూ భ్రమపడి పూజిస్తాననుకోకు' హేళనగా అన్నాడతను

ఆ దంపతు లిద్దరూ ఆంగ్లో ఇండియన్లైనా భారతీయ సంస్కృతి - కళలు వారి అభిమాన విషయాలు కావడంతో, వాటిపై పరిశోధన చేసి ఒక్క సంవత్సరం తేడాతో డాక్టరేటు పట్టా పుచ్చుకున్నా రిద్దరూ.

వారి అభిరుచులూ, అభిప్రాయాలూ ఒకటై స్నేహం ప్రేమగా మారి చదువు పూర్తయ్యాక వివాహానికి దారి తీసింది!

'జనక మహారాజు" అని భర్త దెప్పి పొడవడంతో ఆమె ముఖం కందిపోయింది

"ఏమిటండీ, మీ రెవర్ని గురించి మాట్లాడు తున్నారు?' అందామె తీక్షణంగా భర్త కళ్లలోకి చూస్తూ

ఇంకెవడు! ఆ రాస్కెల్, నీకు తండ్రి 'లాటి'వాడు నిన్ను పదిహేనేళ్లప్పటినుంచీ పెంచి పెద్ద చేసి. నీతో ప్రేమాయణం నడిపి, మోజు తీరాక నిన్ను నా

తారస్థాయిలో మ్రోగింది

'మీరు నన్ను కొట్టినా చంపినా నేను వారించను కానీ మాష్టార్ని ఒక్క మాటన్నా నేను సహించను మీ ప్రాణాల్ని నిలువునా తీస్తాను జాగ్రత్త!" ఆవేశంతో ఆమె ఆపాదమస్తకమూ కంపించిపోతోంది

'యూ డెవిల్!" విసురుగా ఆమెను తోసేసి యిక అక్కడుండటం యిష్టంలేక బయటికి కదలబోయాడు.

"ఆగండి!" గర్జించినట్టుగా ధ్వనించిం దామె పిలుపు

"మాష్టారిమీద కారు కూతలు కుయ్యగానే సరిపోలేదు మా పవిత్రమైన అనుబంధాన్ని యింత అసహ్యకరమైన సంబంధంగా మీకు చిత్రించి చెప్పిందెవరో చెబితేగానీ ఊరుకోను" అందామె దృఢంగా, శాసించినట్టు

"ఎవరో చెప్పేదేమిటి? వాడి భార్య స్వయంగా నాకు చెప్పింది. మీ యిద్దరిమధ్యా జరిగే గ్రంథాన్ని తిలకించలేక పాపం ఆవిడ అతన్నుంచి విడిపోయిందట! మరో పెళ్లి చేసుకుని హాయిగా ఉంది యిప్పుడు. ఆవిడ భర్త మన యూనివర్శిటీకి



# తోడిరాగం

సవరూప్‌సిన్హా

తెలిసింది పెళ్లికాక ముందు నువ్వెంతటి గ్రంథం నడిపావో!

ఆమె చేతిని విసురుగా తోసేసాడతను అవాక్కయిపోయిందామె! గుండెను నిర్దాక్షిణ్యంగా పిండేసినట్టూ, ఒక్కసారి ఒంట్లోని రక్తమంతా యింకిపోయి, ఊపిరాడక కొట్టుమిట్టాడుతున్నట్టూ అనిపించిం దామెకు ప్రేమించి పెళ్లాడిన భర్త, అయిదేళ్ళు అన్యోన్యంగా కాపురం చేసి నాలుగేళ్ల పాపకు తల్లి అయింతర్వాత తనపై ఇలా నింద మోపటం విద్యుద్ఘాతంలా తగిలి విలవిల్లాడి పోయిందామె! నుంచున్నచోటే నిస్త్రాణగా కూలబడి పోయింది!

"మాట్లాడవేం? అంత గుట్టుగా సాగిన నీ ప్రేమ వ్యవహారం ఎలా బయట పడిందా! అని ఆలోచిస్తున్నావా?" రెట్టించా డతను. వెటకారంగా కొన్ని క్షణాల స్తబ్ధత తరవాత తేరుకుందామె

"మీ అనుమానానికి కారణం యేమిటో తెలుసుకో వచ్చా?' ఈసారి ఆమె కంఠం ఏ తొట్రుపాటూ లేకుండా స్పష్టంగా ధ్వనించింది

కంటగట్టిన పుణ్య పురుషుడు, ఆ విద్యాధరంగాడిని గురించే!'

ఆమె తన రెండు చెవులను మూసుకుంది 'భగవాన్! ఏమిటి తను వింటున్నది!" ఆమె మస్తిష్కాన్ని అతని మాటలు కాల్చిన సూదుల్లా గుచ్చి బాధ పెట్టాయి

'ఛీ, ఛీ, యేమిటండీ దేవుళ్లాటి మాస్టార్ని పట్టుకుని అంతలేసి మాట లంటారు!" ఆమె గొంతు బొంగురు పోయింది కళ్ళు జలజలా వర్షించాయి

"అవునే! నీకు నిజంగా వాడే దేవుడు మరి! నాకంటే ముందే నీకు సంసార సుఖాన్ని రుచి చూపించి "

మాట పూర్తి కాకుండానే అతని చెంప ఛెళ్ళుమంది! అప్రతిభుడయ్యా డతను క్షణంలో తేరుకుని, ఆమె తలను రెండు చేతుల్తోనూ వడిసి పట్టుకున్నాడు "

"రాస్కెల్, ఎంతకు తెగించావే?నిన్ను నరికి పోగులు పెట్టినా పాపం లేదు ." బలంగా ఆ చెంపా యీ చెంపా వాయించాడు

ఆమెకళ్ళు జ్వాలల్లా మండిపోతున్నాయి! కోపంతో, అవమానంతో, అసహ్యంతో ఆమె గొంతు

ట్రాన్స్‌ఫరై వచ్చాడు అతని ఆహ్వానంమీద వాళ్లింటి కెళ్తే మాటల సందర్భంలో నిజం బయిట పడింది అప్పుడర్థమైంది నాకు పాపకు పట్టుబట్టి వాడిచేత వాడి కిష్టమైన 'ప్రత్యూష' అనే పేరెందుకు పెట్టించావో! మాష్టారి పోషణలో ఉంటే దానికి చదువూ, సంగీతమూ బాగా అలవడతాయని కల్లబొల్లి కబుర్లు చెప్పి నాలుగేళ్ళు నిండగానే వాడి దగ్గ రెందుకు వదిలిపెట్టి వచ్చావో! అది నాకు పుట్టిన బిడ్డ కాదు' అన్నాడు బర్టన్ అసహ్యంగా

కెరోలీన్ నవ్వింది! వెర్రిగా, కన్నీళ్ల మధ్య, గుండెలవిసేలా వెక్కి వెక్కి యేడుస్తూ నవ్వింది

"ఏమిటీ ? ఉష మన బిడ్డ కాదా? చీ. ఒక మందలో కలిపేస్తే పశువులు సులువుగా గుర్తు పడతాయి కదండీ తమకు పుట్టిన కూనల్ని! అందతనివైపు ఏహ్యంగా చూస్తూ

నోర్ముయ్! నోటికొచ్చినట్టు వాగినంతమాత్రాన చేసిన తప్పును కప్పి పుచ్చుకోలేవు అసలు మీ అమ్మా నాన్నా బ్రతికుండగా నీ పదహారోయేట నిన్ను వాడి దగ్గర వదిలెయ్యడ మేమిటి? ఆ తరవాత వాడి

పెళ్లాం వాణ్ని వదిలెయ్యడ మేమిటి? వాడే నిన్ను పెంచి పెద్ద చేసి పెళ్లి చెయ్యడ మేమిటి? వాడికీ నీకూ మహా ఉంటే వయసులో పదేళ్ళు తేడా ఉంటుందేమో! మన పెళ్లికి నీ తల్లి దండ్రులు చుట్టపు చూపుగా రావడం యేమిటి? నీ బండార మంతా బయట పడింది. నేన్నీకు విడాకు లివ్వ దలచుకున్నాను అన్నా డతను కోపంగా

"మీ యిష్టమొచ్చినట్టే చెయ్యండి! కానీ ఒక్క మాట గుర్తుంచుకోండి! పై లోకమనేది ఒకటుందో, లేదో, ఉంటే అక్కడ దేవుడు ఉంటాడో లేదో తెలీదు నాకు నేను 'దేవుణ్ని' ఈ లోకంలో నే చూసాను మా మాష్టార్నిక పల్లెత్తుమాటనకండి మర్యాద దక్కదు!" అందామె స్థిరంగా

"ఛీ అవున్లే, నీ గుట్టు బయట పడ్డాక పూర్తిగా తెగించావు అంతకుమించి యేం చెయ్యగలవు!" విసురుగా అక్కణ్ణించి వెళ్ళిపోయా డతను

ఆ రాత్రి ఆమె వెక్కి వెక్కి యేడిచింది! కన్నీళ్ల మధ్యనే తన గతాన్ని తలచుకోసాగింది-

తన మొట్ట మొదటి సంగీత ప్రదర్శనను పేపర్లో ప్రకటించేటప్పుడు సందేహించింది తను 'కెరోలిన్' అనే పేరు మార్చుకుంటే బావుంటుందేమో మాష్టారూ! పాడేది భారతీయ శాస్త్రీయ సంగీతం. కదా. . నా పేరు పొసగదేమో ..!" అంది. నవ్వేరాయన

"పిచ్చితల్లీ! క్రీస్తు జన్మ దినాన పాడే ఆనంద సంగీతాన్ని 'కేరల్స్" అంటారమ్మా నువ్వు ఆ పవిత్రమూర్తి జ్ఞాపకార్థం ఈ భువిలో ఉద్భవించిన శుభ సంగీతానివి! 'కేరల్' అని నేను నిన్నిప్పుడు పిలుస్తున్నట్టుగా ప్రకటన వేయిద్దాం' అన్నా రాయన

ఆరోజు తను "కుమారి కేరల్"గా భారతీయ సంగీత రసజ్ఞులకు పరిచయం చేయబడింది, మాష్టారి చలవవల్ల! ఈ రోజు తను ప్రఖ్యాత సంగీత విద్వాంసులలో శ్రీమతి కేరల్ బర్టన్‌గా విజయ శిఖరంమీద నివసిస్తున్నదంటే అదీ మాస్టారి చలవే!

* * * * * * * *

ఆ ఉదయం-

"నన్ను గన్న తల్లీ, నా భాగ్యమా!"

ఉషః కిరణాలలో, శీతల పవనాలతో కలిసి మంద్రంగా సాగే సెల యేరులా, మధురంగా వినిపిస్తూంది విద్యాధరం మాస్టారి కంఠం వయొలిన్ నాదంతో కలిసిపోయి! నాదగానాల్లో లీనమైపోయిన ఆయన హఠాత్తుగా ఆగిపోయారు తనతో పాటుగా మరొక తియ్యటి కంఠం గొంతు కలిపి పాడుతున్నట్లనిపించిం దాయనకు! చుట్టూ పరీకించా రాయన ఆయనుండే చిన్న గుడిసెకు ఓ ప్రక్కన పెద్ద డాబా ఉంది మరో ప్రక్కన ఆయన శ్రద్ధగా పెంచి పోషించిన చిన్న పూల తోట ఒకటుంది కనుచూపు మేరలో ఎవరూ కానరాలే దాయనకు! కాసేపాగి మళ్లీ కృతి నందుకున్నా రాయన మళ్లీ అదే తియ్యటి కంఠం తన స్వరంలో లీనమయింది! ఈసారి ఆయన ' ఆపకుండా కొనసాగించారు

ఆయన స్వర కల్పన అందుకునే వరకూ సాగి ఆ కంఠం ఆగిపోయింది.

కృతి పూర్తయ్యాక ఆయన కనురెప్పలు నెమ్మదిగా విడి వడ్డాయి. సంగీత ఝరిలో స్నానమాడి ఆ ప్రవాహం నిమ్మళించాక పూర్తిగా తడిసి తృప్తిగా తలలెత్తిన రాజీవాల్లా ఎదురుగా తన పదేళ్ల పాపతో నుంచుని ఉంది శ్రీమతి మరియా డిసౌజా. ప్రక్కనుండే డాబాలోకి సంవత్సరం క్రిందటే వచ్చి చేరిందామె. ఆమె భర్త విమాన ప్రమాదంలో మరణించాక, తన వాళ్లెవరూ హైదరాబాద్‌లో లేకపోవడంవల్ల, ఆస్తినంతా అమ్మేసి విశాఖలో దూరపు




చుట్టాలుండటం మూలాన హోటల్ బిజినెస్ ప్రారంభించింది సుమారు పదిహేనేళ్ళుగా ఆంధ్రదేశంలో ఉండటం మూలాన ఒక్క తలకట్టు తప్పించి ఆమె మిగతా వేష భాషలన్నీ తెలుగు తనాన్నే ప్రతిబింబిస్తుంటాయి! ఆమె మాస్టారికి వినయంగా నమస్కరించింది ప్రతి నమస్కారం చేస్తూ ఆయన ఆశ్చర్యంగా చూసారామె వైపు ఎందుకంటే ప్రక్కనే సంవత్సరంపాటు ఉంటున్నా ఆమె యెవ్వరితోనూ కలిసే రకం కాదని భార్య ద్వారా విని ఉన్నా రాయన.

మాస్టారికి నమస్కారం చెయ్యితల్లీ!" అందామె కూతురి తల నిమురుతూ

"నమస్తే!" అందా పాప ముద్దుగా పాల నురుగులాటి వర్చస్సు, తేనె రంగు జుట్టు, మెరిసే నీలి కళ్ళు, గులాబీ రంగు చిన్ని నోరూ, చూస్తూనే యెవరికైనా ఇట్టే ముద్దొస్తుందా పాప. మందహాసం చేస్తూ మాస్టారా పాపను దగ్గరకు తీసుకున్నారు ఆమెను కూచోమని ప్రక్క అరుగు చూపించారు

"ఇది నా కూతురు కెరోలీన్ బాబూ! దీనికి సంగీతమంటే తెగయిష్టం. రోజూ మీరు వయొలిన్ సాధన చేసేటప్పుడూ, వేరే వాళ్లకు నేర్పేటప్పుడూ మీ గది గోడ ప్రక్కనే నక్కి శ్రద్ధగా వింటుంది ఇలా సంవత్సరం పాటు వింటూ కాస్త పాడటం కూడా నేర్చుకుంది అప్పుడప్పుడూ, మీరు గమనించారో లేదో గానీ, మీరు సాధన చేసుకునేటప్పుడు ఇదీ మీతో కలిసి వచ్చీ రాని పాటలు పాడుతూంటుంది మీ దగ్గర సంగీతం నేర్చుకుంటానని రోజూ నా ప్రాణం తీస్తూంది" అందామె.

ఆయన చిరునవ్వుతో పాప తలను ఆప్యాయంగా నిమిరారు

"అయితే ఈవేళ నాకు వినిపించిన తేనె కంఠం నీదన్నమాట ఏమ్మా. ! నిజంగా నీకు సంగీతమంటే అంతిష్టమా, నా దగ్గర నేర్చుకుంటావా? గాత్రమూ,

వయొలిన్ రెండూ నేర్పుతాను!'

'. నేర్చుకుంటాను' అందా పాప ఉత్సాహంగా

"కానీ బాబూ," అందామె సందిగ్ధంగా ఆమె వదనాన విషాద ఛాయలు అగుపించా యాయనకు!

"పాపకు పదేళ్ళు నిండినా మాటలు సరిగ్గా రావండీ! కొన్ని అక్షరాలు అసలు పలకలేదు. అసలు దీనికి మాట రావడమే అయిదవయేట మొదలయింది! కానీ అదేం చిత్రమో గానీ, సంగీతాన్ని విన్నప్పుడు మాత్రం, మాట రాక ముందర తన మూడవ యేటి నుంచే కేవలం "ఊ. .. ఊ...!" అన్న శబ్దాలతో కూనిరాగాలు తీస్తూ కరెక్టుగా రాగాలను అనుకరించేది ఇప్పుడు మీరు పాడే కృతుల్లోని పదాలను సరిగ్గా పలకలేదు గానీ, రాగాన్ని మాత్రం ఖచ్చితంగా- పొల్లు పోకుండా పాడుతుంది" అందామె ఆయన పాపను తన యెదురుగా కూచో బెట్టుకుని శృతి అనిపించి స్వర పరీక్ష చేసారు శృతి స్పష్టంగానే పలికింది ఆయన మందహాసం చేస్తూ పాడించారు-

"రామ నన్ను బ్రోవరా!"

'ఆమ నన్ను బ్రోవ ఆ . !" అంది పాప

ఆ తల్లి కళ్ళు చెమర్చాయి "దీనికి 'ర', 'త్రి' లాటి పదాలు పలకడం రాదు బాబూ! కానీ పాడాలన్న తపన ఉంది! ఒక్క నిద్రపోయేటప్పుడు తప్ప ఏదో ఒక రాగాన్ని అస్పష్టమైన పదాలతో పాడుకుంటూనే ఉంటుంది' అందామె కళ్ళు వత్తుకుంటూ.

ఆయన పాపను దగ్గరకు తీసుకుని ముద్దు పెట్టుకున్నారు.

'మీరేం బాధపడకండి పాపను రోజూ ఉదయాన్నే ఓ గంట నా దగ్గరకు పంపుతూండండి అంతా ఆ సరస్వతీదేవి అనుగ్రహం" ఆవిడ మాస్టారికి నమస్కరించి వెళ్ళిపోయింది

ఆవిడటు వెళ్ళగానే ఆయనను భార్య నిలదీసింది-

ఎవరికీ సంగీతం నేర్పుతానంటున్నారు, ఆ నంగి నంగిగా మాట్లాడే కిరస్తానీ పిల్లకేనా?"

"తప్పు పద్మా! అలా అనకూడదు ఆ పసిది ఖచ్చితంగా సరస్వతీదేవి ముద్దుబిడ్డే! నా మనసు చెపుతోంది ఆ పాప పెరిగి పెద్దదై శాస్త్రీయ సంగీత సామ్రాజ్ఞి అవుతుంది

# తోడిరాగం

"ఓ యబ్బో కానివ్వండి, మధ్యన నాకేం? ఇంతకీ ఆవిడ ఫీజెంత యిస్తుందట కనుక్కున్నారా?"

'నేను సంగీతాన్ని యెదుటివారి అభిలాషను చూసి నేర్పుతాను ఎవరికి తోచినంత వారిస్తారే తప్ప నేనేనాడు 'ఇంత' యివ్వమని ఎవరి దగ్గరా వసూలు చెయ్యలేదు ఇవ్వాళేమిటి కొత్తగా అడుగుతున్నావు? అన్నారాయన చిరాకుగా.

"మీ ఉదారబుద్ధి తెలుసులెండి! అయినా ఎందు కడుగుతున్నానంటే ఆవిడేం లేని మనిషి కాదు ఆవిడకుండే ఆస్తికి తోడు, సంపాయించి పెట్ట-డానికి ఆవిడకో ప్రియుడు కూడా ఉన్నాట్ట, తెలుసా?"

"సరేలే, ఆవిడ వ్యక్తిగత విషయాలు మన కెందుకు! ఆవిడ ఫీజిచ్చినా, యివ్వకున్నా నే నా పసిదానికి సంగీతం నేర్పుతాను" అన్నారాయన స్థిర సంకల్పంతో.

"అంతే లెండి. ఇప్పటికీ నేర్పుతున్నారుగా ఊరందరికీ 'ఫ్రీ'గా. మన బ్రతుకు లెప్పుడు బాగు పడ్డాయి గనక!" విసవిసా లోనికెళ్ళిందామె

విద్యాధరంగారొక ప్రయివేటు సంగీత కళాశాలలో అధ్యాపకులు ఆయనకొచ్చే నెల జీతం అంతంత మాత్రమే! పెళ్ళయి అయిదేళ్ళు గడిచినా భర్త సంపాదన గొర్రె తోకను మించలేదని ఆయన భార్య ఎప్పుడూ దెప్పి పొడుస్తూంటుంది. చీటికీ, మాటికీ అతని లేమిని ఎత్తి చూపుతూ కించపరుస్తూం టుందామె! 'సంగీతం పిచ్చి ఉన్న మా నాన్న, మీరేదో ఉత్తములని నన్ను మీ కిచ్చి కట్టబెట్టాడు. మీరింత 'ఉత్తమోత్తము'లని అనుకోలేదు" అని వ్యంగ్యంగా యీసడించుకుంటుంది ఆమె ఎన్ని మాటలన్నా ఆయన పల్లెత్తు మాటనేవారు కారు! ఆయన సంగీత ప్రపంచంలో ఆయనా - ఆయన సంగీతమూ మాత్రమే ఉండేవారు! అంతకుమించి డబ్బు, హోదా, సుఖజీవనం లాటి ప్రాపంచిక విషయాలమీద ధ్యాస ఉండేదికాదాయనకు.

ఆ మరునాడే విద్యాధరం మాస్టారు కెరోలీన్‌కు సంగీతాన్ని నేర్పడం ప్రారంభించారు ఉదయం




అయిదింటికే ఆ పాపకు క్లిష్టంగా ఉండే పదాలను పది, యిరవైసార్లు అనిపిస్తూ, నిపుణుడైన ఒక 'స్పీచ్ థెరపిస్ట్' సలహా మేరకు అనతికాలంలోనే కెరోలీన్ తనకు ఒకప్పుడు గగనంగా అగుపించిన పదాలను సులభంగా పలికేటట్లు చెయ్యగలిగా రాయన! కొన్ని నెలల్లోనే ఆ పాప తన యీడు యితర పిల్లల్లాగా మామూలుగా మాట్లాడగలిగింది ఆ తరవాత రెండేళ్ళకే గాత్రం, వయొలీన్‌లలో తన మిగతా సహాధ్యాయులందర్నీ అధిగమించి సంగీతంలో మొదటిస్థానాన్ని సంపాదించుకుంది.

పరాయి మతం పిల్లమీద భర్త అంత శ్రద్ధ చూపుతూ, ఆ పిల్లను ఉన్నత స్థానానికి తేవడం పద్మావతికి కంటగింపుగానే ఉండేది "పిచ్చిదానా, అనవసరంగా ఆ పసిదాన్ని చూసి ఈర్ష్యపడకు. సంగీత సాహిత్యాల్లాటి కళలు జన్మతః రావాలి గానీ, ఒకరు నేర్పినంత మాత్రాన పట్టుబడవు! నేను చేస్తున్నదంతా 'కేరల్'ను తన గుమ్మం వైపు నడిపించటమే!" అనేవా రాయన

అలా అయిదేళ్ళు గడిచిపోయాయి! కెరోలీన్ తల్లి ఒక ఆంగ్లో ఇండియన్ అతన్ని రెండో వివాహం చేసుకుంది. మరొక సంవత్సరం గడిచాక కెరోలీన్ డిగ్రీ కాలేజీలో చేరింది. అయితే విద్యాధరంగారు ఆ అమ్మాయిలో క్రమంగా ఉదా సీనత చోటు చేసుకోవడం గమనించారు! ఇంతకు మునుపు తన దృష్టి నంతా సంగీతంమీదనే కేంద్రీకరించే ఆ అమ్మాయి, యాంత్రికంగా సంగీత సాధనలో పాల్గొనడం పసిగట్టే రాయన మామూలుగా పదిహేను, పదహారేళ్ళ 'అడాలసెంట్' వయసులో పిల్లలలాగే ఉంటారులే అని సరిపెట్టుకున్నా రాయన ఒక రాత్రి పదకొండు గంటలప్పుడు తలుపు కొట్టిన చప్పుడైతే తెరిచి చూసిన మాస్టారు ఆశ్చర్య పోయారు! ఎదురుగా కెరోలీన్! బాగా యేడిచినట్టు కళ్ళు యెర్రబడి ఉన్నాయి జుత్తు రేగి, దుస్తు లస్తవ్యస్తంగా ఉన్నాయి! ఆయనను చూస్తూనే ఆ అమ్మాయి బావురుమంది ఒక్క ఉదుటున ఆ అమ్మాయిని దగ్గరకు తీసుకుని, తల నిమురుతూ ఓదార్చా రాయన "ఊరుకోమ్మా కేరల్.. ఊరుకో తల్లీ, ఏం జరిగిందో నాకు చెప్పవూ. ?"

"మాస్టారూ, నేనా యింట్లో ఉండలేను. నన్ను దయచేసి యిక్కడే ఉండనివ్వండి!" అందా అమ్మాయి కన్నీళ్ళతో బ్రతిమలాడుతూ.

ఆ తరవాత ఎంతో బ్రతిమాలిన మీదట కారణం చెప్పింది - ఆమె సవతి తండ్రి ప్రవర్తనీమధ్య అసహ్యంగా తయారయిందనీ, రాత్రిళ్ళు తాగి వచ్చి తన వైపు కాంక్షగా చూడటం, అకారణంగా తనను దర్చాపలాడటం, అదను దొరికితే తనపై చెయ్యి వెయ్యడానికి ప్రయత్నించడం చాలా నెలలుగా సాగుతున్నదనీ, చివరికి రోజు తల్లి యింట్లో లేని సమయం చూసి తనపై అత్యాచారం చెయ్య బోయాడనీ.. .! ఇక వినలేనట్లు ఆయన తన రెండు చెవులనూ మూసుకున్నారు. భార్య వైపు చూసారు ఆమె అయిష్టంగానే కెరోలీన్‌ను తన గదిలోకి తీసు కెళ్ళింది.

ఆ మర్నాడు శ్రీమతి మరియను పిలిపించి విషయాన్ని వివరించా రాయన. ఆమె నెమ్మదిగా చెప్పింది -

"సవతి కూతురన్న నిరసనతో నా బిడ్డను నిర్లక్ష్యం చేస్తూ దుర్భాష లాడుతున్నాడనుకున్నానే గానీ, యిలా పశువులా ప్రవర్తిస్తా డనుకోలేదు. బాబు గారూ మీకు చేతులెత్తి మొక్కుతాను. దీన్ని బరువనుకోకుండా చదువైపోయేవరకూ మీ దగ్గరే ఉండనివ్వండి. తల్లినై ఉండీ దానికి మాట నేర్పలేక పోయాను. బాధ్యతను విస్మరించి మరొకణ్ని కట్టుకున్నాను. మీరు మాత్రం మాట రాని దానికి మాట నేర్పడమే కాకుండా సంగీత విద్యను నేర్పి గొప్పదాన్ని చేసారు మీ బిడ్డకంటే మిన్నగా సంగీత విద్యను నేర్పి గొప్పదాన్ని చేసారు. మీ బిడ్డ కంటే మిన్నగా చూసుకున్నారు దానికి తల్లీ, తండ్రీ మీరే అయ్యారు! మరి కొన్నాళ్ళు అలాగే చూసుకోండి. దయఉంచి నా అభ్యర్థనను కాదనకండి" అందామె విలపిస్తూ

ఆయనొక స్థిర నిశ్చయాని కొచ్చి గుండెల్నిండా ఒక్కమారు ఊపిరి పీల్చుకున్నారు.

"కొన్నాళ్ళపాటు కాదమ్మా, నేను బ్రతికున్నంత కాలం కేరల్‌ను నా బిడ్డగా పెంచుకుంటాను మీకు సమ్మతమేనా?" అన్నారు నిదానంగా.

ఆవిడ మొదట నిర్ఘాంతపోయింది. తర్వాత తేరుకుని సంభ్రమాశ్చర్యాలతో ఆయనకు పాదాభి వందనం చేసింది ఆ క్షణం నుంచీ విద్యాధరం మాస్టారు కెరోలీన్‌కు తల్లీ, తండ్రీ అయ్యారు. కొంత కాలానికి శ్రీమతి మరియా, ఆమె భర్తా మరో ఊరు వెళ్ళిపోయారు ఆ తరవాత ఆయనకు భార్య సాధింపు ఎక్కువైపోయింది

ఛీ ఛీ! ఊరంతా నా ముఖాన ఉమ్మేస్తున్నారు 'ఏమ్మా మీ ఆయనెవరో వయసు పిల్లను తెచ్చి యింట్లో పెట్టుకున్నాట్టగా?' అని దెప్పి పొడుస్తున్నారు"

"పోదవనీ, నీకు నిజం తెలుసుగా! బాధ పడ్డం దేనికి?" అన్నారాయన శాంతంగా

"నా మాట వినండీ. దాన్ని యే శరణాలయంలోనైనా వదిలెయ్యండీ! మా అమ్మా నాన్నలు కూడా నన్ను మందలిస్తూ ఉత్తరాలు రాస్తున్నారు మనకుండే అష్ట దరిద్రాలకు తోడీ దరిద్రం కూడా యెందుకు చెప్పండి?

"పద్మా, యీ మాటలు నువ్వన్నావు కాబట్టి వదిలి పెడుతున్నాను ఇదే మరొకరనుంటే నరికి పోగులు పెట్టేవాణ్ణి! కేరల్ నేను బ్రతికుండగా అనాథ యెలా అవుతుంది? ఆ పసిదానికి నేను యింతప్పటిన్నించీ మాటా - పాటా నేర్పాను అది నా బిడ్డ అంతేకాదు ఆ అమాయకురాలిలో నేను, నా తల్లి సరస్వతీదేవిని చూసుకుంటున్నాను! ఏదో ఒకరోజు నా తల్లి భారతీయ సంగీత గగనాన ధృవతార అవుతుంది. తండ్రిగా, గురువుగా నా పేరు చిరస్థాయిగా నిలబెడుతుంది" అన్నా రాయన చెమర్చే కళ్ళతో. ఆ మర్నాడే ఆవిడ ఆయనతో తెగతెంపులు చేసుకుని పుట్టింటికి వెళ్ళిపోయింది ఆయన ఆవిడను తిరిగి రమ్మని యెప్పుడూ అడగలేదు !

* * * * * * * *

గతమంతా కళ్ళ ముందు కన్నీటి పొరల మధ్య మసక మసగ్గా ఒక్కమారు కదిలింది! మంచంపై నుండి లేచి గదిలో లైటు వేసి చూసింది కెరోలీన్. తెల్లవారుఝాము నాలుగ్గంటలైంది! ప్రక్క గదిలో గాఢ నిద్రలో ఉన్నాడు ఆమె భర్త. ఒక నిశ్చయాని కొచ్చినట్టు కాయితం, కలం తీసుకుని కూచుంది-

"బర్టన్‌గారికి,

నన్ను ప్రేమించిన మీరు అనుమానించినందుకు గానీ, పరాయివాళ్ళ మాటలు విని విడాకు లిస్తా నన్నందుగ్గానీ నేను బాధ పడటం లేదు అది మీ స్వభావం అనుకుంటాను! అయితే నిజా నిజాలు తెలుసుకోకుండా, కాళ్ళు కడిగి కన్యాదానం చేసిన ఒక తండ్రిని, తన కూతురిపట్ల చిత్తశుద్ధితో నిర్వర్తించిన అతని బాధ్యతను, నీచంగా ఊహించి వక్రమార్గానికి మళ్ళించినందుకు, విద్యాధికులైనా మీ కుసంస్కారాన్ని నేను అసహ్యించుకుంటున్నాను. మాస్టారు నన్ను పెంచిన తండ్రే కావచ్చు! కానీ ఉండేలు దెబ్బ తినబోయే పావురాన్ని గుండెల్లో పొదుముకుని కాపాడిన ఉత్తములాయన. తన జీవితాన్నే నా ఉన్నతికి త్యాగం చేసిన దేవు డాయన! మా అనుబంధం మీ కర్థం కాదు ఒకసారి మీరన్నారు, గుర్తుందా? 'తోడి రాగంలో అన్నీ కోమల స్వరాలే. అయినా నా కెందుకో ఆ స్వర స్థానాలు పట్టుబడటం లేదు! నాకు వర్ణం నేర్చుకోవడమే కష్టంగా ఉంది. నీవేమో కృతులను అవలీలగా పాడగలుగుతున్నావు!' అని. నిజమే! ఆ రాగాన్ని అర్థం చేసుకుని స్వర స్థానాల్ని అందరూ తేలిగ్గా అందుకోలేరు. అందుకు కోమల హృదయం ఉండాలి. నేను మళ్ళీ కోమల హృదయుడయిన నా తండ్రి దగ్గరకే వెళ్తున్నాను. నా కోసం బ్రతుకు నర్పించిన నా తండ్రికి తోడుగా ఉండటానికి! నా కిప్పుడు యిద్దరు బిడ్డలు; ప్రత్యూష, మాస్టారు."

ఉదయం అయిదు గంటల ప్రాంతాన-

భుజాన చిన్న సంచీ, చేతిలో వయొలిన్ పెట్టెతో వడి వడిగా స్టేషను వైపు నడవ సాగింది కెరోలీన్

"చూడమ్మా కేరల్! నీ కూతురు కూడా నీలాగే తోడిరాగాన్ని యెంత తొందరగా నేర్చుకుంటోందో! తల్లికి తగ్గ కూతురనిపించుకుంటుంది. సందేహం లేదు!"

నాలుగేళ్ళ ప్రత్యూష మొదటిసారే తోడి వర్ణాన్ని తప్పులు లేకుండా ఆలపించినప్పుడు మాస్టారు పొందిన యెనలేని ఆనందం ఆమె కళ్ళ ముందు మెదిలింది. "అది నా గొప్పతనం కాదు మాస్టారూ! మేమిద్దరమూ మీరు కల్పించిన స్వరాలమే. మీలాటి కోమల హృదయులమే!" అనుకుందామె. నెమ్మదిగా పరచుకుంటున్న ప్రత్యూష వెలుగులు ఆమె నూతన జీవితానికి స్వాగతం పలుకుతున్నాయి ☐

## అమెరికాలో భారతీయుల ప్రతిభ!

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో నివసిస్తున్న భారతీయులు తమ ప్రతిభని అద్భుతంగా నిరూపించుకుంటూ ఎన్నో విషయాలలో అమెరికన్‌లని మించిపోతున్నారు అంతకు ముందున్న అ స రా ల వలస విధానాన్ని 1965లో సడలించటంతో ఆ దేశానికి వలస వెళ్ళే వారి సంఖ్య విపరీతంగా పెరిగింది 1980 జనాభా లెక్కల ప్రకారం అక్కడి భారతీయుల సంఖ్య 3,87,223 అది 1985కి 5,25,600 అయింది కేవలం జనాభాలోనే కాకుండా అమెరికాలోని భారతీయులు బాగా సంపన్నులైన, సమర్థత గల, విద్యావంతులైన ఒక వర్గంగా గుర్తింపు పొందారు అమెరికా సంరాష్ట్రాలలోని భారతీయులు అక్కడి వారికి ఆదర్శప్రాయంగా ఉన్నారని 'పాప్యులేషన్ బులెటిన్' పేర్కొన్నది

అమెరికాలోని భారతీయ యువతలో 52 శాతం పట్టభద్రులు 1980 లెక్కలని బట్టి 25-29 సంవత్సరాల మధ్య వయసు గల శ్వేత జాతి అమెరికన్‌లలో ఉన్నత పాఠశాల విద్య పూర్తి చేసిన వారు 87 శాతం ఉంటే భారతీయులు 94 శాతం ఉన్నారు ఆ జనాభా లెక్కలకి వో వారం ముందు ఉద్యోగాలలో ఉన్న, లేదా ఉద్యోగాల కోసం ఎదురు చూస్తున్న శ్వేత జాతి అమెరికన్‌లు 76 శాతం ఉంటే భారతీయులు 84 శాతం ఉన్నారు అక్కడ ఉన్న భారతీయులలో నిరుద్యోగులు కూడా తక్కువే!

1980 అంచనాల ప్రకారం ఉన్నత స్థాయి ఉద్యోగాలలో ఉన్న తెల్లవారు 24 శాతం అయితే భారతీయులు (దానికి దాదాపు రెట్టింపు) 47 శాతం ఉన్నారు 1979 లో అమెరికా సగటు జాతీయ ఆదాయం 19,900 డాలర్లు కానీ అక్కడి భారతీయుల సగటు ఆదాయం 24,990 డాలర్లు ఆదేశంలోని శ్వేత జాతి కుటుంబాల సగటు ఆదాయం 20,800 డాలర్లు. అంటే ఆ దేశం సగటు ఆదాయం కన్నా 5 వేల డాలర్లు పైగా, అక్కడి తెల్లవారి సగటు ఆదాయం కంటే 4 వేల డాలర్లకి పైగా భారతీయుల సగటు ఆదాయం ఉన్నది

అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని భారతీయులలో 17.5 శాతం న్యూయార్క్, 15.4 శాతం కాలిఫోర్నియా, 9.7 శాతం ఇల్లినాయి 7.9 శాతం న్యూ జెర్సీ, 6 శాతం టెక్సాస్ రాష్ట్రాలలో, మిగతా వారు మిగిలిన 45 రాష్ట్రాలలో కొద్ది కొద్దిగా ఉన్నారు

ఈ వివరాలన్నీ 1980లో సేకరించిన అమెరికా సంరాష్ట్రాల జనాబా లెక్కలని బట్టి తేలినవి ఈ ఆరేళ్లలో అక్కడ ఉన్న భారతీయులు మరెంతో అభివృద్ధి సాధించి ఉంటారని నిస్సందేహంగా చెప్పవచ్చు

(ఒ వి.)




# బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

## పాఠకుల ప్రశ్నలకి బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్య ప్రముఖుని సమాధానాలు

**యస్. వేణు, మచిలీపట్నము**

ప్ర: తలపై, చర్మముపై పొట్టులాగ రావటము.

జ: బైద్యనాథ్ రక్తశోధకబటి టాబ్‌లెట్స్, బైద్యనాథ్ సురక్తా స్ప్రాంగుతో సేవించండి. తలకు సమ్మర్ కటింగుకానీ బోడిగుండుగానీ చేసి బైద్యనాథ్ తువరకతేల్ మరియు బైద్యనాథ్ నీమ్‌తేల్ కలిపి తలకు రాయాలి. బైద్యనాథ్ మహా భృంగరాజతేల్ (మెడికేటెడ్) తలనూనెగావాడండి

**సి. శ్రీధర్, తాడిపత్రి**

ప్ర: మొటిమలు, మచ్చలు.

జ: బైద్యనాథ్ సురక్తా స్ప్రాంగ్ విడవకుండా రెండు మూడు నెలలు వాడండి. వేడిచేసే పదార్థములు తినకూడదు.

**టి. వి. యస్. ప్రసాద్, భువనేశ్వర్**

ప్ర: టి. బి. రావచ్చునేమో? నివారణ.

జ: బైద్యనాథ్ స్వర్ణ మకరధ్వజ, బైద్యనాథ్ మహాలక్ష్మి విలాసరస ఉదయం 1వ మందు, సాయంత్రం రెండవ మందు ఒకమాత్ర చొప్పున పాలతో 40 రోజులు వాడండి. బైద్యనాథ్ చ్యవనప్రాశ్ స్పెషల్ తీసుకోండి. మంచి బలవర్ధకమైన ఆహారం వాడండి.

**యస్. యమ్. గౌస్., తూర్పుపాలెం, ఒంగోలు; జి. సునిల్‌కుమార్, తాడిపత్రి**

ప్ర: పాపకు కాళ్ళపై, చేతులపై కురుపులు మరియు మచ్చలు, గుల్లలు.

జ: బైద్యనాథ్ రక్త శోధకబటి టాబ్‌లెట్స్ 1/2 మాత్ర, బైద్యనాథ్ సురక్తా స్ప్రాంగ్ ఒక చెమ్చా సమభాగము నీరు కలిపి ఉదయం సాయంత్రం వాడండి. పైపూతకు బైద్యనాథ్ చర్మరోగారి మలామ్ లేక బైద్యనాథ్ జాత్‌మొగరా తేల్ రాయండి.

**కె. హరిబాబు, మార్టూరు**

ప్ర: తలనొప్పి, వేడి, నెమ్ము, నీరసం.

జ: రాత్రి పండుకోపోయేటప్పుడు బైద్యనాథ్ త్రిఫలా చూర్ణ 3 నుండి 5 గ్రాముల వరకు, గోరువెచ్చని నీరు ఒకగ్లాసు తీసుకొని పడుకోవాలి. బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల్ ఉదయం సాయంత్రం పాలతో వాడండి.

**కె. సావిత్రి, గుంటూరు**

ప్ర: చాలా లావు, బరువు తగ్గాలి.

జ: బైద్యనాథ్ మేదోహర విడంగాదిలోహ ఉదయం సాయంత్రం రెండు మాత్రలు చొప్పున బైద్యనాథ్ లోహాసవ బైద్యనాథ్ దశమూలారిష్టతో వాడండి. అతి భోజనము, పగటి నిద్ర కూడదు- వ్యాయామం, శరీర శ్రమ చేయాలి.

**బి. ఎస్. ప్రసాద్, గుంటూరు**

ప్ర. పులిత్రేనుపులు, మలబద్ధకము నివారణ

జ: రాత్రి పరుండబోవునపుడు భోజనము చేసిన 1 గంట తరువాత బైద్యనాథ్ త్రిఫలా చూర్ణము గాని బైద్యనాథ్ అవి పత్తికర చూర్ణము గానీ గోరు వెచ్చని నీటితో తీసుకొనవలెను మరియు బైద్యనాథ్ లఘు సూత శేఖరరస 2 మాత్రలు బైద్యనాథ్ శారి బాధ్యాసవతో రోజు మూడు సార్లు వాడాలి. అజీర్ణ కర పదార్థములు, పులుపు, ఉప్పు, కారము తగ్గించాలి.

**రేఖ, హనుమకొండ**

ప్ర: మొటిమలు, చెమటకాయలు హోమియోపతి మందులు వాడినాము

జ: మారు సురక్తా స్ప్రాంగు విడవకుండా వాడండి పై పూతకు బైద్యనాథ్ చాల్ మొగరాతేల్ వాడండి. బైద్యనాథ్ రక్తశోధక టాబ్‌లెట్స్ వాడండి.

**వి. శ్రీలత, ప్రొద్దుటూరు; జి. సూర్యనారాయణ, విశాఖ; యస్. పి. రాధాకృష్ణ, కరీమ్‌నగరం; జి. రాజా, నల్లగొండ; యన్. మనోరమ, కర్నూలు.**

ప్ర: తల వెంట్రుకలు ఊడిపోవుట, చుండ్రు. తల మీద వెంట్రుకలు బాగాపెరుగుటకు ఏమిచేయాలి?

జ: తల మీద వెచ్చని నీటితో స్నానము చేయరాదు. తలకు సబ్బులతో స్నానము చేయరాదు. తల నూనెగా బైద్యనాథ్ భృంగరాజ తైలము వాడాలి. బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల్ ఉదయం సాయంత్రం పాలతో సేవించాలి. వేడి చేసే పదార్థములు నిషేధం

**పి. కృష్ణకుమార్, వరంగల్**

ప్ర: ... ?

జ. ఏమీ హానిలేదు బైద్యనాథ్ లూకోనిల్ టాబ్‌లెట్స్ బైద్యనాథ్ సుందర కల్ప వాడించండి వేడి చేసే పదార్థములు నిషేధము

**మల్లారెడ్డి రాంప్రసాద్ (16 సం.), శ్రీకాకుళం**

ప్ర: ఫిట్సు వస్తున్నాయి. జ్ఞాపకశక్తి లేదు.

జ: బైద్యనాథ్ బ్రైన్ టాబిలెట్సు ఉదయం సాయంత్రం రెండు మాత్రల చొప్పున బైద్యనాథ్ సరస్వతారిష్టతో వాడండి. తల నూనెగా బైద్యనాథ్ బ్రాహ్మీ తైలము వాడండి

**యమ్. గోపాలకృష్ణ, కంచికచెర్ల; మెకడొవెల్, విజయవాడ**

ప్ర: మోకాలు నొప్పి. కీళ్ళ ఎముకలు అరిగినవి అని చెప్పారు.

జ: బైద్యనాథ్ మహాయోగరాజ గుగ్గులు 1 మాత్ర, బైద్యనాథ్ లాక్షాది గుగ్గులు 1 మాత్ర చొప్పున రోజుకి రెండు సార్లు ఉదయం సాయంత్రం బైద్యనాథ్ మహారాస్నాది కాడాతో సేవించండి. పైన బైద్యనాథ్ రుమా ఆయిల్ మర్దన చేయండి.

**డి. బైద్యనాథ్, ఫెర్టిలైజర్‌సిటీ**

ప్ర. . . . ?

జ: బైద్యనాథ్ వృద్ధి బాధిక బటి రెండు మాత్రలు చొప్పున ఉదయం సాయంత్రం మహారాస్నాది కాడాతో సేవించండి బిగువైన లోపలి దుస్తులు వాడండి

**జె. సాయి దయాకరరావు, నెల్లూరు**

ప్ర: మూత్ర పిండములో రాయి.

జ: బైద్యనాథ్ పథరీనా 2 మాత్రల చొప్పున రోజుకు 3 సార్లు వాడండి. ప్రయోజనము ఉండగలదు.

**కీర్తి, సికిందరాబాదు**

ప్ర: జుట్టు ఊడుతున్నది.

జ: బైద్యనాథ్ మహాభృంగరాజ తైలము ఉపయోగించండి. □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

ప్రశ్న :...... .......................

.............................................

.............................................

పంపినవారి పేరు :

పూర్తి చిరునామా :

# బంగారు కరచాలనం



*రవీంద్ర*












సీరియల్

# ఒకటి ఒకటి మూడు

## తేజోవతి




(గత సంచిక తరువాయి)

"సారీ... అండి. నేనీ వేళ వెళ్లలేను ... నావల్లకాదు. గత మూడు రోజులుగా యీ హైద్రాబాద్ రోడ్ల మీద యిలా తిరగలేక విసుగెత్తుతోంది... యిక నేను తిరగలేను... నావల్లకాదు.... నన్ను వదిలెయ్యండి.. ప్లీజ్... యిక మనవూరు వెళ్లిపోదాం..."

సీత దాదాపు ఏడుస్తున్నలాంటి గొంతుతో అన్నది .

"సీతా... యీ ఒక్కరోజు కాస్త కష్టపడు. యీ ఒక్కరోజు చూద్దాం ఎన్నాళ్ళు ఎవరో ఒకరు నిన్ను వెంటాడుతున్నారని, నిన్నెత్తుకు పోతున్నారని భయంతో గడుపుతావు సీతా?... ఎక్కడికీ బయటకు రాకుండా . ఏ వూరికీ కదలకుండా నీ యింట్లో బందీలా ఎన్నాళ్ళుంటావు చెప్పు...

ఫర్వాలేదు యీ ఒక్క రోజు. వెళ్ళు సీతా" చాలా అనునయంగా అన్నారు శ్యామసుందర్‌గారు...

"మీకేం మీరు ఎన్నయినా చెప్పగలరు!.... ఆ రోడ్డుమీద అలా నడుస్తుంటే నా గుండెలు ఎంత దడదడలాడుతాయో మీకేం తెలుసు...." సీత కళ్ళల్లో నీళ్ళొక్కటే తక్కువ...

వెనుకటి అనుభవం తాలూకు జ్ఞాపకాలతో అవి తల్చుకున్నప్పుడల్లా చెమటలు పట్టాయి సీతకు

ప్రసాద్‌తోనూ, లాయర్‌గారితోనూ అందరితో మాట్లాడి వెళ్ళిన కొద్ది రోజులకు సీతను వెంట బెట్టుకుని హైద్రాబాద్ వచ్చారు శ్యామసుందర్‌గారు...

అక్కడున్న బ్రోతల్ హౌస్ ఓనర్సు, స్మగ్లర్స్, పిక్‌పాకెటీర్స్ వగైరా నేరస్థులందరి ఫోటోలు తీసుకొచ్చి చూపించారు పోలీసులు ..

సీతా, ప్రసాద్ యిద్దరూ చూశారు... కానీ వాళ్ళల్లో ఎవ్వరూ కారన్నారు..

ఇక ఆ ముఠాను పట్టుకునేదెలా... అందుకే ఒకప్లాను ఆలోచించారు

సీత చెప్పిన గుర్తుల ప్రకారం కొన్ని కొన్ని వీధుల్లో సీత అలా ఒంటరిగా షాపింగుకెళ్ళినట్టుగా వెళ్లడం . అల్లంత దూరంలో శ్యామసుందర్‌గారు ప్రసాద్‌గారూ జాగ్రత్తగా కనిపెడుతుంటారు...

వీళ్ళకు తోడు మఫ్టీలో పోలీసులు పరిసరాల్లో దాక్కుని వుంటారు. ఈ ప్లాను ప్రకారంగా సీత మూడు రోజుల నుండీ యీ హైద్రాబాద్ రోడ్లలో ఒంటరిగా ఏదో పనున్నట్టు ఏ కొట్టులోకో వెళ్ళడం .....

సీతను మోసగించిన వ్యక్తి ఆ వూర్లోనే వుంటే మళ్ళీ ప్రయత్నిస్తాడని వాళ్ళ గట్టి నమ్మకం... కానీ సీతకు అలా రోడ్డుమీద నడుస్తున్నంతసేపూ ఎవరో వచ్చి తనను పట్టుకోబోతున్నట్టు, మళ్ళీ తననా నరక కూపంలోకి లాక్కుపోతున్నట్టు .. యిదే భయం

అందుకే యీ రోజు సీత సుతరామూ యిష్టపడటంలేదు .

"సీతా.... నీకు ధైర్యం లేదంటే నేనొప్పుకోను ఆ రోజు అంత ధైర్యంగా యింట్లోంచి వెళ్లిపోయావు.

ఆ తర్వాత అంతకంటే ధైర్యంగా పోలీసుస్టేషనుకు వెళ్లావు . అంతకు రెండింతలు ధైర్యంతో ఆ మనిషి నెత్తిమీద కొట్టగలిగావు

ధైర్యంతో ఒకడుగు వేసిందానివి ఆ ధైర్యం తాలూకు పరిణామాలను ధైర్యంగా ఎదుర్కోవలసిందే

వెళ్ళు సీతా యీ ఒక్క రోజు చూద్దాం... యివ్వాళ కూడా మన ప్రయత్నం నెరవేరకపోతే యింక మనవూరికి వెళ్లిపోదాం." అన్నారు శ్యామసుందర్‌గారు

"ఫర్వాలేదు సీతా . యిక్కడ మేమిద్దరం వున్నాం.. ఆ మనిషి నీ పరిసరాల్లోకి రాగానే గుర్తుపట్టగలననేగా నన్నుకూడా పిలుచుకు వచ్చారు మీవారు.

తర్వాత యింతమంది పోలీసు బలగం కూడా వుంటే నీకెం భయం లేదు "

ప్రసాద్ నచ్చ చెప్పాడు .

"సీతా నువ్వొక్కదానివేకాదు. నీలాంటి ఆడపిల్లల్ని, అమాయకపు స్త్రీలను ఎంతమందిని దారుణంగా మోసం చేసి వాళ్ళను నరక కూపంలోకి తోస్తున్నాడో .

అలాంటి వాడ్ని పట్టివ్వడానికోసం నువ్వామాత్రం ధైర్యం చెయ్యలేవా? . పైగా నువ్వు కొట్టిన వ్యక్తి చచ్చిపొయ్యాడో లేదో తెలుసుకోవాలని లేదానీకు .

వాడు చచ్చిపోలేదని తెలిస్తే నీకా గిల్టీ కాన్షస్ పోయి మనసు తేలికపడదా..

పోలీసులు వాళ్ళ తంటాలు పడ్డారు పాపం. వాళ్లెవరూ కాదన్నావుకదా . యిదొక్కటే మార్గం మిగిలింది వాళ్ళను బయటకు రప్పించడానికి

పోలీసులంతా వెయిట్ చేస్తున్నారు వెళ్ళు "

సీత అయిష్టంగానే బయలుదేరుతూ

"యిదే ఆఖరుసారి. యిక మాత్రం నేను వెళ్ళను బలవంతం చేస్తే సుధానర్సింగ్‌హోమ్ కెళ్లిపోయి మళ్ళీ డాక్టరమ్మగారి దగ్గర చేరిపోతాను " అన్నది బెదిరిస్తూ.

జరిగిన కథ–14: ఐదు సంవత్సరాల తర్వాత లక్ష్మి పేరుతో కలిసిన సీత నుంచి ఆమె వివరాలన్నీ రాబడతాడు శ్యామసుందర్ ఐదు సంవత్సరాలలో సీత పడిన బాధల్ని చట్ట పరంగా తొలగిద్దామనే ప్రయత్నంలో ప్రసాద్‌ను కలుస్తాడు సీత వెంట గూండాలు పడిన వైనమూ, ప్రసాద్ ఆమెను రక్షించిన తీరూ, ప్రసాద్‌కు ప్రమాదం జరగకుండా ఉండాలని ఆమె పారిపోవడమూ, ప్రయాణంలో కలిసిన మిలిటరీ ఆఫీసర్ చదువు చెప్పించటమూ అన్నీ బైటికి వస్తాయి

శ్యామసుందర్‌గారు నవ్వారు

'ఇప్పుడు సుధానర్సింగ్‌హోమ్ కెళ్ళినా నిన్ను వెనకటిలా తన దగ్గర పెట్టుకోదు సుధ అనుకుంటున్నావేమో.' వుడికిస్తూ అన్నారు

'ఏం ఎందుకని డాక్టరమ్మగారెప్పుడూ నన్ను కాదనరు"

ఎందుకనంటే యిప్పుడు తనకో తోడున్నారు కాబట్టి. నీకు యింకా తెలియదేమో రాజా గవర్నమెంటు జాబ్‌కు రిజైన్‌చేసి సుధ దగ్గరకు వచ్చేశాడు ప్రాక్టీసు యిద్దరూ కలిసి చేస్తున్నారు"

"రాజా ఎవరు?!' ఆశ్చర్యంగా అడిగింది సీత

'రాజాకూడా మా క్లాస్‌మేట్ సుధా, రాజా చాలా క్లోజ్ ఫ్రెండ్స్ పెండ్లి చేసుకోవాలనుకున్నారు కొన్ని తప్పనిసరి పరిస్థితుల్లో అతడు వేరే పెండ్లి చేసుకున్నాడు సుధ అందుకే వొంటరిగా వుండిపోయింద ఈ మధ్య రాజా భార్య చనిపోయింది అనుకోకుండా వైజాగ్‌లో కలుసుకున్నాం అతడు గవర్నమెంటు జాబు మానేసి ప్రైవేట్ ప్రాక్టీసు పెట్టుకుని ఒక చోట స్థిరపడాలని వుందంటే నేనే సూచించాను

సుధ అలాగే పెళ్ళి లేకుండా వుండిపోయింది తనను పెళ్ళి చేసుకుని కలిసి ప్రాక్టీసు పెట్టమని అది మాట్లాడ్డానికే వచ్చాను నేను అనుకోకుండా నిన్ను చూచాను మరెందుకొచ్చా ననుకున్నావ్ ఆ రాత్రి తనకు నచ్చ చెప్పేటప్పటికి రెండు గంటలు పట్టింది"

అంటే ?' సుద ఆశ్చర్యంగా అయన మొఖంలోకి చూసింది

"అంటే ఏమిటి అలా అర్థోక్తిలో ఆగిపోతే ఏం చెప్పగలను?"

వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటుంటే సహజంగా ప్రసాద్ దూరంగా వుంటుంటాడు ఇప్పుడు మాట వినబడనంత దూరంలో వుండటంతో ధైర్యం చేసి భర్త మొఖంలోకి చూస్తూ అన్నది సీత

అంటే, సుధగారిని మీరు పెళ్ళి చేసుకోవాలనుకోలేదా?"

నేనా' రాజా నా బెస్ట్ ఫ్రెండ్ మొదట్లో కూడా వాళ్ళిద్దరూ కలుసుకునేలా చేసిన వాడ్నినేను అందుకని చనువుగా వుంటాను గానీ ' అసలు నీకీ అయిడియా ఎందుకు వచ్చింది?"

శారదక్కయ్యగారిని చేసుకోక ముందు మిరు ఎవరో మెడిసిన్ చదివిన పిల్లను చేసుకోవాలనుకున్నారని

'ఓ అదా నేను సునీతను చేసుకోవాలనుకున్నాను కానీ సునీత యిప్పుడు పెళ్ళి చేసుకుని భర్తతో సహా స్టేట్స్‌లో వుంటోంది ఇద్దరు పిల్లలు అనుమానం తీరిందా

యిప్పటికైనా మనం ఏ భయాలూ లేకుండా సంతోషంగా, హాయిగా కాపురం చేసుకోవాలంటే మనకీ పీడ వదిలి పోవాలి.." అన్నారు డాక్టరుగారు

అయన మొఖంలోకి ఒక్క క్షణం అలాగే తేరిపార చూచి నవ్వుతూ అన్నది సీత

తప్పకుండా వెళ్తానండి తప్పకుండా వెళ్తాను నాకున్న యితరత్రా భయాలన్నీ యీ రోజుతో తీరిపోయినయి

ఇక యీ ఒక్క భయం కూడా తీరిపోతే మనం చాలా సంతోషంగా వుండచ్చు" అనేసి బయలుదేరింది సీత.

సీత ఆ రోజు చాల అందంగా అలంకరించుకుంది మెరూన్ కలరు మీద నల్లబార్డరున్న మైసూరు క్రేప్‌సిల్కు చీర ఒంటికి హత్తుకు పోయి వొంపు సొంపులకు మెరుగు దిద్దుతోంది

చెవులకు చిన్న చిన్న బంగారు జూకాలు చేతులకు ఒక జత బంగారు గాజులు . ఒక చేతికి ఖరీదైన వాచి

మెళ్ళో బంగారపు తాళిబొట్టుతాడు ముత్యాల దండ

కాటుక దిద్దిన కళ్ళు వొంకుల జుట్టు అపర రతీదేవిలా వుంది

రాజహంసలా నడుస్తూ వెళ్తున్న సీత వైపు ఒక సారి అలా చూసి శ్యామసుందర్‌గార్ని ఏదో అడగడానికి వచ్చాడు ప్రసాద్

"అతడు చచ్చిపోయి వుంటే సీతకు ఏమన్నా ప్రమాదమా?

'చచ్చిపోలేదనే మీ వుద్దేశమా? శ్యామసుందర్‌గారు ఎదురు ప్రశ్న వేశారు



# ఒకటి ఒకటి మూడు

"అతడు చచ్చి పోయి వుండడనే నాభావం చచ్చేవుంటే పోలీసులు నన్ను పట్టుకునే వాళ్ళు కారా?'

"దొంగలు, రౌడీలు యిలాంటి వాళ్ళల్లో కాజుయాలిటీలు పోలీసులు కోర్టులు వీటి దాకా తీసుకు రారని మా లాయరు గారి అభిప్రాయం తీగ కదిపితే డొంకంతా కదులుతుంది- అందుకనే వాళ్ళు మనసులో పెట్టుకుని సమయం వస్తే పగతీర్చుకోవాలని చూస్తారుట

కానీ అతడు చచ్చిపోయి వున్నా సీతకు న్యాయపరంగా ఏ ప్రమాదమూ లేదు ఆర్ పి డి (రైట్ ఆఫ్ ప్రైవేట్ డిఫెన్సు) క్రింద తను ఎక్విట్ అవుతుంది

మిమ్మల్ని మృత్యువు నుండి కాపాడ్డానికి చేసింది తన మానాన్ని ప్రాణాన్ని కూడా కాపాడు కోడానికి చేసింది

మీరు ఆ రోజు డాక్టరు సర్టిఫికెట్ తీసుకోడం మంచి పనిచేశారు అంతకు ముందు అతడు బ్రోతల్ హౌస్ వాడని పోలీసుస్టేషనులో యిచ్చిన రిపోర్టు కూడా తనకు ఎవిడెన్సు

ఆ తర్వాత యిప్పుడు వాళ్ళు దొరికి వాళ్ళు ఎలాంటి వాళ్ళో మనం ప్రూవ్ చేయగలిగితే అది మరీ బలం కదా ' అంటూనే,

సీత ఏదో షాపులోకి వెళుతున్నట్టుంది కదూ. ఏమిటా షాపు?'

ప్రసాద్ కొంచెం పరిశీలనగా చూసి,

ఫాన్సీ షాపులా వుంది యివ్వాళ కూడా వృదా ప్రయాస అనే అనిపిస్తోంది నాకు " అన్నాడు

చూద్దాం కానీండి అని ప్రసాద్‌గారూ సీత మూలంగా మీ చెల్లెలు పెళ్ళి ఆగి పోయిందని అన్నారు యిది వరకు' అంటుండే, మధ్యలో కల్పించుకుని ప్రసాద్ యిలా అన్నాడు

"సీత మూలంగా కాదు . నేను స్వయంగా చేయ్య లేక పోయిన అశక్తత మూలంగా. లేదా చెల్లెలు పెళ్ళికి యింకోళ్ళు తెచ్చే డబ్బు మీద ఆధారపడి నందున ఆగిపోయిందని యిప్పుడనుకుంటున్నాను'

"వెల్.... ఏదన్నాకానీ ఆ అమ్మాయికిప్పుడు పెళ్ళయిందా?

"లేదు పెళ్ళి ఆగి పొయ్యాక చదువులో పెట్టాను యిప్పుడది వుద్యోగం చేసుకుంటోంది."

శ్యామసుందర్‌గారు క్షణం ఆలోచించి అన్నారు-

'మీరేమనుకోనంటే ఒక మాట చెప్పాలని వుంది ఆ అమ్మాయికి సంబంధం చూసి మీరు పెళ్ళి ఖాయం చెయ్యండి కట్నం విషయం నేను చూసుకుంటాను '

నో సర్ థ్యాంక్యూ అమ్మాయి, వాళ్ళ యిన్స్టిట్యూషన్లోనే పని చేసే అతడ్ని చేసుకుంటానన్నది అతడు కూడా కట్నం లేకుండా చేసుకుంటానన్నాడు .. పెళ్ళి ఖర్చుకు దాని జీతం బ్యాంక్‌లో వేసింది వుంది నేను కొంత దాచి పెట్టాను రెండో చెల్లెలుక్కూడా చూస్తున్నాం.. దానిక్కూడా సంబంధం కుదిరాక యిద్దరికీ చేసెయ్యాలని ప్రయత్నం

'సీత యింకా షాపులో నే వున్నట్టుంది."అనుకున్నారు

సీత నిజానికి యింకా ఆ షాపులో నే వుంది గాజులని, తల పిన్నులని, ఫాన్సీ బాంగిల్స్ అని అవి తాపీగా చూస్తూ బేరం చేస్తూ. , మధ్య మధ్యలో రోడ్డు మీదకు చూస్తోంది

ఆమెకు అలా వొంటరిగా వుండాలంటే భయంగా వుంది . త్వరగా భర్త దగ్గరకు వెళ్ళిపోతే బాగుండునని వుంది వాళ్ళు ఏమైపోయి వుంటారు యిక్కడ వుండి వుండరేమో యింకేదన్నా కేసులో పట్టు బడ్డారేమో అన్న ఆశ గానూ వుంది

లేకపోతే యీ పరిసరాల్లోనే వాళ్ళ యిల్లు కాదు ఆ ప్రత్యక్ష నరకం వుందని తనకు తెలుసు ఆ రోజు రాత్రి వాళ్ళు ఆటోలో తీసుకెళ్ళి నప్పుడు తనకు మత్తుమందు చూపించారు కాబోలు ఏమీ తెలియ లేదు

కానీ ఆ మర్నాడు ఆ వూబిలో నుండి బయటపడిన తర్వాత దొరికిన ఆటో లో ఎక్కి ప్రసాద్ వాళ్ళ బ్యాంక్‌కు పొమ్మనప్పుడు తను చుట్టూతా చూసింది . వాళ్ళు వెంబడిస్తున్నారేమో నన్న భయంతో ప్రతి సందూ, గొందూ చూసింది ఆ యిల్లయితే కరెక్టుగా గుర్తు పట్ట లేక పోయింది గానీ యీ రోడ్లు చూసినట్లే వున్నాయి

సీత ఒకసారి రోడ్డు మీదకు చూసింది అవి పెద్దగా జనసంచారం లేని వీధులు ఎక్కడో ఒకటీ రెండూ షాపులు

సీత ఫాన్సీ బాంగిల్సు పాక్ చేస్తుండగా షాపులో యింకొక అతడు కూడా గాజులు బేరం చేస్తూ కన్పించాడు

'మేడమ్ గారు తీసుకున్న గాజుల్లాంటివే తియ్యండి" అన్నాడు షాపు అతడితో

"మేడమ్ నాక్కూడా గాజులు సెలక్ట్ చేసిపెట్టండి'. అని అడిగాడు

సీత డబ్బులు యివ్వబోతూ తలెత్తి చూసింది

కళ్ళకు నల్లద్దాల కళ్ళజోడు తల మీద టోపీ... పాంటూ, షర్టూ టక్ చేసుకున్నాడు దాని మీద లేతరంగు స్వెట్టర్ కూడా...

ఒకసారి చూసి, గాజులవీ ఆడవాళ్ళు వచ్చి తీసుకుంటేనే బాగుంటుంది " అన్నది గాజుల పాకెట్ హాండ్ బాగ్‌లో పెట్టు కుంటూ.

ఫర్వాలేదు మేడమ్ మా చెల్లెలు పల్లెటూళ్ళో వుంటుంది... దానికి పెళ్ళి కుదిరింది చీరలు అవీ కొనడానికి వచ్చాను హైదరాబాద్‌లో గాజులు బాగుంటాయి తీసుకు రమ్మని మరీ మరీ చెప్పింది

మీ చేతి ఆదే దయచేసి కొంచెం చూసి పెట్టండి " అభ్యర్థిస్తున్నట్టు

## గడుసులోకం —బాబు

| | | |
|---|---|---|
| ఉదయం | 6 గం. నుండి 9 గం. వరకు | బడికి తయారవటం |
| ఉదయం | 9 గం నుండి మధ్యాహ్నం 3 గం. వరకు | బడి |
| మధ్యాహ్నం | 3 గం నుండి 5 గం. వరకు | క్రికెట్ వగైరా |
| సాయంత్రం | 5 గం. నుండి 7 గం. వరకు | ప్రయివేట్ మాస్టారుతో చక్కులు |
| రాత్రి | 7 గం. నుండి 11 గం. వరకు | టి వి |



శ్రీరస్తు - శ్రీ త్రిపురసుందరీ వరశివాభ్యాంనమః

# ఆంధ్రపత్రిక

పూర్తి ఆఫ్‌సెట్ ముద్రణతో
త్వరలో వెలువడుతుంది

## ప్రభవనామ సంవత్సర పూర్ణశాస్త్రీయ పంచాంగమ్

పూర్తి ఆఫ్‌సెట్ ముద్రణతో
త్వరలో వెలువడుతుంది









'దైవజ్ఞచింతామణి' శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తిశాస్త్రి,

'భాషాప్రవీణ' శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి సిద్ధాంతి సోదరులచే గుణింపబడినది.

ఆంధ్రపత్రికా కార్యాలయము

ప్రతి 1-కి రూ. 5-00

గాంధీనగరం - విజయవాడ - 3. — బషీర్‌బాగ్ - హైదరాబాద్ - 29.




## అర్. కె. ఖమ్మం

నాకు రెండు నెలలుగా కుడివైపు వరిబీజము తచ్చినట్లుగా వాచి ఉన్నది. నెప్పి లేదు. ఇలా వుంటే రేపు పెళ్లి అయితే ఆ అమ్మాయిని సుఖ పెట్టగలనా? దీనికి మందు – పత్యము ఏమైనా ఉన్నాయా?

★ వరిబీజానికీ స్త్రీలను సుఖ పెట్టలేక పోవటానికీ సంబంధం లేదు. మీరు సర్జన్కి చూపించి వాపు ఆర్కైట్రిస్ వల్ల వచ్చిందీ, హైడ్రోసీల్ వల్ల వచ్చిందీ తెలుసుకోవాలి రోగ నిర్ణయం జరిగిన తర్వాత చికిత్స నిర్ణయింపబడాలి ఆర్కైటిస్కి మందులు వాడితే తగ్గిపోతుంది హైడ్రోసీల్కి శస్త్రచికిత్స చెయ్యవలసి ఉంటుంది

## యస్. ఎ. పి. సికింద్రాబాద్

ఇన్ ఫీరియారిటి కాంప్లెక్స్ అంటే ఏమిటి? ఇది ఎలా వస్తుంది? దీనికి నివారణ ఏమిటి?

★ ఎదుటి వారు గొప్పవారని, తాము అన్ని విధాల వారి ముందు తీసికట్టని ఆత్మ న్యూనత చేసుకోవటమే ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ అని అంటారు మానసిక ఆందోళన, వ్యక్తిగత అలవాట్లు, శరీర నిర్మాణం దీనికి ముఖ్య కారణాలు ఎదుటి వారి వాక్చాతుర్యం కూడా ఒక కారణం అవుతుంది

సైకియాట్రిస్టు సలహా పొందటం, వాతావరణం మార్పులు మంచి ) హితుల ఎంపిక మొదలైన వాటివల్ల ఫలితం ఉంటుంది

## ఇ. వి. కె. అర్. గుంటూరు

నా భార్యకు చేతుల మీద, కాళ్ళ మీద స్పర్శజ్ఞానము లేని మచ్చలు వున్నవి పెళ్ళికి ముందు 3 సంవత్సరములు మందులు వాడినదట మరి మచ్చలు ఎందుకు పోలేదు? అవి మా దాంపత్యానికి ఎటువంటి హాని కలిగించవా? అవి నాకు వచ్చే ప్రమాదమున్నదా? పుట్టే పిల్లలకు ఈ వ్యాధి వచ్చే అవకాశం వున్నదా? ఇది త్వరగా నయమవాలంటే ఏ మందులు వాడాలి?

★ తెల్లని మచ్చలన్నీ లెప్రసీ మచ్చలని అనుకోవటం తప్పు నిపుణులైన వైద్యుల వద్ద చూపించి రోగ నిర్ణయం చేసుకున్న తర్వాత గాని మందులు వాడకూడదు. లెప్రసీ అని నిర్ధారణ జరిగిన తర్వాత ఇవ్వవలసిన ప్రమాణంలో డాప్సోన్ మాత్రలు వాడవలసి వుంటుంది దాంపత్య జీవితానికి ఈ రోగానికి సంబంధం లేదు. పుట్టే పిల్లలకి ఈ రోగం వచ్చే అవకాశం లేదు వైద్యుల సలహా మేరకు డాప్సోన్ మాత్రలు వాడటం మంచిది దీనికి లొంగదని వైద్యులు అనుకుంటే వారు క్లోఫాజిమిన్, రిఫామైసిన్ అనే మందులు వాడతారు

## యం. కె. నిర్మల్

నా వయస్సు 34 సంవత్సరములు. నాకు డయాబెటస్ వచ్చినది త్రాగుడు, తీపి తినడం అలవాటు లేదు టీ గూడా స్వల్పంగా తీసుకొంటాను ఈ వ్యాధి మా కుటుంబంలో గూడా ఎవ్వరికీ లేదు ఇది ఎందుకు వస్తుంది? ప్రమాదము ఏమైనా వున్నదా? నయమవుతుందా?

★ డయాబెటిస్ రావటానికి పేంక్రియస్ గ్రంధిలో ఇన్సులిన్ ఉత్పత్తి తగ్గిపోవటమే కారణం ఆహార విషయంలో తగిన జాగ్రత్తలు తీసుకుంటూ, శరీర వ్యాయామం చేస్తూ తరచు వైద్యుల వద్ద పరీక్ష చేయించుకుంటూ వస్తే ఈ జబ్బు వల్ల ప్రమాదమేమీ ఉండదు పై జాగ్రత్తల వల్ల ఈ జబ్బు మూలంగా అవాంతరాలు ఏర్పడవు □

## ఒకటి ఒకటి మూడు

అడిగాడు

సీత చిన్నగా నవ్వింది.

ఈ రోజుల్లో అమ్మాయిలు గాజులు చీరకు మాచింగ్గా కొనుక్కుంటున్నారు అందులో పెళ్ళిలో మరీ జాగ్రత్తగా అలంకరించు కోవాలనుకుంటారు ఆ చీరలకు తగ్గట్టుగా సెలక్టు చేసుకోండి' షాపులో నుండి బయటికి రాబోతూ అన్నది

'ఒహో అలాగా మేడమ్! నాకు తెలియదు ఆడవాళ్ళ సంగతులు అక్కడ ఎదురు కొట్లోనే చీరలు తీసి పెట్టాను. మీరొక్కసారి ఆ చీరలు చూసి ఏవి బాగున్నాయో కాస్త సెలక్టు చేసి పెట్టరూ దయచేసి

నాకు చీరల సెలక్షను తెలియదే అంటే కొట్లో ఆడవాళ్ళుంటే చూపించు వాళ్ళు చెబుతారులే ఏరంగు నప్పుతుందో అన్నది

"నాదురదృష్టం ఆ గుడ్డల కొట్లో ఆడవాళ్ళెవ్వరూ లేరు" చిన్నగా నిట్టూర్చాడు

సీతకు వాళ్ళన్నయ్య గుర్తొచ్చాడు

ఆయన కూడా యింతే ఎక్కడి కన్నా వెళితే గాజులో, రిబ్బన్లో ఏవో తెచ్చేవాడు ఆడవాళ్ళవి నువ్వెందుకు తెస్తావని గొడవ చేస్తే, కొట్లో ఆడపిల్లలు కొంటుంటే అడిగానులే

మా చెల్లెలు పచ్చగా, బంగారపు బొమ్మలా వుంటుంది అచ్చం సీతమ్మ వారిలా అని చెబితే వాళ్ళే ఏరిపెట్టారు

సీత కరిగి పోయింది.

కానీ యింతలోనే గుర్తొచ్చింది యీ రోడ్డు మీద వంటరిగా నిలబడి యీ టిన్నను లేకుండా ఆయన దగ్గరకు వెళ్ళి పోవాలనుకుంటే మళ్ళీ యీ తద్దినం ఏమిటి .

ఇంతలో అతడన్నాడు మళ్ళీ

ప్లీజ్ కాదనకండి యిక్కడే ఒక్కడుగు చాలా జాలిగా అభ్యర్థిస్తున్నట్లు అడిగాడు

సీత మెత్తపడింది

'ఎక్కడా షాపు?

'అదే ఎదురేనండి రండి' మనిషి సగానికి వంగి అతి మర్యాదగా దోవ చూపించాడు

ఎదురు కొట్టు దాకా వెళ్ళడానికి యింత ఆలోచన ఎందుకు అనుకుంటూ నడుస్తోంది

కళ్ళద్దాల మనిషి చెబుతున్నాడు

ఏమిటో నండి రకరకాల చీరలు చెప్పాడు. అమెరికన్ జార్జెట్ అంటాడు షిఫాన్ అంటాడు గార్డెన్ సిల్కు అంటాడు చైనా సిల్కు అంటాడు

మేడమ్ మీరు కట్టుకున్న చీరెమిటి బాగా ఖరీదా '

అతడు కబుర్లు చెబుతున్నాడు సీత చూసుకోలేదు ఆ వీధి మలుపు తిరిగేసారు ఆపైన కొంత దూరం నడిచాక సీతకు సడన్గా తను ఆ వీధినుండి వచ్చేసిన విషయం గమనించింది

ఎదురు కొట్టే అన్నారు చాలా దూరం వచ్చినట్టున్నాం ' అక్కడే ఆగిపోతూ అన్నది

అదే మేడమ్ ఆ కారు ఆగివున్నది అదే కొట్టు . రండి రోడ్డు క్రాస్ చేద్దాం " మళ్ళీ అదే వినయం

సీత ఎదురుగా చూసింది అది గుడ్డల కొట్టే అయితే దానికి పరదాలాగా వుంది లోపలి వాళ్ళు బయటికి కనబడకుండా హైద్రాబాద్లో యింకా కొన్ని కొట్లకు అలాంటి పరదాలు వుంటూనే వుంటాయి అందులోనూ కొన్ని ఏరియాల్లో తప్పకుండా ..

సీత రోడ్డు క్రాస్ చేసి ఆ షాపు మెట్టు ఎక్క బోతుండగా కొట్లో నుండి ఎవరో వస్తూ డాష్ కొట్టారు (ఇంకాఉంది)

# సేవాధర్మం

వి.వి. సుబ్బారావు

"దొంగ... దొంగ.... పట్టుకోండి"-కేకలు. చూస్తుండగానే ఆ నడి బజార్లో జనం గుమి గూడారు. వాళ్ళ మధ్యలో పాపం! డబ్బును పోగొట్టుకున్న ఓ యువకుడి ఆర్తనాదం వినబడుతోంది! చూడ్డాని కతను పేదవాడిలాగే ఉన్నాడు. కళ్ళ నీరు కుక్కుకొని,

"అయ్యో! చూడండి. ఎవడో నా జేబు కత్తిరించి పర్సు కొట్టేసాడు. అందులో సరిగ్గా నలభైఐదు రూపాయలున్నాయి. బాంకుకి వెళ్ళి చలానా కడ్దామని వెడుతున్నాను. ఇవ్వాళే ఆఖరి రోజు పరీక్ష ఫీజు కట్టడానికి. నేను ప్రైవేటుగా ఎం. ఎ. కడుతున్నా. ట్యూషన్లు చెప్పుకొని సంపాయించిన కష్టార్జితం ఆ సొమ్ము, ఇక నా పరీక్షలకే "పరీక్షా సమయం వచ్చింది" అంటూ హృదయ విదారకంగా విలపిస్తున్నాడు.

ఒకళ్ళో, ఇద్దరో 'అయ్యో పాపం' అని సానుభూతిని చూపించారు గానీ అధిక సంఖ్యలో వచ్చిన జనం అక్కడేదో చోద్యం జరుగుతోంది. ఫ్రీగా చూద్దామని పనిగట్టుకు వచ్చిన బాపతే మరి! అందులో కొందరు.

"ఆ! ఇవన్నీ కలికాలపు ఎత్తులు - ఎవరికి తెలియవులే! ఇదో నాటకం సంపాదనకి" అంటే మరికొందరు

"ఒళ్ళు కొవ్వెక్కితే సరి! జేబుని ఎవరో కత్తిరిస్తున్నా అంత స్పృహ లేకుండా ఉన్నాడంటే అయ్యవారేదో స్వప్నలోకంలో ప్రియురాలితో విహరిస్తున్నట్టే" అంటూ జడ్జిమెంటు పారేసారు!

గుంపుని తప్పించుకొని పాదరసంలా జారిపోయి, చేరువలో అంజనేయస్వామి గుడి దగ్గిర చెట్టు నీడని నిలబడ్డాడు శివయ్య. ఎదురుగా స్వామి తనకేసే చూస్తూ ప్రశ్నిస్తున్నట్లనిపించింది. సమాధానం కోసం తడుముకుంటూన్న శివయ్యకి వళ్ళంతా ముచ్చెమటలు పోసాయి. యిటీవల వరకూ చిల్లర మల్లర దొంగతనాలని నమ్ముకున్న శివయ్యకి వృత్తి సన్యాసం చెయ్యవలసిన పరిస్థితి ఏర్పడింది ఒక బలీయమైన సంఘటనతో. తనకి ఆరో ప్రాణమయిన మల్లమ్మకి మాట యిచ్చాడు - ఒట్టు పెట్టి మరీ.

"మల్లీ - ఇక జనమలో నేనీ పాడు దొంగతనాలు చెయ్యనే అంటూ!". దానికి మాట యిచ్చి - మరి ఒట్టును తీసి గట్టున పెట్టడమే! ఉహూఁ ఏది ఏమయినా కానీ - తన నిర్ణయానికి తిరుగులేదు...

శివయ్య పరుగున వెళ్ళి పర్సుని పోగొట్టుకున్న కుర్రాడిని సమీపించాడు. ఈలోగా అక్కడ చేరిన గుంపు పలచబడింది. ఏకాకిగా ఎటో దీనంగా చూస్తున్న ఆ కుర్రాడితో మెల్లగా-

"బాబుగారూ! నన్ను మన్నించండి. ఇదుగో మీ పర్సు తీసేసుకోండి" అంటూ.

"చూడండి బాబూ, వెంటనే మీ పరీక్ష ఫీజు కట్టేయండి. నేను ఎలాగూ చదూకున్నోణ్ణి కాదు. కాలేను. కానీ, మీ చదువుకి అడ్డంపడి మీ నోటికాడ గూడు పడగొట్టేవోణ్ణి కాలేనండి బాబూ! మీరు బాగా చదూకోవాలి. చదూకొని పెద్ద ఉద్యోగం చెయ్యాల. అందుకే. అందుకోసమనే యీ డబ్బు తీసేసుకోండి బాబూ! బుద్ధి గడ్డి తిని, మా ఆడదానికి యిచ్చిన పెమాణాన్ని సెరిపేసి, మీ దగ్గర పర్సు కాజేసాను బాబూ! కానీ యిదంతా నా కోసమను కోకండి బాబూ! అద, దవాఖానలో నా బిడ్డ సావు బతుకుల మధ్య ఉందండయ్యగారూ! దాని వయిద్యం కోసమని - దాని పేణాలు కాపాడుకుందామని యీ పని సేసాను దొరా!" అంటూన్న శివయ్యని చూసిన ఆ యువకుడు క్షణం సేపటికి గానీ తేరుకోలేదు. పోయిందనుకున్న డబ్బు తిరిగి భద్రంగా తనని చేరడం ఆనందదాయకమే! అంతకుమించి చాలా ఆశ్చర్యకరమయిన విషయం -కాగా, ఏ పరిస్థితుల్లో శివయ్య తన డబ్బుకు 'ఆశ పడ్డాడో' ఆలోచిస్తే, ఆ పరిస్థితి తన గుండెల్ని పిండినట్లయింది. నిజంగా తనలో ఏమాత్రం మానవత్వమన్నా మిగిలివుంటే సాటి మనిషిగా తను శివయ్యని ఆదుకోక తప్పదు. అది నైతికంగా తన కనీస ధర్మం!

"శివయ్యా - పద ముందు మనం నీ బిడ్డ వైద్యం



# ధర్మపథం

ఓకేయ్! నేను మీ అన్నయ్యన్రి!!



## ఉచిత ప్రవర్తన

తండ్రికి కలిగిన సంతానంలో అందరి స్వభావం ఒక్కమాదిరిగా ఉండదు. కొందరు సాధువులుగా వుంటే కొందరు దుష్టస్వభావం కలిగి ఉంటారు. కొందరు తమకు ఉన్న దానితో తృప్తి పడితే, కొందరు అత్యాశతో ఇతరుల సొత్తును కాజేయడానికి సిద్ధపడుతూ ఉంటారు. అలాటి సందర్భంలో తండ్రి అమాయకులను ఏడిపించే దుష్టులను మందలించడమూ, శిక్షించడమూ జరుగుతూనే ఉంటుంది. అతడు ఉపేక్షించడు. తాను కలుగజేసుకోవడం అతని ధర్మం.

భగవంతుని ప్రవర్తనా ఇటువంటిదే?

ఇతర ప్రాణుల వలెనే దేవతలూ, దానవులూ కూడా భగవంతునిచే సృజింపబడినవారే! తండ్రికి పుత్రులయందు సమానమైన ప్రేమ ఉన్నట్లు, భగవంతునికి వారియందు సమాన భావం ఉన్నది. అందువల్ల తపస్సు చేసిన అసురులకు త్రిమూర్తులూ కోరిన వరాలు ఇవ్వడం జరిగింది. దేవతలు సాధుస్వభావులనీ, దానవులు దుష్టస్వభావులనీ అందరికీ ఒక అభిప్రాయం ఏర్పడి ఉన్నది. రాక్షసులవల్ల ఇతరులకు అపకారం కలిగినా, బాధకలిగినా, ఆ రాక్షసులను శిక్షించడం భగవంతుని విధి. రాక్షసులు, తమకు వరం ఇచ్చినవారి మీదనే తిరగబడిన సంఘటనలూ మన పురాణాలలో చెప్పబడినవి గదా! అట్టివారిని ఉపేక్షించక తగినట్లు చర్యతీసుకోవడం జరుగుతూనే ఉంటుంది.

బలి చక్రవర్తి రాక్షసులకు రాజు. అతనిలో సత్యసంధత, మహాత్యాగము మొదలైన ఉత్తమ గుణాలున్నవి. అయినా, గొప్ప బలపరాక్రమాలు ఉండుటవల్ల, అత్యాశ అనే దుర్గుణం కారణంగా అతడు దేవేంద్రుణ్ణి తరిమివేసి, అతని స్వర్గలోకాన్ని కూడా ఆక్రమించుకున్నాడు. అతడు విష్ణుదేవునితో మొరపెట్టుకొన్నాడు. విష్ణువు బాగా ఆలోచించాడు. ఆ పరంధాము మే వామనుడైన వటువు రూపంతో సాటి లేని వదాన్యుడైన బలిచక్రవర్తి వద్దకు వచ్చి మూడడుగుల నేలను మాత్రం యాచించాడు. బలి నవ్వి ఇంతేనా? అని అంటే "అంతమాత్రం చాలు"నన్నాడు. సరే అన్నాడు. ఇందేదో మోసమున్నదని, అసురగురువైన శుక్రాచార్యుడు దీనివల్ల నీకు పెద్ద అపాయం కలుగుతుందనీ, దానం ఇవ్వవద్దనీ అడ్డుపడ్డాడు. కాని సత్యసంధుడైన బలిచక్రవర్తి ఏమైనా కానీ, నా ప్రాణం పోయినా సరే! ఆడినమాట తప్పనన్నాడు. వెంటనే వామనుడు త్రివిక్రముడై రెండడుగులతో భూలోక స్వర్గలోకాలాక్రమించి, మూడవ పాదం బలితలపై నుంచి, అతణ్ణి పాతాళానికి అణచి వేశాడు. అంటే– పాతాళాధిపత్యంతో తృప్తిపడి, స్వర్గం జోలికి పోకుండా – దూరంగా పాతాళాన్ని పాలించవలెనని ఆజ్ఞాపించాడన్న మాట! భగవంతుడు వామన, త్రివిక్రమావతారాలు రెండూ ఒక్కసారే ఎత్తినట్లు దీనివల్ల తెలుస్తున్నది. ఇంద్రుని కష్టం తీరింది.

దీనివల్ల భగవంతుడు తన వారిపట్ల సముచితంగానే ప్రవర్తించాడని తెలుసుకోవలసి ఉన్నది.

–బులుసు వేంకటరమణయ్య

## సేవాధర్మం

సంగతి చూడాలి" అంటూ ఆ యువకుడు శివయ్యని వెంట బెట్టుకొని హాస్పటల్‌కి పరుగెత్తాడు. డాక్టరుగారి రూం బయట బల్లలపై ముక్కుతూ, మూలుగుతూ ఎందరెందరో రోగులు! పైన నేమ్ బోర్డుపై మెరుస్తున్నాయి అక్షరాలు డా. ఎ ధర్మరాజు, ఎం. డి." అని

ఓహ్! ఈ డాక్టరు టౌన్‌లో తన రూంకి ఎదురుగా ఉన్న అధునిక భవంతిలో కాపురముంటున్న ధర్మరాజు గారేనన్న మాట. ఒట్టి డబ్బు మనిషి అని చెప్పుకుంటారు జనం ఆయన గురించి. వాళ్ళ అమ్మాయికి తను గతంలో కొంతకాలం ట్యూషను చెప్పాడు కూడాను! అయినా అంతమాత్రానికే తనని గుర్తు పడతాడని ఏమిటి గ్యారంటీ?- కానీ, మన ప్రయత్నం మనం చేద్దాం. ఆపైన భగవంతుడే వున్నాడు" అనుకొంటూ శివయ్యని అక్కడే బరుట వుండమని చెప్పి, తాను డాక్టరుగారి దృష్టిలో పడేలా అటూ యిటూ తచ్చాడాడు.

ధర్మరాజుగారు తనని చూసారు కాబోలు! బెల్ కొట్టి ప్యూన్‌ని పిలిచి తనని రమ్మని కబురెట్టారు. వెళ్ళి నమస్కారం చేసాడు తను అయన చిరునవ్వు చిందిస్తూ "ఏంటోయ్! యిలా వచ్చావు? ఏంటి సంగతి" అన్నారు. విషయం చెప్పి, మల్లమ్మని, పసిబిడ్డని లోపలికి తీసుకువెళ్ళి డాక్టరుగారి చేతిలో నలభైఐదు రూపాయలు పెట్టి, కేసు విషయం చెప్పి,

"క్షమించండిసార్! ఓ ఐదు రూపాయలు తక్కువయ్యాయి. యిచ్చేస్తాను కానీ మీ రెలాగయినా యీ పసిబిడ్డ ప్రాణాలు కాపాడాలి కనీసం నా కోసం సార్!" అన్నాడు దీనంగా అర్థిస్తూ.

"ఆఁ డబ్బు దేముంది లేవోయ్!" అంటూ ఓ నిమిషం ఆలోచించి నోట్లు మడిచి లోపల పెట్టుకున్నాడు ధర్మరాజుగారు. గబగబా పిల్లని పరీక్షించి ఏవో ఇంజక్షన్లు, మందులు యిచ్చారు. భగవంతుడి దయవలన బిడ్డ బతికింది. శివయ్య, మల్లమ్మ, కుర్రాడు డాక్టరుగారికి మరీ మరీ ధన్యవాదాలు చెప్పి వెనక్కి తిరిగారు.

"ఇలా చూడండి!" ధర్మరాజుగారు పిలిచారు-

"ఈనాడు మీ పసిబిడ్డ ప్రాణాలు దక్కాయీ అంటే అందుక్కారణం మీరనుకొంటూన్నట్లు నా వైద్యం కానేకాదు ఇదుగో యీ కుర్రాడి మంచితనం – గొప్పదనం" అంటూ.

"బాబూ! మసక కమ్మిన మానవత్వానికి ముసుగు విప్పావు ఇదుగో – ఈ నలభైఐదూ నువ్వే తీసుకొని వెంటనే పరీక్ష ఫీజు కట్టెయ్యి –" అంటూ కుర్రాడి భుజం తట్టారు ఆప్యాయంగా. కాంపౌండరు కనకయ్య బజారు సెంటరులో పర్సుపోగొట్టుకున్న యువకుడి వైనం డాక్టరుగారి చెవిన వేసాడు పూసగుచ్చినట్లు అంతకుముందే.

జేబులోంచి మరో యాభై రూపాయలు తీసియిస్తూ, "మరో విషయం – శివయ్యా ఇదుగో ఈ ఏభై రూపాయలూ వుంచండి పిల్లకి పళ్ళు, టానిక్కులూ కొనండి" అంటూన్న ధర్మరాజుగారిలో, ముక్కోటి దేవతలూ, ఒక్కటై కనబడ్డారు ముగ్గురికీ – ఆ క్షణంలో... హృదయంలో ఆసనం పరిచి, మనసుతో ఆరాధించారు. ధర్మమూర్తి అయిన ధర్మరాజుగారిని, ఆ ముగ్గురూ, ఏకకాలంలో, కలికాలంలో ధర్మదేవత ఒంటిపాదంపై నడుస్తుందని చెబుతారు. అయితే ఆ ఒంటిపాదానికి కూడా నడకను నేర్పింది 'సేవాధర్మం'. □



# దూరదర్శనం

లత

శుక్రవారం (30-1-87) నాటి కార్యక్రమం గోబెల్‌గారి వేణువాద్యంతో ప్రారంభం అయింది- పేరు స్వర మాధురి- కొంచెం వగరుగా ఉంది

మళ్ళీ పండగొస్తుంది- నాటిక- ఇది ఎరువుల మీద,పంటలుపాడవటం మీద నాటిక

## ఇంద్ర ధనుస్సు

పాద రక్షల ప్రహసనం- సయద్‌అయూబ్ పర్యవేక్షణ- హాస్యం పండింది నాటిక బాగుంది ఈ అయూబ్‌గారు విజయవాడ రేడియో డైరెక్టరే గనక అయుంటే ఆయన తమిళంలో మంచి రచయిత ఏమైనా ఎవరైనా నాటిక బాగుంది

## యాత్ర

రైలు కన్యాకుమారి నుంచి బదల్‌పూర్ చేరింది మధ్యలో నాగాలాండ్ మిజోరాంలు దాటింది ఏనుగులు పట్టాలమీద చెట్లు పడేసినయ్ కూలీలకి సెలవు ఇవ్వని రైల్వే కాంట్రాక్టరు మెనత్తనీ శివుడిన చూసి నవదంపతులు దిగిపోయినారు. ఒంపురి భారత దర్శనంలో మధ్య భారతంలో సంస్కృతి లేదని అంటాడు- విచారించాలి. మొత్తానికి శ్యామ్ బెనగల్ మనని భారతదేశం ఆ చివరి నుంచి ఈ చివరికి చేర్చాడు.

ఈ రోజు గాంధీజీ వర్ధంతి. టి.వి.లో ఆయన సమాధి దర్శనం అయింది.

## టేమింగ్ ఆఫ్ ది ష్రూ

షేక్స్‌పియర్ మహాకవి వ్రాసిన హాస్యనాటిక ఇదే సినిమాలో ఎలిజబెత్ టేలర్ నటించి చాలా నవ్వించింది. ఒక గయ్యాళి యువతిని మంచి భార్యనుగా తయారు చేసుకోవటం ఇందులో కథ అందరికీ తెలిసిన కథే ఇది కనక చెప్పనవసరం లేదు

## మానవతా దృక్పథం వైపు

అల్లాడి కుప్పుస్వామిగారి ప్రసంగం (ఈయన జడ్జీగారు కాదుగద? ఈ ప్రసంగంలో భారతంలోని ఒక్క ప్రస్తుడి కథ చిత్రరూపం చూపించారు అది బాగుంది వీరి ప్రసంగం ఉన్నత ప్రబోధాలతో బాగుంది సెక్సు పాఠాలు చెప్పాలనే రోజుల్లో నైతిక ప్రమాణాల గురించి వీరి ప్రసంగం ప్రజలపై ప్రభావం చూపుతుందా? ఏమో మరి?

భోగిమంటలు. చలనచిత్రం దర్శకత్వం శ్రీమతి విజయనిర్మల హీరో కృష్ణ కథ పల్లెటూరి మోతుబరుల రాజకీయాల మీద నడిచింది

ఆదివారం ఉదయం సిక్కుల ప్రార్థన అంత అత్యవసరమా అనిపిస్తుంది. ఆల్‌రైట్ సత్‌శ్రీ అకాల్- తరువాత రామనామం వినిపిస్తుంది ప్రాధాన్యత శ్రీరామచంద్రుడికన్న సిక్కు గురువులకే ఉన్నట్లున్నది-

## అప్పూ ఔర్ పప్పూ

ఈ నాటిక ముందుకు జరక్కుండా ఇహ విసుగు కలిగిస్తున్నది ఒక సింహం, పులి, ఏనుగు వీటి ముఖాలు బాగున్నాయి- కాని గొంగళి వేసిన చోటే ఉంది

## రామాయణం

సమర్పణ రామానందసాగర్- దాశరథి ఒక సుధానిధి. ఆయన విద్యాభ్యాసం, అందులో అరుంధతి మాతృభావన అనిర్వచనీయం- అద్భుతం రామానందసాగర్ ధన్యుడు ఉపనయన సంస్కారం పొంది మాతృభిక్ష అడుగుతున్న బాలదాశరథిని కన్నులకు కట్టినట్లు చూపించాడు. యోగి సమానుడైన కుమార దాశరథి అందాలు పురుషోచితంగా ఉన్నాయి.... అహా ఏమి ఈ రామాయణ ఇతిహాస కథా సౌందర్యం? ఏమి ఈ రామాయణ సుధాకథన మాధుర్యం?

"రామాయణం"లో సీతగా దీపిక



బాంక్ రాబరీ మీద ఒక ఇంగ్లీషు సీరియల్ వస్తోంది. డెర్లిటీవిక్లై అని తెరమీద ఉంటోంది. ఒల్ఫ్‌ఫాక్స్ ఇందులో డిటెక్టివ్ అనుకుంటాను. ఇది చదివిన గుర్తులేదు. కనిపించేదే వ్రాస్తున్నాను. వారానికో హత్యతో ఇది నడుస్తోంది. ఈ తడవ బాత్‌టబ్‌లో హత్య- రోప్‌కార్‌లో ప్రయాణం, మంచులో స్కేటింగ్ వగైరా చూపించారు. బాత్‌టబ్‌లో చచ్చిన వాడిని అతని భార్యే చంపినట్లుంది.

## ఎడ్యుకేషన్

శనివారం నాడు శ్రీ ఆనందకుమారస్వామి జీవితం మీదా చిత్రకళ మీదా మంచి డాక్యుమెంటరీ చూపించారు భారతీయుడైన ఈయన సిలోన్‌లో స్థిరపడి చిత్ర నాట్యాలమీద మహా పరిశోధన చేసిన ఉదయశంకర్ నటరాజ భంగిమని దిద్దిన కళాకారుడు రవిశంకర్ సంగీతంలో ఆనందకుమార స్వామి ప్రభావం ఉంది ఇండియన్ ఆర్టు మీద ఆయన వ్రాసిన పుస్తకాలు చాలా ప్రసిద్ధి చెందినయ్- 30 సంవత్సరాలు అమెరికాలో బోస్టన్‌లో ఉన్నాడు- ఇండియన్ ఇండోనీషియన్ ఆర్టుమీదా, వేదాంతం మీదా, నృత్య సంగీతాల మీదా ఆయన రచనలున్నాయి ఎంతటి మహానుభావుడైనా బోస్టన్‌లో తన కలెక్షన్స్ ఉంచి అక్కడే కీర్తిశేషు లవటంవల్ల ఇండియా చాలా కోలుపోయింది నా ఉద్దేశ్యంలో ఆ సుందర ప్రతిమల్ని చూసి ఆ వ్యామోహంతో పాశ్చాత్యులు మన కళాఖండాల్ని స్మగుల్ చేస్తున్నారు నేటికీ ఈ పరిణామాన్ని ఆనంద కుమారస్వామి బహుశా ఊహించి ఉండరు. ఎడ్యుకేషను ప్రోగ్రాంలో ఈ డాక్యుమెంటరీ చూపించారు. నిజానికి వాటిని గురించి వ్రాయని నాకు కూడా ఈ డాక్యుమెంటరీని సమీక్షించాలనిపించిందంటే ఇక ఆ శిల్ప శాస్త్రపు గొప్పతనం వేరే చెప్పక్కర్లేదు.

ఆనంద కుమారస్వామి గురించి వ్రాసిన వెంటనే ఘుర్‌బాహర్ గురించి వ్రాయాలంటే ఆకాశం నించి పాతాళంలో పడ్డట్లు- షహనాజ్ హుసేన్‌తో పరిచయం వచ్చింది- ఆవిడ డ్రస్ కొంచెం వింతగా ఉంది కాని ఆవిడ పసుపు రాసుకోవటంవల్ల వచ్చే ఆరోగ్య సౌందర్యాన్ని గురించి మాట్లాడింది. సెనగపిండి, పసుపు ఇంకా కొన్ని చిట్కాలతో అందం ఎలా సంపాదించుకోవచ్చో చెప్పింది. నాకు గుర్తున్నంత షహనాజ్‌బేగం ఢిల్లీలో గొప్ప బ్యూటీపార్లర్ నడుపుతున్నది. ఆవిడ శిష్యులు దేశంలో ఇలాటివి నడుపుతున్నారు. ఆవిడ గురించి ముందు పరిచయం వివరంగాలేదు. సౌందర్య పోషణ గురించి చెప్పే ఈ బేగం సాహెబా సౌందర్యవతి కాదు. ప్రపంచంలో ఎవరికేది లేదో దాన్ని గురించి ఆరాట పడతారని ఎవరో రచయిత అన్నది నిజం. నా ఉద్దేశ్యం ఈ అందంకోసం ఆడది ఆరాట పడకుండా ఉంటేనే అందంగా ఉంటుంది. నిర్లక్ష్యం వల్ల హుందా వస్తుంది-

☐

పాఠకుల శీర్షిక

# గర్భస్థ శిశువు చెప్పిన కథలు

## గర్భరహస్యం

అన్ని రంగాలలో వెనుకబడ్డ రంగారెడ్డి జిల్లాలో సంప్రదాయ కుటుంబాన పుట్టిన నేను ఎన్నో గుడ్డినమ్మకాలను విదిలించుకుని ఉన్నత విద్య నభ్యసించాను. అంతంత మాత్రంగా చదువుకున్న మా పల్లె ప్రజల కల్లా కళాశాల చదువు నేర్చిననేను విద్యావతిగా గుర్తింపు పొందాను. కాలేజిలో అటు చదువే గాక లలిత కళలలో సైతం నేను రాణించి ఉత్తమ విద్యార్థినిగా ప్రశంసలు పొందాను. సనాతన బ్రాహ్మణ కులంలో పుట్టిన నేను బంగారు పతకం పొంది విశ్వవిద్యాలయ పరిధిలో మేటిగా పలువురి దృష్టి నాకర్షించాను. కానీ ఆర్థిక పరిస్థితుల అననుకూలంతో భవిష్యత్తు విద్య పట్ల నేను కన్న రంగుల కలలన్నీ చెదరి పోయాయి. రాజీపడి రాష్ట్ర ప్రభుత్వ సంస్థలో ఒక చిరుద్యోగంలో కూర్చున్నాను. మా పెద్దలు తెచ్చిన వరుడు భర్తగా నాజీవితంలో అడుగు వేశాడు. నా నోము ఫలము కొద్దీ నా అభిరుచికి సరిపడ్డ వాడే. ఆయన కేంద్ర ప్రభుత్వ ఉద్యోగి. పెళ్ళయిన ఏడాది నుండీ నేను పిల్లల్ని కనటం ప్రారంభించాను. తొలిచూలుతో ఆడపిల్ల కలిగింది. అందరి ముఖాలూ నల్లబడ్డాయి. మా ఆయన, నేను యథాలాపంగా వుండి పోయాము. రెండవ దఫాతిరిగి ఆడపిల్లే పుట్టింది. మూతులు ముడుచుకో సాగారు అంతా. మావారు నేను ముసి ముసిగా నవ్వటం కంటే ఏమీ చేయలేక పోయాము. మూడవ కాన్పు మా అత్తింటివారు చేశారు. వారి హస్త వాసి ఏమయినా మారుతుందోనని ఆదుర్దా, ఆతృత పడ్డారు కానీ రాతలో, లింగంలో భేదం లేదు. ఇక ట్యూబెక్టమీ చేయించుకుంటానని శత విధాలా అమ్మానాన్న, అత్తా మామలకు నచ్చ చెప్పాము. కానీ మిగతా విషయాలలో వారెంత విభేదించు కున్నా ఈ కుటుంబ సంక్షేమ ఆపరేషన్ వద్ద కొచ్చేసరికి ఆ ఇరు పక్షాలూ ఒకే మాట మీద నిలబడేవారు. వారి సంఘీ భావానికి మెచ్చుకున్నాను. ఆ శస్త్ర చికిత్స వంశానికే అనర్థమట. ఇక తరతరాలకూ మాకుటుంబాన సంతతే కలుగదట. మా వారునేను చెప్పగా చెప్పగా చివరకు 'ఒక మగబిడ్డ పుట్టాక' ఆ పిల్లల ప్రేగు తీసి వేయుటకు సమ్మతించారు. అక్కడ నుంచీ మళ్ళీ రెండు కాన్పులు. ఊఁహుఁ! మన పప్పులేం ఉడకలేదు. మళ్ళీ ఆడంగులేను. మా పెద్దల పట్టు ఏమాత్రం సడలేట్టు లేదు. అనుకో కుండా మా ఆలుమగలకు సర్కారు జిల్లాలకు బదిలీ జరిగిందా రోజులలో. నా పెనిమిటి నేను ఒక వ్యూహం పన్నినాము. ఆపథకం మేరకు ఆయన వేసక్టమీ చేయించుకున్నాడు. అంతటితో నా కడుపున కాయలు కాయటం ఆగింది. ఈ రహస్యం తెలియని మా వాళ్ళంతా నేను నెలనెలా వారపోతుంటే ఉత్తరాల ద్వారా తెలుసుకుని విసుక్కునేవారు. సంవత్సరం తిరిగే కల్లా మా ఇంట ఊయల వూగుతుండేది అంత క్రితం ఇటీవల ఆదృశ్యాలు మరుగవడంతో వాళ్ళంతా కోపగించుకునే వారు. నా ముట్టు నిలవక పోవడం చూచి నిరసనగా వారంతా నాపిల్లలను ముట్టుకునే వారు కాదు. కానీ మా వారి ఆపరేషన్ వార్త నేటికీ గుప్తంగానే వుంచాము.

అయితే మేము ఉద్యోగ జీవితంలో ఇందరు పిల్లల్ని కని ఎంత పొగొట్టు కున్నది ఆ గ్రామీణ ప్రజల కేమి తెలుసు? చేతివ్రేళ్ళన్ని పిల్లల్ని కని చేజేతులా వేతనపరంగా, హోదా పరంగా మరెన్నో రాయితీలను కోల్పోవలసి వచ్చింది.

ఇందరు ఆడపిల్లలు నాచుట్టూ తిరుగుతున్నా తృప్తినిచ్చే అంశం ఒక్కటే మిగిలింది నాకు. స్త్రీగా నాకు కొన్ని కోరికలు మిగిలిపోయాయి. వీరిద్వారా అవి నెరవేరాలని నా తాపత్రయం. విదేశీ వనితలయిన అనిబిసెంట్ నేటి మదర్ థెరీసా, మన వారయిన జిజియాబాయి, కస్తూరి



బాయి, అమరేందిర, 'మయూరి' చిత్ర నాయిక సుధాచంద్రన్, నెల్లూరు జిల్లా కలెక్టరు కుమారి సుజాతారావు ప్రభృత మహిళా మాణిక్యాలు ఈ నా ఆడసంతతి పెంపక పోషణలో నిత్యం ఒక మారయినా స్మరణకు వస్తుంటారు.

—చిరుతానూరు సునీతకుమారి,
దర్గామిట్ట, నెల్లూరు




## కనువిప్పు కావాలి

ఈ 20 వ శతాబ్దంలో కూడా ఇంకా ఆడపిల్ల, మగపిల్లవాడు అని ఆలోచించుట అనవసరం అని నా ఉద్దేశ్యం. ఎందువల్లనంటే శారీరకంగా మగవాళ్ళు స్త్రీలకంటే బలవంతు లయితే అవవచ్చుకాని బుద్ధి బలంలో గాని మరే ఇతర కార్యకలాపాల్లోగాని చదువు, క్రీడలలోగాని మగవారికేం తీసిపోవటం లేదు. ఆ మాటకువస్తే ప్రస్తుతం క్రీడలలో మనదేశం తరపునైతే పి. టి. ఉషను. ప్రధాని ఇందిరాగాంధీలనే స్ఫూర్తిగా తీసు కుంటే మగవారికంటే కూడా తమ ప్రతిభను కనపరిచారు. కరాటే మొ.వి. మహిళలు ఆత్మరక్షణకోసం ఎన్నుకుంటే బయటి ప్రపంచంనుంచి వచ్చే విపత్తులనుంచి ఆత్మరక్షణ చేసుకో వచ్చు. 20 సం. రాలకు ఇప్పటికే మహిళలు 50 శాతం అభివృద్ధి చెందారు. చదువుతోపాటు సంస్కారం, పరిస్థితుల నర్థం చేసుకొను పరిజ్ఞానం తెలివితేటలు కల్గుతాయి. చాలమంది చదువును వృథా చేసుకోకుండగ ఏదో ఒక ఉద్యోగంలో ప్రవేశించి ఆర్థికంగా కూడ కుటుంబానికి తోడ్పడుతున్నారు. ఏవో కొన్ని వ్యవసాయ, వ్యాపార కుటుంబాలలో అయితే తమ కుమారులు ఇంటివద్ద ఉండి తమకు చేదోడు వాదోడుగా ఉంటారు. కాని మిగిలిన చాలా కుటుంబాలలో మగ పిల్లవాడైనా ఉద్యోగరీత్యా తల్లి తండ్రులను వదిలి వెళ్ళిపోవలసిందే కదా. అటువంటపుడు ప్రత్యేకం మగ పిల్లలే కావాలి, ఆడపిల్ల అనేసరికి అమ్మో అని గుండెలమీద చేతులుంచు కునే రోజులు పోవాలి. ఇద్దరు అబ్బాయిలు కల్గితే ఆపరేషన్ ధైర్యంగా వాలని చేయించుకుంటున్నారు. అదే ఇద్దరమ్మాయిలనేసరికి ఆలోచిస్తు న్నారు. ఎవరికైనా చదువు నిమిత్తంచేసే ఖర్చు తప్పదు. అమ్మాయిలకిచ్చే కట్నం దురాచారం పోవాలి. కాని ప్రస్తుతం అది విలయ విహారం చేస్తుంది కాబట్టి కొద్దో గొప్పో ఇచ్చి పెండ్లిచేసి పంపి బరువు తగ్గించుకుంటున్నాం అంటు న్నారు. కాని అబ్బాయిలకు ఆస్తి రూపంలో అంతకుమించి కష్టపడి సంపాదించి ఇస్తున్నారు. చివరకు వారిని లేవలేని స్థితిలో డబ్బో, ప్రేమో



ఉంటేగాని సరిగా చూడరు. ఉద్యోగ రీత్యా దూరంగా ఉన్న కొడుకైనా అత్తవారింట్లో ఉండే కుమార్తె అయినా ఒకేలా చూడటాన్కి వస్తున్నారు. కాని కొడుకులమీద మటుకు తమ ప్రేమను చూపుతున్నారు. ఆడపిల్ల అంటే "ఆడ" (అక్కడి) పిల్ల. మగపిల్లవాడంటే ఈడ (ఇక్కడ) ఉండే వాడన్న అభిప్రాయం పోవాలి. ఇప్పటికీ ఆడపిల్లల్ని కన్నందుకు కోడల్ని బాధ పెట్టే అత్తమామలు, వదిలేస్తాననే భర్తలూ అక్కడక్కడ ఉన్నారు. వార్కి కనువిప్పుకావాలి. తమకు ఒకస్త్రీయే జన్మనిచ్చిందని మరువరాదు. ఏ సరదా తీరాలన్నా ఆడపిల్లలతోనే అంటారు. ఆడ, మగ కడుపులో శిశువు అని తెల్సుకుని అబార్షన్ చేస్తే, చివరకు కొన్ని సంవత్సరాలకు ఆడపిల్లల కరువు ఏర్పడుటే కాక చాలా ఇబ్బందులకు



లోను కావల్సివస్తుంది. ఓర్పు, నేర్పుతో స్త్రీయే కుటుంబాన్ని చక్కదిద్దగలదు. కుటుంబానికి ఆర్థికంగా సహాయపడ గలదు. ఎక్కువ బాధ్యత స్త్రీయే వహిస్తున్నది. అయినా ఎందుకో ఇంకా పురుషాధిక్యత అహంకారం అన్ని విధాల ఉంది కూడా ఎదురు డబ్బు ఇచ్చి వా రింటికి వచ్చి, వార్కి సహాయపడు తున్నా ఇంకా స్త్రీని చిన్న చూపే చూస్తున్నది. ప్రస్తుత సమాజం ముఖ్యంగా స్త్రీకి స్త్రీయే (అత్త ఆడబిడ్డలే) శత్రువుగా ఉండి అణగ ద్రొక్కుతున్నారు తనూ ఒక ఇంటికోడలే అని మరచి భర్త తమ తల్లి, సోదరి కూడా స్త్రీలేనని గమనించాలి ఒక్కో ఇంట్లో కోడల్ని కూతురులా చూస్తున్నారు వారిల్లు కలకలలాడుతూ ఉంటుంది కాబట్టి ఎవరైనా ఒకటే ఈ రోజుల్లో ఆస్తి హక్కు కూడా ప్రభుత్వం కల్పిస్తున్నప్పుడు అంతా ఒకటే

—కొల్లేపల్లి రత్నావళి,
రాజమండ్రి

# అమ్మా నన్ను హత్య చెయ్యకమ్మా

డాక్టరు జయలక్ష్మి వద్ద పరీక్ష చేయించుకుని వచ్చిన వసంత నిస్సత్తువగా వెళ్ళి బెడ్ మీద వాలిపోయింది. మనస్సు అల్లకల్లోలంగా ఉంది. తాను నెల తప్పినట్లు తెలియగానే, ఎంతో పొంగి పోయింది. తాను, భర్త బాబే కావాలని కోరుకున్నారు. కాని తన గర్భంలో ఉన్నది ఆడపిల్ల అని తెలియగానే మనస్సు కృంగిపోయింది. ఉదయం ఆఫీసు కెడుతూ భర్త "వసూ డాక్టర్ వద్దకు వెళ్ళి పరీక్ష చేయించుకుని ఆడపిల్ల అయితే అబార్షనుకు డేట్ ఫిక్స్ చేసుకురా బాబే అయితే తనకు అంతకన్న ఆనందం లేదు అని చెప్పి వెళ్ళారు. ఆడపిల్ల అనేసరికే కంపరం వచ్చింది. తన వివాహం చేయడానికి గుమాస్తా గిరి చేస్తున్న తన తండ్రి ఎన్ని అగచాట్లు పడ్డారు అత్త వారింట్లో తన బాధ శత్రువులకు కూడా వద్దు తన భర్త సహృదయుడు కనుక సరిపోయింది లేకపోతే తనగతేమయ్యేది? తన బిడ్డకి కూడా మళ్ళి ఈ అవస్థలా? వద్దు బాబోయ్ ఆడపిల్ల అమ్మా? ఉలిక్కి పడింది వసంత "నేనమ్మా నీగర్భంలో ఉన్న శిశువుని అమ్మా నాకు జన్మనియమ్మా! నన్ను చంపవద్దమ్మా'

'చిట్టి తల్లి ఆక్రోశించింది వసంత మనసు



"అమ్మా! నన్ను భూమ్మీదకు తీసుకు రావడానికి భయమెందుకమ్మా, నీకు నాన్నగారికి? కేవలం వరకట్న పిశాచానికి భయపడేనా? అమ్మా! ఆడపిల్ల ఈ నాడు వరకట్న పిశాచానికి కాదు, ఆనాడు కన్యాశుల్కానికి కూడా బలయింది కాదా అమ్మా? డబ్బు కాశపడి మూడు కాళ్ళ ముదుసలికి ముక్కుపచ్చలారని పిల్లని కట్టపెట్టే వారు కాదా? ఆనాడు వధువు తల్లి తండ్రులైతే ఈనాడు వరుని తల్లి తండ్రులూ, ఆడపిల్ల అగచాట్లకు కారణం కాదా! అమ్మా మనుష్యుల్లో మార్పుకు తీవ్రమైన కృషి జరగాలే కాని ఆడజాతినే నాశనం చేస్తారా? అమ్మా! ఆడపిల్లకు పెళ్ళే జీవితం కాదమ్మా జీవితంలో పెళ్ళి ఒక భాగం మాత్రమే చక్కని చదువు, సంస్కారం, మనోధైర్యం ఆడపిల్లకు నేర్పితే, కులమతాలకు ప్రాముఖ్యత నివ్వకుండా ఉంటే ధైర్యంగా ముందడుగు వేస్తుందమ్మా తనకు నచ్చిన, తనను మెచ్చిన వాడు దొరికి నప్పుడే పెళ్ళి జరుగుతుంది ఈ సమాజానికి వెరవని మనోధైర్యం, సాహసం ప్రతి తల్లి తండ్రులు అలవరచుకుంటే, తమ మగశంతానానికి కట్నం తీసుకోమనీ, ఆడపిల్లకు ఇవ్వమనీ తీవ్రమైన నిర్ణయానికి వస్తే ఆడపిల్ల ప్రగతికి బంగారు బాట వేసిన వాళ్ళు అవుతారు ఆడదానికి మగవాడి అవసరం ఎంతో మగవాడికి ఆడదాని అవసరమూ అంతే ఉంటుందమ్మా పిరికి తనంతో ఆడజాతినే నాశనం చేస్తే కొన్ని సంవత్సరాలకు ఒక ఆడదాన్ని నలుగురు మగవాళ్ళు వివాహం చేసుకునే పరిస్థితే వస్తే అది మాత్రం దుర్భరం కాదా? అప్పుడు ఆడబిక్ష పెట్టమని భగవంతుని ప్రార్థిస్తారా? అమ్మా నన్ను మీ లోకంలోకి రానీయమ్మా భయపడకు వయస్సు వచ్చిన ఆడపిల్లకు వెంటనే పెళ్ళి చేసేయాలి అనే మూఢ అభిప్రాయాలకు స్వస్తి పలుకు ఇప్పుడిప్పుడే ఆడజాతి పురోగమిస్తున్న తరుణంలో పిరికి తనానికి తావు ఇవ్వకండి తల్లులూ అని నువ్వే చాటమ్మా ఇంక ఉంటానమ్మా అంతవరకూ ఏదో లోకంలో ఉన్నట్టున్న వసంత స్పృహలోకి వచ్చినట్లయి నూతనోత్తేజంతో, స్థిరాభిప్రాయంతో తన భర్తకి కూడా నచ్చ చెప్పాలన్న నిశ్చయాని కొచ్చింది

పి. యశోధర, చాగల్లు □

కూపన్

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## గర్భస్థ శిశువు చెప్పిన కథలు

కథ వ్రాసం రాసిన వారి పేరు . ______________________

______________________

పూర్తి చిరునామా ______________________

పిన్ కోడ్ ______________________




శ్రీ కడియాల వెంకయ్యగారు

# అలనాటి ఎడ్ల పోటీ విజేత శ్రీ కడియాల

ఒక్కొక్కరు ఒక్కొక్క రంగంలో ఎనలేని కీర్తి నార్జించుకుని చరిత్ర పుటల్లో చిరస్థాయిగా నిలిచి పోతారు అటువంటి కోవకు చెందినవారే శ్రీ కడియాల వెంకయ్యగారు రైతుకుటుంబంలో పుట్టిన వీరు 1950 నుండి 62 వరకూ ప్రతీ సంవత్సరం తమ స్వగ్రామంలో జరిగే ఎడ్ల పరుగు పోటీల్లో తమ ఎడ్ల జతలను ప్రవేశపెట్టి ప్రథమ బహుమతులు గెల్చుకుంటూ ఎడ్ల పరుగు పోటీల్లో తిరుగులేని విజేతగా సాటిరైతులలో పేరు పొందారు తెలుగునాట రైతుల జీవకళగా పరిగణింపబడే ఎడ్ల పోటీలకు ఆయన కృషి ప్రశంసనీయం

కృష్ణాజిల్లా ఉయ్యూరు తాలూకా చినవోగిరాల గ్రామ రైతు శ్రీ సీతారామస్వామి- అచ్చమ్మ దంపతులకు 1932లో జన్మించారు వెంకయ్యగారు ఒకవైపు బెజవాడలో కె ఎ ఆర్ ట్రావెల్సు బస్సుల సర్వీసు నిర్వహిస్తూ మరోవైపు జాతి పశువులను పోషిస్తూ ఇంకోవైపు ఎడ్ల పోటీలకు గిత్తల జతను కృషి సలుపుతూ 1962లో నందిగామ లో జరిగిన ఎడ్ల పరుగు నదిలో వున్న ఇసుకలో బండిలాగుడు పోటీలలో తమ గిత్తల జతను పాల్గొనపెట్టి రెండు ప్రథమ బహుమతులు అందాల పోటీలో మరో ప్రథమ బహుమతి గెలుచుకుని ఆ మూడు బహుమతులను సినీ నటుడు శ్రీ రేలంగి వేంకట్రామయ్యగారి చేత అందుకున్నారు వెంకయ్యగారు తరువాత ఉయ్యూరులో జరిగిన ఎడ్ల పరుగు పోటీలో కూడా ప్రథమ బహుమతి నెగ్గారు 1964లో గుంటూరులో జరిగిన రెండవ సైజు ఒంటిద్దు ఇసుకలాగుడులో ఫస్టు, జోడెడ్ల ఇసుకలాగుడులో ఫస్టు గిత్తను నైపుణ్యతతో తోలినందుకు హిందూ కాలేజీ స్టూడెంట్సు స్పెషల్ బహుమతి అందాల పోటీలో ప్రథమ బహుమతులను అందుకున్న వెంకయ్యగారు ఎడ్ల పోటీ విజేతలకు ఆదర్శప్రాయులయ్యారు

విజయవాడలో కె ఎ ఆర్ ట్రావెల్సు బస ఓనరుగా ఉంటూ స్వగ్రామంలో ఉన్న పశువుల్ని ప్రతి నిత్యం వెళ్ళి చూసి రావడం ఆయన దినచర్య కృష్ణాజిల్లా టూరిస్టు బస్సుల ఓనర్సు అసోసియేషన్‌కి ప్రెసిడెంటుగా ఉన్నారు

1958లో చెరుకురైతు సంఘం తరుపున వెంకయ్యగారు ఆనాటి పార్లమెంటు సభ్యులు వై ఎ కృష్ణారావుగారు, భూపేష్‌గుప్తాగారు ఎ కె గోపాలన్‌గారు టి బి విఠల్‌రావుగారు, తరిమెల నాగిరెడ్డిగార్లతో కలిసి ఢిల్లీ వెళ్ళి వ్యవసాయ శాఖామంత్రి శ్రీ అజిత్‌సింగుజైన్‌తో సంప్రదించి రైతులకు మేలు కలిగించారు అటువంటి కార్యక్రమాలలో ముందంజవేసి వెంకయ్యగారు రైతులకు ఎంతో సేవ చేశారు

1986లో విజయవాడలో జరిగిన శ్రీ కాకాని వెంకటరత్నం మెమోరియల్ ఆంధ్ర రాష్ట్ర ఎడ్ల అందాలు లాగుడు పోటీల కమిటీకి సలహాదారుగా ఉండి ఆ పోటీలను క్రమ పద్ధతిలో నడిపించి పోటీ విజేతలకు ఘనమయిన బహుమతులు ఇప్పించిన ఘనత వెంకయ్యగారికే దక్కింది వీరి స్వీయ ధనంతో ఆ పోటీ విజేతల్లో కొందరికి ప్రత్యేక బహుమతులను ఇచ్చారు తన ఎడ్లజతలో పాల్గొనే స్పెషల్ బండిలాగించిన ఎరుకల కులస్తుడు రామయ్యకు- అర్ధవెయ్యిన్నూట పదహార్లు, రెండుబస్తాలు జొన్నలు విరాళంగా యిచ్చి పేదలపాలిటి పెన్నిధి శ్రీ వేంకయ్యగారు అని ఋజువు చేసుకున్నారు శ్రీ వెంకయ్యగారికి బాల్యం నుంచి చెడుగుడు పోటీల్లో ప్రవేశం ఉన్నది 15-10-86లో తమ స్వగ్రామంలో జరిగిన బండి వెంకటకృష్ణయ్య మెమోరియల్ ఆంధ్ర రాష్ట్ర చెడుగుడు పోటీల్లో శ్రీ వెంకయ్యగారి శ్రీమతి స్వర్గీయ శ్రీ కడియాల కస్తూరమ్మ మెమోరియల్ మూడు సంవత్సరాలు రోలింగు బహుమతిగా స్వీయ ధనంతో సుమారు పదివేల రూపాయల విలువగల బంగారు నందిని బహూకరించారు అదికాక ఇంకా అనేకమైన బహుమతులు బహూకరించారు వెంకయ్యగారు

—బొజ్జా సత్యనారాయణ

## సంక్రాంత సంచిక

"ఆరోహణ" సీరియల్ శైలి బాగుంది కథనంకూడా పకడ్బందీగా ఉంది పాత్రలు జీవం ఉట్టిపడేలా ఉన్నాయి సినీ పరిశ్రమలో నేడు జరుగుతున్న విధానాన్ని చక్కగా చిత్రీకరించారు

కె నీలిమ, నార్తురాజాపాలెం (నెల్లూరు)

* * *

సంక్రాంతి సంచిక కథల పోటీల ఫలితాలతోను, కార్టూన్‌లతోను సంక్రాంతి విశేషాలతోను చాలా మనోజ్ఞంగా ఉన్నది

ఆకెళ్ళ సుబ్బారావు, కందికుప్ప

* * *

## ఉత్తరాలు

( 4 వ పేజీ తరువాయి)

నటి మాధవి ముఖ చిత్రంతో వెలువడిన సంక్రాంతి సంచికలో 'ఆశయం కొత్త సీరియల్ చాలా బావుంది వడగళ్ళు', 'క్రమ శిక్షణ కథలు ఫస్టుగా వున్నాయి ముఖ్యంగా 'ఒడిలో చెలి మోహన రాగం' అందరినీ ఆకట్టుకుంది

చే దవరపు నాగేశ్వరరావు, రమాదేవి హైదరాబాదు

* * *

'మాధవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చూడ ముచ్చటగా ఉంది సీరియల్ ఒడిలో చెలి మోహనరాగం' మమ్మల్ని ఎంతో ఆకట్టుకొంది

చామర్తి సాయిగంగాధర్ విజయవాడ

* * *

క్రొత్తగా ప్రారంభమైన యం ఎస్ ఆర్ చౌదరిగారి సీరియల్ 'ఆశయం' బాగుంది

బి కేశవ్ నాయుడు, ఇతరులు, తాడేపల్లిగూడెం

* * *

"ఆశయం" క్రొత్త సీరియల్ కథ మమ్మల్నెంతో ఆకట్టుకొంది ముందు ముందు ఆసక్తిగా వుంటుందని ఆశిస్తున్నాను

సి హెచ్ ఉమా మహేశ్వరరావు కురుపాం

# మతాధిపతులుగా క్రీడాకారులు

క్రీడాకారులలో దైవభక్తి, పెద్దల యందు గౌరవము లేదని మనలో అనేకుల నమ్మకము పోటీలకు ముందు ప్రతి క్రీడాకారుడు తన అభిమాన దైవాన్ని తలచుకుంటాడు. ఇక క్రీడాకారులలో కొందరు మతాధిపతులు ఉన్నారన్నది చాలా మంది నమ్మరు. ఇది యదార్థము.

ప్రపంచ క్రైస్తవ మతాధిపతి రెండవ పోప్ జాన్‌పాల్‌కు ఫుట్‌బాల్ ఆటలో ప్రవేశము కలదు ఆయన కొంత కాలము పోలిష్ ఫుట్‌బాల్ జట్టు 'వాట్సిలా' అనే అమెచ్యూర్ క్లబ్ గోల్ కీపర్‌గా ఆడారు 1985 లో డౌన్‌హిల్ స్లలమ్ స్కి ఛాంపియన్ షిప్‌లో పోప్ పాల్గొన్నట్టు బి. బి. సి వార్తల్లో ప్రసారము చేసినది ఈ పోటీలు (మంచుపై జారు పందెములు) అనంతరము పోప్ రెండు 'స్కీస్' ధరించి మంచుపై అద్భుతముగా జారుచుండగా పోప్ అంగరక్షకులు 'వాటికన్ సెక్యూరిటీ'కి చెందిన భటుల్లు కూడా 'స్కీస్'తో పోప్‌ను మంచుపై అనుసరించారు. పోప్ క్రీడారంగములో తమ ప్రవేశము ప్రదర్శించి అందరిని ఆశ్చర్యపరిచారు ఇటాలియన్ 'డేవిస్ కప్' క్రీడాకారులు సమర్పించిన 'టెన్నీసు రాకెట్'తో పోప్ ఫోటో దిగుటకు ఎంతో సరదా పడ్డారు వింబుల్డన్ టెన్నీసు పోటీలలో ఆసక్తి చూపుటయే గాక ఫైనల్సులో జర్మనీ యువ క్రీడాకారుడు బోరీస్ బెక్కర్ విజయం పొందినప్పుడు 'వాటికన్' నుండి అతనికి పోప్‌ను దర్శించుకొనుటకు ఆహ్వానము పంపబడినది ఈ ఏటి మెక్సికో ప్రపంచ కప్ ఫుట్‌బాల్ పోటీలని కూడా పోప్ ఎంతో ఆసక్తితో పరిశీలించారు



1959లో పర్యటనలో అడవిలో గెడ్డం గీసుకొంటున్న రెండవ పోప్ జాన్‌పాల్

వీరి అసలు పేరు కరోల్‌వాజ్‌ట్యాలా (లోలస్, లోలక్ అని పిలిచే వారు). 1522 తర్వాత క్రైస్తవ పోప్ పదవి అలంకరించిన ఇటాలియన్ కాని పోప్, ప్రజల పోప్, అని వీరిని అనుట కలదు. దీనికి కారణము ప్రజలతో ఎక్కువ సంబంధములు యుండట అనవచ్చును. పోప్ అవటానికి ముందు బిషప్‌గా విశేష పర్యటన జరిపారు. పోప్ పదవి పొందిన ప్రథమ క్రీడాకారుడు ఈయన.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో 'వాల్టింగ్ వికార్'గా ఖ్యాతి పొందిన రాబర్ట్ – యి – రిచర్డ్ 1952, 1956 ఒలింపిక్ క్రీడలలో 'పోల్‌వాల్ట్'లో స్వర్ణపతక విజేత. పోల్‌వాల్ట్‌లో గెలుపు పొందిన క్రీడాకారుడు క్రైస్తవ పీఠాధిపతి (వికార్)గా మారారు కనుక వీరిని అభిమానముగా వాల్టింగ్ వికారు అంటారు. అగ్రగామి మహిళా టెన్నిస్ క్రీడాకారిణి బిల్లీ జీన్ మాఫిట్ మొదట అమెరికన్ బేస్‌బాల్ ఆట ఆడేది. అందులో విఫలమగుటతో రెవరెండ్ రిచర్డ్స్ (వాల్టింగ్ వికార్) ప్రోత్సాహముతో ప్రపంచ ఉత్తమ మహిళా టెన్నీసు క్రీడాకారిణిగా పేరు పొందటమే గాక వివాహము తర్వాత బిల్లీజీన్ కింగ్‌గా మారింది.

మరొక క్రైస్తవ సన్యాసి ఫ్రాన్సిడస్ ఎస్పెట్స్ పర్వతారోహణలో అనుభవము ఉన్నది. సరదాగా మంచు పర్వతాలని అరోహించే వారు. 1833 లో 81 వ ఏట మరణించు వరకు ఆయన పర్వతములపై సరదాగా కాలక్షేపము చేసే వారు కొందరు ఆయనని పిచ్చివానిగా మరికొందరు ఫ్రాన్స్ గూఢచారిగా అనుమానించేవారుట. 18 వ శతాబ్దపు మరొక పీఠాధిపతి రెవరెండ్ లార్డ్ ఫ్రెడ్రిక్ బ్యూక్లర్క్ క్రికెట్ వలన 600 పౌనులు సంపాదించే వారు. ఇప్పుడు లివర్‌పూల్ బిషప్‌గా ఉన్న రైట్ రెవరెండ్ డేవిడ్ షెప్పర్డ్ సుస్సెక్స్, ఇంగ్లాండు జట్ల క్రికెట్ ఆటగాడు. 1963 లో ఆఖరిసారి ఇంగ్లాండు జట్టుతో పర్యటించారు. 1950 – '63 మధ్యకాలములో ఇంగ్లాండు జట్టుతో పర్యటించి పోటీలలో పాల్గొనునప్పుడు అనేకసార్లు 'క్యాచ్' లను వదలి పెట్టేవారు ఒకసారి ఆస్ట్రేలియా పర్యటనలో ఒకచోట ఇంగ్లాండు జట్టుతో ఆడటానికి వెళ్ళినప్పుడు స్థానికంగా ఓ పిల్లవానిని నామకరణమునకు అక్కడి పాస్టర్ లభించకపోవుటచే డేవిడ్ షెప్పర్డ్ ఆ కార్యక్రమాన్ని నిర్వహించారు అదే ఆయన జీవితములో మార్పుకు కారణం అవవచ్చు ఇతర మతములలో కూడా మతాధిపతులుగా మారిన వారు యున్నారు

–ముకరమ్

---

ఎడప ఈ నాలుగు గ్రంథాలను పరిష్కరించిన వారిక మంత్రి గ్రంథాలు బహూకరించారు శ్రీ తిరుమల రాలేకపోయినందున ఆయన కుమార్తె డాక్టర్ నీరజా చక్రవర్తి గ్రంథం అందుకున్నారు శ్రీ లింగమూర్తి గారు రాలేనందున ఆయన ప్రతినిధి అందుకున్నారు తర్వాత విద్యాశాఖ డైరెక్టర్ శ్రీ ఎం ఎ వెంకటరెడ్డి ప్రసంగిస్తూ, మన ప్రాచీన చరిత్ర నాగరికత సంస్కృతి ఈ తాళపత్రాలలో వున్నాయని, ఇంకా సేకరించి ప్రచురించాలని. [illegible]కాలు జీర్ణం కాక మునుపే వాటిని భద్రపరచడానికి ఎయిర్ కండిషన్డ్ భవనాలు కావాలని, ఎస్ ఆర్ టి డైరెక్టరేట్‌లోని ఖాళీ స్థలంలో నాలుగంతస్తుల భవనం కడితే తాళపత్ర గ్రంథాలయం రెండంతస్తులు వాడుకోవచ్చునని అన్నారు. ఇతర రాష్ట్రాలలోని తెలుగు తాళపత్ర గ్రంథాలు సంపాదించాలన్నారు. అనంతరం గ్రంథాలయం సంచాలకులు (డైరెక్టర్) డాక్టర్ వి. వి. ఎల్. నరసింహారావు ప్రసంగిస్తూ ప్రచురించిన నూతన పుస్తకాల తాళపత్ర ప్రతుల పుట్టు పూర్వాలు వివరించారు. ఈ సంస్థలో నివారు గ్రంథాలను పరిష్కరించే నూతన సంప్రదాయం తొలిసారిగా ప్రవేశపెట్టామన్నారు. తమ గ్రంథాలయం విషయంలో ముఖ్యమంత్రి, విద్యామంత్రి, విద్యాశాఖ, సచివాలయం శ్రద్ధ చూపుతున్నందుకు కృతజ్ఞత తెలిపారు. గ్రంథాలయాధికారి శ్రీ వి. వెంకటేశాచారి అభినందనలతో ఆవిష్కరణోత్సవం సమాప్తమైంది

**ఉపశ్రుతి :–**

ఒకనాడు ఒక పెద్ద మనిషి సుప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ ఎ టి రెడ్డిని చూడవచ్చారు అప్పుడు శ్రీ రెడ్డి ఏదో చిత్రానికి రంగులు వేస్తున్నారు వచ్చిన పెద్ద మనిషి కుశల ప్రశ్నల తర్వాత, మీ చిత్రలేఖన వ్యాసంగం బాగా కొనసాగుతున్నదా?– అని ప్రశ్నించారు ఏముంది? బొమ్మలు గీసుడు, రంగులు పూసుడేకదా' అన్నారు శ్రీ రెడ్డి ఆ పెద్ద మనిషి శ్రీ రెడ్డి సహజ నిరాడంబరతకు అవాక్కయ్యారు

–తిరుమల రామచంద్ర

**Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.**
**Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667**

# మానసిక తత్వ శిఖామణి డాక్టర్ గిరీంద్రశేఖర్ బోస్



లుంబినీ పార్క్ మెంటల్ హాస్పిటల్

ఆర్థికంగాను, సామాజికంగాను వెనుకబడివున్నా వైజ్ఞానికంగా, సాంకేతికంగా మనదేశం ఇతర అభివృద్ధి చెందిన దేశాలకి ఏమాత్రమూ తీసి పోదనే నిజాన్ని ఎందరో మహనీయులు, మహానుభావులు నిరూపించటం జరిగింది అయితే కాలగతిలో దేశ గౌరవాన్ని నిలబెట్టటానికి వారు చేసిన కృషి మరుగున పడుతూ వుంటుంది అటువంటి వారిలో డా గిరీంద్రశేఖర్ బోస్ ఒకరు ఎందరో ప్రజ్ఞావంతులకి మన దేశంలో తగినంత గుర్తింపు దొరకటం లేదనేది ఎన్నో సందర్భాలలో నిరూపించ బడిన విషయం డా గిరీంద్ర శేఖర్ బోస్ విషయంలో కూడా ఇది మరో మారు తేట తెల్లమయింది

మానసిక తత్వ శాస్త్రంలో వీరి భావాలను, ఆలోచనా శక్తిని, తర్కాన్ని మనదేశం వారికన్నా ప్రప్రథమంగా గుర్తించినది మానసిక శాస్త్ర పితామహుడు ఫ్రాయిడ్ అంటే ఈయన గొప్పదనం ఎంతో మనం ఊహించవచ్చు

డా బోస్ బహుముఖ ప్రజ్ఞశాలి వైద్యుడుగాను, మానసిక రోగ చికిత్సా నిపుణుడుగాను, మనశ్శాస్త్ర నిపుణుడుగాను, మానసిక బావాల తర్కవేత్త గాను, చరిత్రకుడు గాను, ఫ్రాయిడ్ సిద్ధాంతాలను బెంగాలీ ప్రజలకు విశదీకరించిన వాడు గాను ఈయన చేసిన సేవలు ఎంతో కొనియాడ దగ్గవి ఈయన జన్మ సంవత్సరం 1886 గాని, 1887 గాని 1888 గాని అయివుండవచ్చుని పలువురి అభిప్రాయం జన్మదినం మాత్రం జనవరి 30 అని తేలింది జన్మస్థలం బెంగాల్‌లోని ధర్‌భంగా ఆయన తండ్రిగారు చంద్రశేఖర్ బోస్ ఈయనకి నలుగురు అన్నలు అయిదుగురు అక్కలు చిన్నతనం నించి ఇంద్రజాలం అంటే మక్కువ చూపేవారు హిప్నాటిజం ద్వారా ఎన్నో మానసిక రోగాలకు చికిత్స చేయవచ్చుని ఈ శతాబ్దం మొదటిలోనే ఈయన తెలియ జేశారు సైకో ఎనాలిసిస్‌తో కొన్ని మానసిక రోగాలకు చికిత్స చేయవచ్చుని 1909లో ఆయన గుర్తించటం జరిగింది మానసిక శాస్త్ర వివరాలు జర్మన్ బాషలో వ్రాయబడి వుండటంతో ఈయనకి ఎన్నో అసౌకర్యాలు కలిగాయి పత్రికలలోను, ఇతరత్రాను చూచాయగా తెలుపబడిన వివరాలే ఈయన సిద్ధాంతాలకు ఆధారమైనాయి

వైద్య కళాశాల నించి ఉత్తీర్ణులైన తరువాత నాలుగు సంవత్సరముల పాటు ఫిజియాలజీ విభాగంలో బోధకుడుగా పనిచేశారు 1917లో యం. యస్ సి పట్టాను పొందారు వెంటనే కలకత్తా విశ్వవిద్యాలయంలో మానసిక రోగ విభాగంలో పార్ట్ టయిమ్ బోధకుడుగా నియమింప బడ్డారు 1920 సంవత్సరములో సైకాలజీ శాఖకే ప్రధానోపాధ్యాయుడుగా అవటానికి ఆయన కృషి, మేదస్సు కారణాలంటే అతిశయోక్తి కాదు 1920 వ సంవత్సరములోనే ఇండియన్ అసోసియేషన్ పర్ మెంటల్ హైజీన్ అనే సంస్థకి ప్రధాన పోషకుడై ఈ సంస్థకి బ్రిటన్‌లోని నేషనల్ కౌన్సిల్‌తో అనుబంధం కల్పించారు 1921వ సంవత్సరములో ఒక మిత్రుడితో ఏర్పడిన వివాదం ఫలితంగా ఒక వారం రోజులలోనే డి యస్ సి థీసిస్ వ్రాయగలిగారంటే ఆయన పట్టుదల కార్య దీక్ష మనం గుర్తించ వలసి వుంటుంది కాన్సెప్ట్ ఆఫ్ రిప్రెషన్" అనే తన థీసిస్‌ని ఆయన ఫ్రాయిడ్ పరిశీలనార్థం పంపించారు ఇండియా వంటి దేశం నుంచి సైకో ఎనలిటిక్ విభాగంలో ఒక పుస్తకం ప్రప్రదమంగా వెలువడటం అనేది తనని ఆనందాశ్చర్యాలలో ముంచి వేసిందని, దానిలో కనపడే ఉద్వేగం, ఆలోచనా పటిమ, సునిశితమైన పరిశీలనా శక్తి తనని చకితుడ్ని చేశాయని ఆయన తెలియ జేశారు తరువాత కాలంలో డా బోస్ వ్రాసిన ఆపోజిట్ విషెస్ అనే సిద్ధాంతం తనకి నచ్చలేదని, ఈ విషయంలో తనకే ఒక నిర్దుష్టమైన అబిప్రాయం ఏర్పడలేదని ఉత్తరాల ద్వారా ఆయన బోస్‌కి తెలియజేశారు 1922వ సంవత్సరములో ఇండియన్ సైకో ఎనలిటిక్ సొసైటీ' స్థాపించి దానిని అంతర్జాతీయ సంస్థతో అన్వయించటం జరిగింది 1939 వ సంవత్సరములో ఈయన సైకాలజీలో మొట్ట మొదటి ప్రొఫెసర్‌గా నియమింప బడ్డారు 1933 వ సంవత్సరములో కార్‌మైకేల్ మెడికల్ కాలేజిలో ఈయన మొట్ట మొదటి సైకియాట్రిక్ క్లినిక్ ప్రారంభించారు అంతదాకా ఈ రోగులకి కటకటాల వెనుక బహుకొద్ది వైద్యులు మాత్రమే చికిత్స చేసేవారు ఈ చికత్సా కేంద్రాలలో కూడా వసతులు వుండేవి కాదు స్వచ్ఛందంగా డా బోస్ తన స్వయంకృషితోను, తన కుటుంబ సభ్యుల ఉదారత్వంతోను 1940 వ సంవత్సరములో సైకో ఎనలిటిక్ సొసైటీకి ఒక స్వంత ఆసుపత్రి (లుంబినీ పార్క్ మెంటల్ హాస్పిటల్) కట్టించారు ప్రభుత్వ సహకారం లభించక పోవటం, అదే సమయంలో బెంగాల్‌లో కరువు ఏర్పడి అల్లర్లు జరగటం చికాకు కలిగించినా ఈయన మనోబలంతోను, కార్య దీక్ష తోను ఎంతో ప్రగతి సాధించారు

డా. గిరీంద్రశేఖర్‌బోస్



రజతోత్సవం నాటికి అంటే 1965లో ఈ ఆసుపత్రిలోని పడకల సంఖ్య 175కి పెరిగిందంటే (బోస్‌గారు 1953లో పరమపదించారు) స్వచ్ఛంద సేవా పరాయణత్వం సాదించలేనిది ఏమీ లేదని నిరూపించబడినట్లే కదా! ఈయన ఇండియన్‌సైన్సు కాంగ్రెసు తోను, ఇండియన్ ఫిలసాఫికల్ కాంగ్రెసుతోను చాల ఎక్కువ సంబంధాలు కలిగి వుండేవారు

సైకాలజీలోను, సైకియాట్రీలోను వాడబడే సాంకేతిక పదాలకు బెంగాలీ బాషలో తగిన పదాలను కనుగొనటం ఈయన మనత స్వప్న. 'పురాణ్ ప్రవేశ్ అనే పుస్తకాలు, ఆంధ్రరాజుల వరుసక్రమాన్ని చూపించే వ్యాసం, దైనందిక జీవితంలో సైకో ఎనాలిసిస్ ఉపయోగాన్ని తెలిపే వ్యాసాల సంకలనం, సైకాలజీని అర్థం చేసుకోవటంలో బగవద్గీత ప్రభావాన్ని చూపించే పుస్తకం మనోబిద్యార్ పరిబాష అనేవి ఆయన చనిపోకముందే ప్రచురింప బడ్డాయి చనిపోయిన తరువాత పౌరాణిక అనే పుస్తకం ప్రచురింప బడింది పైరచనలన్నీ బెంగాలీ భాషలోనే వుండటం గమనించతగ్గ విషయం ఇంగ్లీషులో వ్రాయాలన్నా, తన వ్యాసాలను, పుస్తకాలను ఆంగ్లంలోకి తర్జుమా చేయాలన్నా ఆయన యిష్టపడేవారు కారట

అతిథి అబ్యాగతులను ఆదరించి ఉపచరించటంలోను, వంట చేయటం లోను కూడా ఎంతో ప్రావీణ్యం చూపేవారట తనపనులు తాను చేసుకోపటం లోను, తన బావాలపట్ల నిర్దుష్టమైన అబిప్రాయం కలిగి వుండటంలోను, కాలపు విలువ ఎరగటం లోను, పరిశుభ్రత, క్రమశిక్షణలోను ఆయనకి ఆయనే సాటి ఈయన వ్రాసిన వ్యాసాలు, ఉత్తరాలు, ఈయనకి ఫ్రాయిడ్ వ్రాసిన ఉత్తరాలు ప్రస్తుతం లభ్యం కావటం లేదు.

అందరూ భగవద్గీత చదువుతూ వుంటే డా బోస గీతలోనే జీవించారు అని యస్ పి మిత్రాగారు వ్రాయటం ఎంతో సమంజసం

ఇటువంటి మేధావులు మన దేశానికి చేసిన సేవ భారతీయులంతా గర్వించ తగ్గది . మనోబలం, కార్యదీక్ష, స్వచ్ఛందసేవా నిరతి మొదలైన గుణాలు పుట్టుకనించే వచ్చినప్పుడు ఎంతటి కష్టసాధ్యమైన పనినైనా సాధించే వీలుంటుందనీ. ఈ విషయంలో మనదేశం వారు ఇతరులకు తీసిపోరనీ వాటే డా బోస్‌గారి జీవిత చరిత్ర మనకందరికి కనువిప్పు కలిగిస్తుందని ఆశిద్దాం!

( మిసల్లేనీ లో చందాక్‌సేన్‌గుప్తా గారి వ్యాసం ఆధారంగా

ఫొటోలు ఇండియన్ సైకో ఎనలిటికల్ సొసైటీ సౌజన్యంతో )

–డాక్టర్ కె వెంకటేశ్వరరావు